# తొలి పలుకు

శ్రీ తెలుగు భాషా సమితివారు నిర్ణయించిన కార్యక్రమము నను సరించి ప్రకటించిన "కవిత్రయ కవితా రీతులు ; తరువాతి కవులపై వారి ప్రభావము" అను విషయమునుగూర్చి నా నేర్చిన ట్లీ వచన రచనను గావించి యా సమితివారికి పంపుకొంటిని. వారు పరిశీలించి యీ రచనకు నిర్ణయమైన 500-0-0 రూప్యముల బహుమానము నాకును, శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులు వారికిని చెరి సగముగా పంచి యిచ్చిరి. ఈ బహుమాన ప్రదానము శ్రీ రాష్ట్రపతి బాబు రాజేంద్ర ప్రసాద్ వారిచే హైద్రాబాద్‌లో 1956 సంII జూన్ నెలలో నిప్పించిరి. ఈ పొత్తము నచ్చొత్తించుట యితఃపూర్వమే జరుగవలసియుండినను . యింతవరకు ముద్రింపలేక పోయితిని. భాషా సమితివారు గ్రంథమును వ్యవహారభాషలో నుండవలెనని నిర్ణయించినందున నీ గద్యరచనమున గ్రాంథిక భాషా బద్ధ సూత్రములంతగా పాటింపబడ లేదు. సమితి వారికి నచ్చినందుకు సంతసించెదను. ఈ రచనకు బహూకృతి నిచ్చిన తెలుగు భాషాసమితివారికిని, నా యీ గ్రంథమును పూర్తిగా విమర్శనాదృష్టితో చదివి, తమ యమూల్యాభిప్రాయ మొసంగిన విద్వాన్ శ్రీ వేదము వెంకట కృష్ణశర్మగారికిని నా హృదయపూర్వక వందనము లాచరించుచున్నదానను. నా యీ రచనాకాలములో వలయు విషయముల సేకరించియు, తప్పొప్పుల పరిశీలించియు, నా కృషికి సహాయ మొనర్చిన నా తండ్రిగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కృతు లర్పించుచున్నాను. గుణగ్రహణ పారీణు లిందలి దోషముల మన్నింతురుగాక.

ఇట్లు
బుధజన విధేయ,
దేశిరాజు భారతీ దేవి.

భావపురి.



# పండితాభిప్రాయము

విద్వత్కవిభూషణ
విద్వాన్ వేదము వెంకటకృష్ణశర్మ.

66, సామిపిళ్ళై వీధి,
చూలై, మదరాసు-7,
19-1-1959.

శ్రీమతి దేశిరాజు భారతీదేవి గారు రచియించిన "కవిత్రయ కవితా రీతులు, తరువాతి కవులపై వారి ప్రభావము" అను గ్రంథమును, సమగ్రముగ, సవిమర్శముగఁ జూచితి. ఇది యొక యపూర్వ పరిశోధనతో వెలువడిన యుత్తమమగు మహోదాత్త కృతి. ఈ విషయములగూర్చి ఇతఃపూర్వము పెక్కురు వ్రాసిరి. కాని యవి కవిత్రయ రచనలలోఁ గల యవాంతర భిన్న భిన్న శాఖలను మాత్రమే పరామర్శించునవి. ఇది యట్టిది కాదు. కవితా రీతులను అన్నిటిని మూలముట్టుగ గాలించి, తరువాతి కవులు భారత కర్తృత్రయ కవితావైఖరులలోని ప్రయోగముల పారిశస్త్యమునకుఁ దమ రచనలలో నెట్టి స్థాన మొసంగిరో వివరించునది యీ గ్రంథము.

మహాభారత నిక్షిప్త నిగూఢ గభీర శబ్ద భావ రసాలంకారముల యౌచిత్య సామంజస్యమును దఱచిచూచి, తదనంతరము వెలువడిన కబ్బములలోఁ గవులెంతవఱకు వానిఁ బాటించి రనుటను, సరిపోల్చి చూచి, నిగ్గుదేల్చుపని సామాన్యమయినది కాదు.

కవిత్రయమునుండి యీనాటివఱకు, కవితా కళ ననేక విధములుగ — నానా ముఖములుగ వెలయించిన ప్రఖ్యాత కవులలో సహితము భారత మూలాగ్రము నిశితదృష్టితోఁ బరిశీలించిన వారెందఱుందురు? అందలి కవితాశిల్పములోని యనిర్వచనీయమగు శోభ నాకళించిన వారెందఱు? అమ్మహామూర్తుల కవితామృత త్రిపథగలో మునుకలు వెట్టిన వారెందఱు? ఆయా సందర్భములలో కవిత్రయము మెలఁగువతోఁ బాటించిన శబ్దౌచితి, రసౌచితి, పాత్రౌచితి తరువాతి కవు లెంతవఱకు పాటించిరి? తార్కికదృష్టితో చూచినపుడు విషయ మింతట నంతటఁ దేలునది కాదు.

నన్నయనాటి శబ్దములు నన్నెచోడుని నాటికి, నన్నెచోడుని నాటివి పాల్కురికి సోమనాథుని నాటికి, సదృశ్యమైనవి. ఉన్నశబ్దముల యభిప్రాయమును పృథగ్విధములు— నాచన సోముని ప్రయోగములకుఁ దిక్కన ప్రయోగములకుఁ గతిపయ భేదము లున్నవనుట పండిత జనైక వేద్యమే. ఇకఁ బొత్తు గుదురు టెట్లు? నన్నయ తిక్కనల కాలములఁ బరికించుచో, నిత్య నూతన స్ఫురణగల సారస్వతమందలి మార్పు ఊహింపరాని దగునుగదా? ఇకఁ బ్రబంధయుగ మారంభింపగనే, అనువాద

సాహిత్య మడుగునఁ బడినది. విజయనగర సామ్రాజ్య ప్రభుత్వము దానికి దోహద మిచ్చుటచే, సార్వభౌమాశ్రయాభిలాషము ప్రేరేప, పదునాఱవ శతాబ్దము నుండి, కవులు కొన్ని వినియములతోను గవి సమయములతోను మనుచరిత్రమునకు నకళ్లుగా, ప్రబంధములు సృష్టింప నారంభించిరి. అట్టివానిలో భారత కవిత్రయ చ్ఛాయలయినఁ గనఁబడమి వింతకాదు.

ప్రకృతము శ్రీ భారతీదేవిగారు రచించిన యీ పరిశోధక గ్రంధమును జాల శ్రమించి వ్రాసిరనుటకీ కృతినుండి యనేకోదాహరణము లీయవచ్చును. కాని 'తినఁ బోవువారికి రుచు లడ్గడించిన ట్లుండుననియు, ఈ నా యభిప్రాయము ఇంకను విస్తరింపఁజేయుటచే ననవసరముగఁ బుటలను బెంచినట్లగుననియును ఆపని మానితిని.

సారస్వత పరిశోధనకుఁ బూనుకొని, వివేచనా పాటవముతో మహా భారతాదిక గ్రంథములను బూర్తిగఁ బరిశీలించినవారు మన తెలుఁగు వారిలో మిగుల కొలంది మంది. శ్రీ భారతీ దేవి గారి కృషి సారస్వతమునకు సంబంధించిన దగుటచేతను ఆదియుఁ బూర్వాపర కావ్య తారతమ్య పరామర్శావిష్కరణ మగుటచేతను, అత్యంత నిశిత మతితోఁ బరికించి, తాఁ గనుగొన్న నూతనాంశముల నాంధ్ర లోకమున కుపాయనమొనర్చి, కృతార్థురాలయినది. ఈ సోదరీమణి వాఙ్మయ రంగమున నింకను బెక్కు విషయములను గూర్చి పరిశోధించి, ప్రకటింప సమర్థురాలని నా యభిప్రాయము. సారస్వత సాగరమున మునింగి లోఁతుపాతుల నరయువారి కందలి రత్నము లసంఖ్యాకములుగఁ జేపడఁగలవు. శ్రీ భారతీదేవిగారివంటి మహిళామణు లామణులచే నాంధ్రికి శాశ్వతముగఁ బ్రకాశించు కంఠహారము లొనరింతురు గాక! ప్రతిభాసమేత లయిన యువతీమణు లింకను బయల్వెడలి శ్రీ భారతి దేవి గారు చూపిన మార్గము ననుసరించి, ఇట్టి పరిశోధక గ్రంధముల వెలయింతురు గాక! అని నా యాశయము.

తెలుఁగు భాషాసమితి బహూకృతియు, గేసరిగారి కనక కంకణోపాయనమును శ్రీ భారతీ దేవి గారికి లభించుట మెచ్చుకొనఁదగిన విషయము. ఆమెగారి కృషి కది సహజముగఁ గలిగిన సమ్మానము, కాని రాష్ట్ర ప్రభుత్వ మామెగారి పరిశ్రమను గుర్తించి, తగురీతి సమ్మానించిననాఁడే యాంధ్రు లానంద మందఁగలరు.

భాషాజీవి,

వేదము వెంకటకృష్ణశర్మ.

# అంకితము

సీ॥ పరమ క్షమాపూత ధరణీ సతీ జాత
యన నబ్బురంబుగా నవని బుట్టి
జనక మహారాజ సౌధాగ్రసీమల
పూల డోలికల నుయ్యాల లూగి
రవికులారామ మాధవ రామచంద్రు
నూర్జిత యశశ్చంద్రుని చెట్టబట్టి
పరమ పతివ్రతాభరణ సంతతిలోన
నగ్రగణ్యఖ్యాతి నలరినట్టి

భువన సంజాత లోకైక మాత సకల
పూత గుణభూత మహిమాసమేత సీత
పాద కంజాతముల కాత్మ ప్రణతి జేసి
యంకితం బిత్తు నీ గ్రంథ మతుల భక్తి.

ఇట్లు
దేశిరాజు భారతీ దేవి.



*Prize awarded to*

**Smt. Desiraju Bharatidevi**

*for the book*

**"KAVITRAYA KAVITA REETULU"**

*on*

*"Kavitrayamu – their influence on later Telugu poets."*

**Rs. 250/-**

# కవిత్రయ కవితారీతులు
# తరువాతి కవులపై వారి ప్రభావము

ఆంధ్రులు మిక్కిలి ప్రాచీనులు. వీరి భాషయును కడు ప్రాచీనము. ఆంధ్ర భాష యత్యంత రమ్యము. ఆంధ్ర కవిత్వము కడుంగడు రమణీయము. హైందవ విజ్ఞానమునకు మూలకందమైన వేదవాఙ్మయమునందు నాంధ్రు లొక జాతివారై వ్యక్తిత్వము, ప్రత్యేకత ప్రసిద్ధి గాంచినట్లు నిదర్శనములు గలవు. వేదకాలమును, సూత్రకాలము నిదమిద్ధమని రూఢిగా చెప్పుట కష్టము. దురూహ్యము. చరిత్ర కందరానిది. ఈ గ్రంథమున ప్రధాన విషయము "కవిత్రయ కవితా రీతులు, తర్వాత రచనలపై వారి ప్రభావము" మున్నగునవియే యైనను వారి రచనా వైలక్షణము, భాష, కవితాలక్షణము మాత్రము వర్ణింపవలసియున్నను వారి కవితా లక్షణము, భాష యాకస్మికముగా నొకదినముననే యుట్టిపడక క్రమ క్రమాభివృద్ధి, పరిణతి గాంచిన యాంధ్ర భాషపై యాధారపడి యున్నందున ఆంధ్ర భాషా ప్రాచీనతను గూర్చియు, సంస్కృత భాషా ప్రభావము, తెలుగు భాషపై నేరీతిగా చూపి తెలుగు భాషా స్వరూప స్వభావములను తీర్చి దిద్దినదియు నించుక తెలుపవలసియున్నది. ఆంధ్ర భాషలో ప్రాయికముగా సంస్కృత భాషాపదము లధికముగా కనఁబడుచున్నవి. తత్సమ పదరూపముగానో, తద్భవ పదరూపముగానో సంస్కృత షదములే తెలుగు భాషలో బహుళ వ్యాప్తినందియున్నవి. దేశ్యపదములు, గ్రామ్యపదములు కొన్ని యున్నను ఆపదములు మాత్రమే యుపయోగించి వ్యవహారము జరుపుటకును కావ్యములు, వ్యాసములు వ్రాయుటకును సాధ్యముగాదు. ఇప్పటికిని, లిపి లేక పర్వతారణ్యములలో

నివసించు కోయ, లంబాడి, చెంచు మున్నగు కొందరుతప్ప తక్కిన వారు అనగా పట్టణములందును, జనపదములందును నివసించి యుంచుక నాగరికతనంది వ్యవహారములు జరుపుకొను ప్రజలు సంస్కృత, ఆంధ్ర పదములతోగూడిన మిశ్రమ భాషనే వాడుచున్నారు. సంస్కృత శబ్దములను యథాతథముగా నుంచి విభక్తి ప్రత్యయములను మాత్రము జేసేర్చి తత్సమములుగా జేసియు, సంస్కృత శబ్దములకు వర్ణ వ్యత్యయ, వర్ణలోప, వర్ణాగమములు గలిగించి తద్భవ రూపములుగూర్చి ప్రకృతులకు వికృతిరూపములు కల్పించియు 'గీర్వాణాంధ్ర పద సమాహారము గావించి' ఆంధ్ర భాషయను పేరుతో వ్యవహరించుచున్నారు. ఆంధ్ర దేశమున సంస్కృత భాషాశబ్ద ప్రయోగములతోగూడిన భాష నుపయోగించుటకు మంచికారణము లుండకపోవు. ఆకారణము తెలిసికొనుట కొంత యవసరము. అందువలన నాంధ్రు లెవరో ముందు తెలియవలసియున్నది.

ఆంధ్రు లార్య జాతివారనుటకు సందేహము లేదు. ఆర్యావర్తమునుండి యేదో కారణముచేత దక్షిణాపథమునకు వలస వచ్చినట్లున్నది. వీరు విశ్వామిత్రుని వంశమునకు సంబంధించిన వారిలో కొందరు, ఈ భాగమునకు వచ్చిన సూచన లచ్చటచ్చట పురాతన గ్రంథములలో దెల్పబడియున్నవి. ఆర్యు లందరుగలసి యేకశాఖగా నుండినంతవరకు అనగా వేదములలోని మంత్రభాగ ప్రకారము వీరు ప్రత్యేక శాఖీయులుగా నున్నట్లు నిదర్శనములు లేవు గాని సూత్రకాలమని వ్యవహరింపబడు దినములకు ఆంధ్రులు తా మొక ప్రత్యేకశాఖ నేర్పరచుకొని తమకు విశిష్టమైన యాచార వ్యవహార కాండ నిర్మించుకొన్నట్లు తెలియుచున్నది. ఆంధ్రు లాపస్తంబ సూత్రముల ననుసరించి తమ తమ కర్మల ననుసరించుచున్నారు. వీరి వాఙ్మయమునందు "ఆపస్తంబ కల్పసూత్రములే" మిక్కిలి ప్రాచీనమైయున్నవి. తరువాతివి ఆశ్వలాయన సూత్రములు. ఆంధ్రు లేశాఖకు చెందినదియు స్పష్టపడినది. ఆపస్తంబుల వా రాంధ్రులేయనియు విశ్వసింపబడుచున్నది. నిర్దిష్టమైన వత్సర క్రమముగా చరిత్ర మనకు లేనందున ఆ ఋషి

వరులు ఏ కాలపువారో స్పష్టముగా చెప్ప వలనుపడదు. ఇందువిష యమై యూరోపుఖండస్థ పండితులుచేయు కాలనిర్ణయముపై మన మాధారపడి యున్నాము. అట్టి పండితుల యభిప్రాయమునుబట్టి చూచినను ఆపస్తంబు లిప్పటికి సుమారు 2,500సం॥లకు పూర్వమున్న వారేగాని పిమ్మటివారు కానట్లు తెలియుచున్నది. కావున నప్పటికే యాంధ్రదేశము, ఆంధ్రులు ఉండినట్లు తెలియనగును. ప్రజలకొక భాషయుండక తప్పదు, గనుక నాంధ్ర భాష యప్పటికే యుండినట్లును నిర్ధరింపవచ్చును.

అప్పటి తెలుగు భాషా గ్రంధములు దొరకుట చాలకష్టము. ఈ విధముగా నవీన చరిత్రకారులు చెప్పుచున్నారు. కాని యింతమాత్రపు ప్రాచీనత మాత్రమే కలవారని నిర్ధారణచేయుట సమంజసము గాదు. వేద వ్యాసులు భారతము రచించునాటికే యాంధ్రు లున్నట్లు తెలియుచున్నది. కురు పాండవయుద్ధమునకు ముందే ధర్మజ రాజసూయ సందర్భమున నాంధ్రు లున్నట్లు ప్రస్తావింపబడి యున్నది. ఈ రాజసూయ మహోత్సవమునకు రాజు లనేకులు వచ్చినట్లును, వారిలో నాంధ్రులుసైత మున్నట్లును శ్రీ మహా భారత సభాపర్వము 37-వ అధ్యాయమున చెప్పబడియున్నది. సహదేవాను శాసనమున వచ్చినవారి పట్టికలో నిట్లున్నది :

శ్లో॥ పౌంద్రకో వాసుదేవశ్చ వంగః కాళింగక స్తథా
ఆకర్షాం కుంతలాశ్చైవ గాల వాశ్చాంధ్రకా స్తథా ॥

ఈ విధముగా నాంధ్రుల ప్రస్తావన మున్నది. భారతవంశ ప్రాభవకాల మెంత ప్రాచీనమో మనము సులభముగానే తెలిసికొనవచ్చును. పాశ్చాత్య చరిత్రకారు లేమి చెప్పినను మన లెక్కల ప్రకారము ద్వాపరాంత సమయమే 5,000 సంవత్సరముల కంటె కొంచమధిక మని యూహింపవచ్చును. జ్యోతిషజ్ఞుల లెక్కల ప్రకారము కల్యాద్యబ్దము లిప్పటికి 5,054 సం॥ లు అయినవి. వ్యాస రచిత భారత కావ్యముకూడ నా ప్రాంతములోనే రచింపబడి యుండును.

కావున నందు ప్రస్తావితమైన యాంధ్రజాతి అతః పూర్వమే యుండి రాజ్య నిర్వహణము చేయుచు తక్కిన రాజ్యములతో బాటు సమాన గౌరవ ప్రతిపత్తులు గలిగి యుండినట్లు విశ్వసింప వలయును. భారతకాలమున కెంత పూర్వులో వారెవరే యే వంశమునకు చెందినవారో తెలిసికొన వలెనన్న చో శ్రీమద్భాగవతమున నవమస్కంధమున "రంతిదేవుని చరిత్ర" సందర్భమున చదువ వచ్చును. అందు నాంధ్రుడను రాజు తన పేరే తన రాష్ట్రమునకు పెట్టినట్లు చూపట్టుచున్నది. యయాతి వంశస్థుడగు బలియను రాజునకు, అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్ర, ఆంధ్రులను నార్వురు పుత్రులైనట్లును, వారు తూర్పు దేశమునకు రాజులై దేశంబునకు తమ తమ నామధేయంబులిడి పాలించినట్లు భాగవతమున స్పష్టముగా గలదు. వీరు భారత కాలమునకు ముందేయుండి ప్రతిష్ఠ వహించిన వారగుటచేతనే యుధిష్ఠిర రాజసూయమున కాహ్వానింప బడియుండుట సంభవము.

ఇక భారత కాలమునకే సందేహములు గలవు. పాశ్చాత్య చరిత్ర కారుల యూహలను బట్టి క్రీస్తు పుట్టుటకుముందు కొన్ని వందల సంవత్సరముల క్రిందట మాత్రమేయని తెలును. వంగదేశ పండితుడును సుప్రసిద్ధుండునగు శ్రీ బంకించంద్ర ఛటర్జీగారు శ్రీకృష్ణుని జీవితమును వ్రాయుచు కాలనిర్ణయము చేయువలసివచ్చి విపులముగా చర్చించి యుధిష్ఠిరశకము ప్రారంభ వత్సరమును నిర్ణయించి, భాగవతమున శ్రీ కృష్ణ జననకాల గ్రహస్థితి ననుసరించి లెక్కలుగట్టి కొంతవరకు నిర్ధారణకు వచ్చెను. దాని కనుగుణముగా భారతయుద్ధ ప్రారంభ దినముననుండిన గ్రహస్థితినిబట్టి గుణింపగా వచ్చెడి ఫలితములు ఇంచుమించుగా సరిపోవుటవల్ల నిప్పటికి సుమారు 4,600 సంవత్సరములకు ముందే శ్రీ కృష్ణుని యవతారమని తీర్మానించియున్నారు.

ఈ విషయ మింతగా వ్రాయుటకు కారణము తెలుగు జాతి చాల ప్రాచీనమని చూపుటకే! ఇంత ప్రాచీనమైన జాతికి తగిన నాగరక

భాష లేకపోవుట సంభవింపజాలదు. వీరికి విశిష్టమైన నాగరకత గలిగి చిత్రలేఖనము, శిల్పము, నౌకానిర్మాణాది వివిధ విద్యాకౌశలము లున్నట్లు పాశ్చాత్య పండితులు సయిత‌ మంగీకరించుటంజేసి కవితా కళ కూడ కల్గియుండినట్లు తలంపవచ్చును. అంతేగాక వీరి కిరుగు పొరుగు వారైన ద్రావిడులకు పైన దెల్పిన విద్యలయందు నైపుణ్యము, సముచితమైన నాగరకత, సమగ్ర భాషాభివృద్ధి, పురాతన స్వతంత్ర వ్యాకరణాదిక భాషా సంప్రదాయక గ్రంథ సమృద్ధి గలిగియుండెననుట నిర్వివాదాంశము. ఇట్టి హేతువులచే నాంధ్ర భాషయందును చిరకాలము నుండియు కావ్యము లుండక తప్పదని సులభముగా నూహింపవచ్చునుగదా!

సుమారు రెండు వేల సంవత్సరముల క్రిందట శాతవాహనుడను నాంధ్రుడు చక్రవర్తి యనిపించుకొని పెక్కండ్రు పండితుల నాదరించి కావ్యములు వ్రాయించి గౌరవించినట్లు కనబడుచున్నది. అందువలన నన్నయభట్టారక మహా కవికి పూర్వమే యాంధ్ర కవిత్వము, ఆంధ్ర కావ్యము లున్నట్లు తలంచుట తప్పుగాదు. ఇటీవల చేయబడిన పరిశోధనల ఫలితముగా లభ్యమైన గ్రంథములనుబట్టియు, నన్నెచోడాది కవులు నన్నయగారికి పూర్వమే కావ్యములు వ్రాసినట్లు తెలిసినది. నన్నెచోడ మహా కవి కవిత్వము మిక్కిలి రసవంతమై, శ్రావ్యమై, ప్రౌఢమైన ట్లాతనిచే రచింపబడిన "కుమార సంభవ" మ్మను కావ్యము ఋజువు చేయుచున్నది. ఆంధ్ర దేశము పూర్వమితరుల పరిపాలనలో చాలకాలముండిన కారణమువల్ల పూర్వ గ్రంథము లనేకములు లిఖిత గ్రంథము లగుటవల్ల, ముద్రాయంత్రములు లేనందువల్ల, శత్రురాజుల, వారిసేనల దుశ్చర్యలవల్ల నాంధ్ర దేశమున ప్రధాన విద్యాస్థానము దగ్ధముచేయబడి యుండుటవల్ల అప్పటి గ్రంథములు నశించుట వింతగాదు. రాజమహేంద్ర పట్టణ ప్రాంత దేశము వేగినాడని పిలువబడు భాగమునకు "దగ్ధరాష్ట్రిమ" ను పేరువచ్చినది. ఇత్యాది వివిధకారణములచేతను పాలిత జాతి తమ వ్యక్తిత్వము గోల్పోయి పాలకజాతి భాషను, భాషా సంప్రదాయములను గ్రహించి

స్వభాషను విస్మరించుట, తమ పురాతన గ్రంధముల నిరాదరణతో చూచుట వలన పూర్వగ్రంధ సంపత్తి నశించిపోయినది. అట్లుపోవుటయు సహజమే. ఏ కారణముచేతనైననేమి "కవిత్రయ భారతము నకు" పూర్వమందుండిన యాంధ్ర కావ్యములు, లేనట్లే యెంచవలసి యున్నది.

---

# నన్నయ భట్టు.

ఈ మహాకవి యాంధ్ర భారతము రచించిన వారిలో మొదటి వాడు. ఆంధ్ర భారతమే తెలుగు కావ్యములలో ప్రథమ కావ్యమని విశ్వసించుటచేత మహాభారతము నారంభించిన కవియగు నన్నయ భట్టారకుని యాదికవి యనియు, భారతము నాదికావ్యమనియు తలంచుచున్నారు. హైందవ వేద విజ్ఞానమునందును, సనాతనాచార ధర్మ విశ్వాసమునందు నత్యంత గౌరవము గల్గిన మహాపండితుడును, లౌకిక విజ్ఞాన సంపన్నుడునైన నన్నయభట్టు "విశ్వశ్రేయః కావ్య"మ్మను తలంపుతో శ్రీ వేద వ్యాస రచిత మహా భారతము నాంధ్రీకరించు తన కాశ్రయుడైన రాజరాజ నరేంద్రున కంకిత మిచ్చెను. మహాభారతము సకల విజ్ఞానముల కాలవాలము. వేద వ్యాసుడు సకల వేదములను విభాగమొనర్చి, అచ్చుకట్టి సువర్ణక్షేత్ర కేదారములుగా నిర్మించి, దానితో తృప్తినందక సమస్త సామాన్య జనులకును వేదవిహిత ధర్మము లందుబాటునకు దెచ్చుటకై సమగ్రమగు కావ్యమును రచించి పంచమ వేదంబని పేరిడి లోకమునకు ప్రసాదించెను. ధర్మ నిశ్చయమునకు భారతమే ప్రమాణము. శ్రుతి, స్మృతులలో భిన్నార్థము లున్నట్లు సందేహములు గల్గినయెడ నా సందేహ నివృత్తికి భారత వచనమే నిశ్చయవాక్కు. అందుచేతనే తిక్కన సోమయాజి భారతమును లేఖ్యంబైన యామ్నాయ మని వ్రాసి,

కం॥ వేదములకు నిఖిల స్మృతి
వాదములకు బహు పురాణ, వర్గంబులకున్
వాదైన చోటులను తా
మూదల ధర్మార్థ కామ, మోక్ష స్థితికిన్॥

యని భారతమును ప్రశంసించెను. ఈ విషయము నే నన్నయ భట్టుగా రాది పర్వమున విపులముగా వక్కాణించిరి. భారత మహిమ

యనేక విధములుగా నభివర్ణింపబడిన నీ పద్యమును గాంచుడు :

సీ॥ కమనీయ ధర్మార్థ కామమోక్షములకు
నత్యంత సాధనం బైన దాని
వేడ్కతోఁ దవిలితన్ వినుచున్నవారల
కభిమత, శుభకరం బైన దాని
రాజుల కఖిల భూరాజ్యాభివృద్ధిని
నత్యాభ్యుదయ ప్రదం బైన దాని
వాఙ్మనః కాయ ప్రవర్తితానేక జ
న్మాఘ నిబర్హణం బైన దాని

సత్యవాక్ప్రబంధ శతసహస్ర శ్లోక
సంఖ్యమైన దాని సర్వలోక
పూజ్యమైన దాని, బుధనుత వ్యాస మ
హా ముని ప్రణీతమైన దాని॥

అని వ్యాస మహా భారత మహిమను విశదీకరించిరి. ఇట్టి మహోత్తమ గ్రంథము నాంధ్రుల కుపయోగ పడునట్లు చేయుటయే పరమావధిగా బెట్టుకొని నన్నయగారు రచన మారంభించిరి. ఆంధ్ర సంస్కృత భాషలు రెండింటను సంపూర్ణ పాండిత్యము గల్గి యున్నందునను, ఆది కవి యగుటచేతను, ఉభయభాషాశబ్ద రత్నరాసుల నుండి స్నిగ్ధములైన స్థూల రత్నముల నేర్చి కూర్చి తన కావ్యమున నిబంధించుకొనుట కవకాశ మాతనికి గల్గినది. అందుచేతనే యుభయ భాషలలో సరళములై, శ్రావ్యములై, మనోహరములైన పదజాలము లన్నియు నన్నయగారు తన కవిత్వమున చొప్పించినారు. ఇంతియే గాక తన కావ్యమునకు కొన్ని నియమము లేర్పరచుకొని సమర్థతతో నిర్వహించియున్నారు. ముఖ్యముగా నతని కవిత్వమున (1) అక్షర రమ్యత (2) రుచిరార్థసూక్తి (3) ప్రసన్న కథా కలితార్థయుక్తి నిండుకొన చేయుదునని ప్రతిజ్ఞ చేసి యా ప్రతిన నెరవేర్చుకొన గల్గెను. ఈ మహాకవి కవిత్వమున సంస్కృత పదములు రెండు వంతులును, తెల్గు పదములొకవంతు మాత్రమే యున్నను, ఉభయ వాక్య ప్రయోగదక్షత కనుపడుచున్నది. ఈ కారణము చేతనే

శ్రీనాథ మహాకవి "పలికింతు నన్నయభట్టు మార్గంబున, నుభయ వాక్య ప్రౌఢి నొక్కమాటు" అని నుడివెను. కవిత్వము నిరర్గళ ధార గలిగి, చదువుట కింపై అమృత ప్రవాహమువలె నున్నది. అచ్చటచ్చట ధ్వనులును, శబ్దాలంకారములును విరివిగా వెదజల్లబడి యున్నవి. ప్రప్రథమమున నన్నయభట్టుగారు భారతము నే దృష్టితో జూచి, యెందుకొఱకు తెనిగించెనో కొంచెము లోతుగా విచారించవలెను. వ్యాసుల వారేవిధముగా భారతము వ్రాసిరి? ఆయన "జగద్ధితంబు"గ వ్రాసియుండెను. జగద్ధితంబుగా ననగా, వర్ణాశ్రమ మత విభేదము, స్త్రీ పురుష తారతమ్యము, అజ్ఞ, ప్రాజ్ఞ విచక్షణ లేక సకల మానవులకును సమస్త విధ ధర్మములను, బహుళ సంఖ్యాక శాస్త్ర విజ్ఞానమును ప్రసాదించుట ద్వారా యెల్లరికిని హితము గూర్చుటయే కృష్ణ ద్వైపాయనుని సంకల్పము. అందువలననే భారత కావ్యము పంచమ వేదమయ్యెను. భారతము ననేక పర్యాయములు సవిమర్శకముగా పఠించి సారస్యమును గ్రహించి, బ్రహ్మణ్యమూర్తి యగు వ్యాస మహాభారతమును ఆది పర్వారంభమున నభివర్ణించుచు,

సీ॥ ధర్మ తత్త్వజ్ఞులు, ధర్మశాస్త్రం బని
అధ్యాత్మ విదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్, నీతి శాస్త్రం బని
కవి వృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్ఛ
యం బని మహి గొనియాడుచుండ

వివిధ వేదతత్త్వ వేది వేద వ్యాసు
డాది ముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు॥

అని "విశ్వజనీనమై పరగుచుండ" అను వాక్యమును జేర్చి విశ్వశ్రేయోభిలాష రహస్యమును నన్నయగారు వెలడించినారు.

ధర్మతత్త్వజ్ఞు లనగా, వేదచోదిత కర్మానుష్ఠాన పరులును, తత్సంబంధములగు ధర్మశాస్త్ర విజ్ఞానులును, అనగా వర్ణాశ్రమాచార పరులై కర్మకాండ రతులై కర్మబ్రహ్మవాదులైన వారు, భారతమునందు వేద నిగదితమైన సకల ధర్మములు, తదనుష్ఠాన పద్ధతులు, తత్తత్ఫలములు మున్నగు విషయము లన్నియును సువ్యక్తముగా నున్నందున నది ధర్మశాస్త్రమే యని భావింతురు. ఆధ్యాత్మవిదులన్నచో, భారతమున ఆత్మానాత్మ వివేకమును బోధించి వైరాగ్యమును, నిష్కామ కర్మాభిరతియు, ఉపనిషద్విజ్ఞానమును వికాసించునట్లు వేదాంత భావముల నెల్ల ననువదింపబడి యుండుటచేత నా గ్రంథమును వేదాంతముగా విశ్వసింతురు. అట్లే నీతిశాస్త్ర కోవిదులు భారతారణ్య, శాంతి, అనుశాసనిక పర్వములలో చెప్పబడిన పలువిధములగు నీతులు చూచి, అయ్యది నీతిశాస్త్రంబని తలంతురు. నిజముగా భారతమున లేని నీతు లెందేని గలవా? ధర్మము లెందేని గల్గునా? అట్లే తక్కిన శాస్త్ర విజ్ఞానముగల వారు భారతము తమ తమ విజ్ఞాన ధన మంతయు గల మహత్తర బహుళ విజ్ఞాన సర్వస్వమని నమ్మి దానియం దత్యంత గౌరవభక్తి ప్రపత్తులు గలిగి యున్నారు. ఈ కారణముచేతనే ఆ సేతు హిమాచల పర్యంత సమస్త భారతావనిలో హైందవ జాతికెల్ల భారతము పరమ ప్రమాణ గ్రంథమై నాటినుండి నేటివరకును పూజింపబడుచున్నది. భారతము వంటి బహుళతర విజ్ఞాన పూర్ణమైన మఱియొక గ్రంథ మెచ్చటను భూమండలమున లేదని యొక పాశ్చాత్య పండితుడు నుడివి నాడట! అనగా ననేక గ్రంథములందు అనేక విషయములు చెప్పబడిన మాట వాస్తవమేగాని యొకే గ్రంథమున నన్ని విషయములు, అన్ని శాస్త్రముల విజ్ఞానము ఎందును చెప్పబడ లేదు. అట్టి వివిధ విజ్ఞాన సాహితి యంతయు వ్యాస భారతేతిహాసమున తత్తత్సందర్భోచితముగా సంఘటింపబడియున్నది. అట్టి కావ్య ప్రయోజనము లోకహితమేగదా! అయితే వ్యాస మహాభారతమునకు ముందు వేదశాస్త్ర పురాణములు ఆ యా గ్రంథములలోని ధర్మములు, నీతులు వివరింపబడి యుండగా

ప్రత్యేకముగా వ్యాసుడీ విధముగా వ్రాయ నేల యని కొందరికి శంక వచ్చును. అందులకు తగిన సమాధానము గలదు. కురుక్షేత్ర సంగ్రామమునకు పూర్వము రాజులును, బ్రాహ్మణులును, వారి ననుసరించి తక్కిన వర్ణములవారును వేదములందు పరమాదరము గల్గి యుండెడి వారు. తక్కువ వర్ణములవారు బ్రాహ్మణులయందు భక్తి, గౌరవములు గల్గి యుండెడివారు. బ్రాహ్మణులన్ననో, నిరంతర తపస్స్వాధ్యాయ శీలురై, త్యాగధనులై, గురుభక్తులై, దైవభక్తులై, శాపానుగ్రహ శక్తి మత్తులై యుండెడివారు. వారి ఆశయములు :

"గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం"

"సర్వేజనాః సుఖినో భవంతు"

"లోకాస్సమస్తాః శుభమస్తు నిత్యం"

అనునవియే, వైదికమత ధర్మాశయము లివియే, కావున తద్ధర్మరక్షణయందు విప్రులు, రాజులు శ్రద్ధ జూపెడివారు.

కాని భారత యుద్ధముతో ముగిసిన ద్వాపర యుగాంతమునకు కొంత పూర్వము నుండియు సంఘము రాజకీయ విప్లవాది సంఘటనల చేతను, వివిధరాజులకు గల్గిన పరస్పర విజిగీషల ఫలితములైన రకరకముల సంగరములచే భిన్నభిన్న సంఘములు, భిన్నభిన్న మతములు, భిన్నభిన్న పూజా విధానములు, ఆయా మతవర్గముల మధ్య సంభవించిన విభేదములు చెలరేగి, దేశ మల్లకల్లోలమై మత వైరుధ్యములతో బాటు సంఘ ద్వేషములు పుట్టినందు చేతను సమన్వయము, శాంతి దుర్ఘటమై యుండెను. ఇంతలో కురు పాండవ యుద్ధము సంభవించి దేశము భిన్నాభిన్నమైనందున శాంతి ఐకమత్యముల గల్పించి పరస్పర వైషమ్యములకు తావులేకుండ జేయుటకై వైరుధ్యములేనిభంగి నూతన పరిస్థితుల ననుసరించి రెంటిని సమన్వయ పరచుట యవసరమైనందున భారత యుద్ధ చరిత్ర వ్రాయు సందర్భమున వ్యాసుల వారు భక్తి, కర్మ, జ్ఞాన మార్గముల కవరోధము నెలకొల్పి జగద్ధితము జేసినారు. అట్లు

కానిచో, నన్న దమ్ముల కొట్లాట వర్ణించుపట్ల సకల వేద వేదాంతార్థ సిద్ధాంతములను చొప్పించుట, చర్చించుట, సిద్ధాంతీకరించుట సంభవింపదు. ఇది యంతయు కొంత యప్రస్తుతముగా తోచవచ్చును. కాని వ్యాసులవారు వేసిన పథకము విమర్శ నాదృష్టితో పరిశీలించినచో నా మహామహులు త్రొక్కిన పంథా గమనించినచో విషయము సుగమ మగును.

## ఆంధ్రీకరణము.

జనసంఘములో భిన్న భిన్న ప్రకృతులు, భిన్న భిన్నాశయములు, భిన్న భిన్న వాంఛలు విజృంభించి వేరు వేరు మార్గములు. వర్తనలు, ఫలములు, ఉత్పత్తిల్లుటకు హేతువు లగుట సహజము. ఏతద్వివిధ గతుల వ్యవహరించు మానవుల కందరకును వినియోగపడు మార్గములను పరస్పరము సమన్వయ పరచుచు హితము గలుగజేయునట్లు పొసగించి, ఆర్య ధర్మముల వ్యాప్తికి దోహదము జేయుచు వానికి ప్రాధాన్య మొసగుచు, ఆధ్యాత్మిక దృష్టితో "కాంతా సమ్మితం కావ్య" మ్మను సూత్రము ననుసరించి కురు పాండవ గాధ నొకయుపాధిగా జేసి సమస్త ఆర్య ధర్మములను లోకమునకు కృష్ణద్వైపాయనులు వెదచల్లిరి. ఆ మహర్షి యాశయముతోనే, అట్టి పరిస్థితులలోనే నన్నయ భట్టారకులు భార తాంధ్రీకరణ ప్రారంభించిరి. ఈ మహా కావ్య ప్రారంభ మెట్లున్నదో గమనించుము.

పైలుం డను నొక ఋషి యుండెను. అతనికడ "ఉదంకుండను" శిష్యుడు గలడు. అతడు,

కం॥ గురుకులమునందు గురులకు
పరిచర్య లొనర్చి తా, నపరిమిత నిష్ఠా
పరుడై జ్ఞానము వడసెను
గురుదయ నణిమాది కాష్ట గుణముల తోడన్ ॥

ఈ యుదంకుండు విప్ర విద్యార్థి. విద్యార్థి యైన వాడు గురు కులమున వసింపవలెను. గురునకు సపర్య లొనర్పవలెను. అపరిమిత నిష్ఠాపరుడు కావలెను. యోగాభ్యాసము చేయవలెను. తద్వారా అణి మాద్యష్ట సిద్ధులు పొందవలెను. అది చాలదు, కాబట్టి జ్ఞానమును సంపాదింపవలెను. ఇట్టి బ్రాహ్మణుని ముందుగా రంగస్థలము లోనికి దింపినాడు కవి. ఇక క్షత్రియుని ప్రదర్శింపవలసి యున్నది. అదియును గనుంగొనుడు. ఉదంకుండు గురుభక్తి గలవాడు. గురుభార్యకు కుండలములు కావలసి వచ్చినవి. ఆమె శిష్యుని బిలిచి పౌష్య మహా రాజుగారి భార్య నడిగి యామె కుండలములు దెచ్చి యిమ్మని కోరెను. ఉదంకుడు ఉత్సాహవంతుడు. రాజుగారి భార్య కుండలము లెట్లు తేవచ్చునను సంశయము గలుగ లేదు. గురువుగారి ఋణము తీర్చ వలె; గావున వల్లెయని రాజుగారి కడ కేగెను. ఆశీర్వదించి కుండల ములు అడిగెను. రాజును మునికుమారుని సత్కరించి కుండలము లిట్టి మహాసీయున కీగాంచితి; కృతార్థుడ నైతి నని మనంబున సంతసిం చెను గాని భయపడిగాని, అనిష్టము చేతగాని, విసుగుచెంది కాని తప్పించు కొనలేదు. అంతేగాదు, మునికుమారుని త్వరపెట్టెను. "నా భార్య కుండలముల ధరించుటకు త్వరపడుచున్నది. నీవు సత్వర మేగి నే నిమ్మంటి నని చెప్పి తీసికొను" మని రాజుగారు చెప్పి పంపెను. ఇక రాణి యెట్టిది? మహా పతివ్రత, ఉదంకుడు తాను వచ్చు దారిలో మలినదేహుండైన కతన ఆమె యాతనికి గనుపడలేదు. అందునకు విచారించి, తన లోపము గ్రహించి, ప్రక్షాళిత పాద, పాణి, వద నుండై తిరిగి రాజపత్ని కడ కేగిన ఆమె దర్శన మిచ్చి, నమస్కరించి కుండలము లొసంగెను. కాని 'తక్షకుడు కుండలము లపహరించును, జాగరూకతతో నుండు' మని హెచ్చరిక చేసెను. ఈ విధమైన పాత్రలతో భారత కథ నడిపింపబడెను. ఇట్టి ఆధ్యాత్మిక దృష్ట్యా కావ్య రచన భారత వర్షమున చిరకాలాను గతమైన ఆర్ష సంప్ర దాయము. శ్రీ మద్రామాయణము మహర్షి అమోఘ వాక్ప్రభా వముతో ప్రారంభింప బడినది. అట్లే శ్రీ మద్భాగవతము

శ్రీ మన్నారాయణ కథా ప్రశంసతోను, భగవంతుని యొక్క విశంత్యవ తార వర్ణనలతోను ప్రారంభింప బడినది. నన్నయభట్టుగారు తా నాంధ్రీకరించిన భారత కావ్య రచన, కవితా విషయమును గూర్చి యొక ప్రతిజ్ఞ చేసినాడు. ఈ విషయము తొలుతనే చెప్పితిని :

ఉ॥ సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థ యుక్తి లో
నారసి మేలునా, నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తి నిధి, నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురు డయ్యె జగద్ధితంబుగన్ ॥

ఈ పద్యమున నన్నయగారి కవితాశయములు ఆంధ్రీకరణోద్దేశములు మున్నగునవి విశదీకరింపబడి యున్నవి. ఈ పద్యమందున్న ముఖ్యమైన పద ప్రయోగమును గమనింపుడు. "ప్రసన్న కథాకలితార్థ యుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థ సూక్తి, తెనుంగునన్, సంహిత, జగద్ధితంబుగన్" ప్రసన్నకథతో కూడిన అర్థయుక్తి, లేక కథను ప్రసన్నముగా చేయగల అర్థయుక్తి యని చెప్పవచ్చును. సామాన్యమైన కథను చక్కని అర్థముగల మాటలు ప్రయోగించుట వలన ప్రసన్నముగా ననగా మనోహరముగా జేయవచ్చును. చక్కని భావములను సుందరమైన పదముల పొందికగా నిమిడ్చి భావ గాంభీర్యమును స్ఫురింపజేయు శక్తి గలిగిన రచనా శిల్పము తన కవిత్వమం దున్నదనియును ఈ శిల్పసౌందర్యమును సవిమర్శగ చూడగల కవీంద్రులు సారమైన బుద్ధి విశేషముచేతనే రచనారహస్యమును గ్రహింపగల రనియును సూచించినారు. ఇక రెండవ లక్షణము – అక్షర రమ్యత అనగా . రమ్యమైన పదప్రయోగము చేత అర్థము తెలిసినను తెలియకున్నను సామాన్యులు సహితము విని శ్రావ్యముగా నున్నదని భావించి యానందించున ట్లుండుననియు చూపినారు. ఈ యక్షర రమ్యత అను శబ్ద ప్రయోగము చేత వేరొక ధ్వని శబ్దించుచున్నది. ఈ రమ్యత. యెట్టి రమ్యత. ఒక పాటగాని, పద్యముగాని విన్నప్పుడు రమణీయముగా నున్నట్లు శ్రోతల చిత్తవృత్తులకు తత్కాల పరిస్థితుల ననుసరించి తోచవచ్చును. అవియే

యింకొక పర్యాయము వినుట సంభవించినప్పు డంతగా రమ్యత లేక పోవచ్చును. కాని నన్నయభట్టుగారి రచనయందలి రమ్యత దేశ కాల భేదములచే వన్నె చెడక నిరంతరము రుచించునదని భావము. భారత తాంధ్రీకరణ రమ్యత యెన్నటికిని "క్షరముగాక" సుస్థిర ముగ నుండును. అందుచేతనే అక్షర రమ్యత యని ప్రయోగింప బడినది. మూడవ విశేషణము – "నానా రుచిరార్థ సూక్తి నిధి" అని యున్నది. మనోహరమైన అర్థ సూక్తులతో నిండి యున్నట్లు తెలుప బడినది. అర్థ సూక్తు లనగా నొక ధర్మమును సూటిగా నొక పద్య మున జెప్పుట. ఇట్టి పద్యములు రసవంతములై రమణీయ భావ స్ఫోరకములై, అందరిచేత నిత్య వ్యవహారములందు ప్రమాణ వచన ములుగా, నీతి బోధకములుగా, క్లుప్తముగా వాడుకొనబడు సూక్తులు. ఈ రకమైన సూక్తులు సంస్కృతమున బహుళములుగా నున్నవి. సంస్కృత భాషా జ్ఞానము లేని సామాన్యులు సయితము అట్టి సూక్తులు విరివిగా నిప్పటికిని వాడు చున్నారు. సామెతలవలె నుప యోగింపబడు వాక్యముల సరణి, నీ రుచిరార్థ సూక్తులు చిత్తాకర్షక ములై యుండును. తరువాత నన్నయగారు తన భాషను ఆంధ్ర మనక, తెలుగనక "తెనుంగునన్" అను పదమును ప్రయోగించి నారు. 'తెనుంగు'లో తియ్యదనము గల భాష యను నర్థము సూచిత మగుచున్నది. అప్పటి దినములలో సంస్కృత భాష యందే వేద విజ్ఞాన మున్నదను భావము సర్వత్రా వ్యాప్తమై యున్నది. తెనుగు భారత పఠనమందు ప్రామాణిక బుద్ధి గలుగునో లేదో యను సంది యము చేత నెల్లరకును తెలియునట్లు "మహాభారత సంహితా రచన" మని చెప్పినారు. కేవలము తెనుగు కావ్య రచనముగానే పరిగణించెదరేమో అంతియే గాదు సుమా! ఇది సంహిత అనగా వేదము సుమా! (సమస్త నీతి ధర్మములకు, వివిధ శాస్త్ర విషయము లకు గని యగు "సంహిత" యని సూచించినారు.) నన్నయ గారిచే పై యంశము లీ యాంధ్రీకృత మహా భారతమున, నే విధముగా ఘోషింప బడినవో విచారించవలసియున్నది. అంతకుముందు నన్నయ

గారి యొక్క గాని, కవిత్రయములో తిక్కన, శంభు దాసుల యొక్క గాని యను వాద విధాన మెట్లున్నదని కొంత పరిశీలింపవలెను. సంస్కృత భాషలో సుమారు లక్ష శ్లోకములు గల భారతము తెనుగునకు వచ్చు నప్పటికి కొంత సంకుచిత మొనర్ప బడినది. నన్నయ గారిచే రచింప బడిన ఆది. సభా పర్వములును, అరణ్య పర్వమున మూడాశ్వాసములును, చతుర్థాశ్వాసములోని కొంత భాగమును కలిసిన కావ్యమున, గద్యములు, పద్యములు సుమారు నాలుగు వేలున్నవి. అందు 2,500 పద్యములును, 1,500 గద్యములును గలవు. ఈ పద్యములకు మూలమున 30,000 - కొంచెము తక్కువ సంఖ్యగల శ్లోకములున్నవి. అందువల్ల కథను సందర్భాను సారముగా మూలము నందలి ప్రధానాంశములను మాత్రము వదలక, వలసిన తావుల క్లుప్త పరచియు, కొన్ని చోట్ల పెంచియు, పురాణ రూపముగా నున్న వ్యాస భారతమున కొక కావ్యరూప మొసంగినారు. అనువాదము కేవలము మక్కికి మక్కి, ఫక్కికి ఫక్కిగా నుండదు. అందుచేత నే చదువునప్పుడు మొత్తముమీద ఆంధ్రీకృత మహా భారతమే రమ్యమై, సంగ్రహమై, స్వతంత్ర కావ్యమువలె దోచి శ్రోతలకు కర్ణ రసాయనముగా నుండు ననుటకు సందియము లేదు. ఈ క్రింది శ్లోకముల నన్నయగారి యాంధ్రీకరణ మెట్లున్నదో కొంతవరకు దెలియవచ్చును.

## "అనువాద పద్ధతి"

సభా పర్వ ప్రారంభమున మయుడు తన్నర్జునుడు రక్షించి నందులకు ప్రత్యుపకారముగా నొక బహుమాన మిచ్చెద ననియు, నీ కిష్టమైన దేమియనియు నడుగగా నతఁ డందులకు సమ్మతించ లేదు. ఉభయులకు కొంత సంభాషణ జరిగెను. అయ్యది తెలుగు భారతమున విడువ బడినది. మయుడు వదలక బలవంత పెట్టిన తరువాత కృష్ణు నిష్టమనెను. కృష్ణుడు సభను నిర్మింపు మనెను. ఈ యంశము

మాత్రమే తెనిగింపబడినది. పార్థునకు గల ప్రత్యుపకార స్వీకార వైముఖ్యము నన్నయగారు విశదపరచలేదు. అట్లే మయుడు సభ నిర్మించి తెచ్చి ధర్మజున కర్పించి అర్జునునితో,

తాంతు కృత్వా సభాం శ్రేష్ఠాం మయశ్చార్జున మబ్రవీత్ ॥
భూతానాంచ మహా వీర్యోధ్వ జాగ్రే కింకరోగణ ॥
తవ విస్ఫార ఘోషేణ మేఘవన్నినదిష్యతి, అయం హిసూర్య
సంకాశోజ్వల నస్య రథో మహాన్ ॥
ఇమే చది విజశ్వేతా వీర్యవంతో మహోత్తమాః. మాయా మయః
కృతోప్యే పధ్వజో వానర లక్షణః ॥
అసజ్జ మానో వృక్షేషు ధూమకేతురివోచ్ఛ్రితః ॥
బహు వర్ణంచ లక్ష్యేత ధ్వజం వానర లక్షణమ్ ॥

ఇత్యాది ఆరు శ్లోకములకు తెనుగున ఈ భాగము విడువ బడినిది. అట్లే,

అనుతం భోజ యిత్వాతు బ్రాహ్మణానాం నరాధిపః ॥
సాజ్యేనపాయసే నైవ మధునా మిశ్రితేనచ ॥
భక్ష్యైర్మూలైః ఫలైశ్చైవ మాంసైర్వారాహ హారిణైః ॥
కృసరేణాథ జీవం త్యా, హవిష్యేణచ సర్వశః ॥
మాంసప్రకారైర్వివిధైః శ్వా, ద్యైశ్చాపితథా నృప ॥
చోష్యైశ్చ రాజస్పేయైశ్చ బహువిస్తరైః ॥

ఈ మొదలయిన వస్తువులు తెనుగున వదలిపెట్ట బడినవి. "మాంసైర్వారాహహారిణై" మొదలగు వానికి శాకాహారియగు నన్నయగారు తెనిగించుట కిష్టపడకపోయి యుండవచ్చును. కావున క్లుప్తముగా,

ఉ॥ వీరుడు ధర్మజుండు పదివేవురు విప్రులకొప్ప బాయ సా
హారము, భక్తి బెట్టి మఱియందరకుం జెరివేయియేని, వి
స్తారయశుండు ధేనువుల ధర్మవిధిన్ మణి ముద్రికా ద్యలం
కార దుకూల పుష్ప ఫల గంధ యుతంబుగ నిచ్చి లీలతోన్ ॥

అని ముగించెను. అట్లే సభా ప్రవేశ సమయమున వచ్చి దర్శించిన రాజుల పేర్లు వేర్వేరు దీర్ఘముగా సంస్కృత భారతమున చెప్పబడియుండగా నన్నయగారు,

మద మాతంగ తురంగ కాంచనల సన్మాణిక్యగాణిక్య సం
పదలోలిం గొనివచ్చి, యిచ్చి ముదమొప్పంగాంచి సేవించి ర
త్న్యుదయాస్తాచల సేతు సీత నగ మధ్యోర్వీపతుల్ ల్సంతతా
భ్యుదయున్ ధర్మజు తత్సభా స్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్ ॥

అని యొక పద్యముతో సరిపెట్టెను.

## ర చ న.

నన్నయ రచన ప్రాయికముగా కదళీ, ద్రాక్షా, పాకములతో కూడి శైలి సరళమై, రమ్యమై, అనర్గళ ధారా మాధుర్యము గలిగి రసవంతముగా నుండును. దీర్ఘమైన సమాసము లున్నను, అవి శ్రుతి కటువుగా నుండక చదువుట కింపుగానే యుండును. తెలుగు పదములను, సమధికౌచితి గలిగి కవిత్వమునకు మార్దవము గలిగించు నట్టివిగా నుండును. రసోచితముగా శబ్దములు, వృత్తములు, వాడుట మహాకవికి నియమమని దోచుచున్నది. ఈ కవి కావ్యమున మత్తేభ విక్రీడిత, శార్దూల విక్రీడిత వృత్తము లరుదుగా నుండును. ఈతని యరణ్య పర్వ భాగమున తొమ్మిది పద్యములు మాత్రమే మత్తేభ శార్దూల వృత్తము లున్నవి. నలోపాఖ్యానము సుమారు 230 పద్యములలో నీ వృత్త మొక్కటియైన గానరాదు. సభా పర్వమునందు 40 పద్యములకంటె నధికముగా లేవు. ఆది పర్వమునందు 45 పద్యములు మాత్రమున్నవి. వృత్తములలో తరువోజ, మధ్యాక్కర, కవిరాజ విరాజితము లెక్కడో కొన్ని యున్నను. మొత్తముమీద చంపకోత్పలము లీ కవి కలవాటు మెండు. కురు, పాండవ వంశ జన్మ గాథా కథనమే కావ్యమందు ప్రధానమైయున్నను, రసోత్పత్తి

గలిగించు రమణీయములగు ఋతు వర్ణనలు, విరహ శృంగార, విప్రలంభాది వివిధగతుల విషయ ప్రకృతి వర్ణనలు నుత్తమ ప్రబంధముల లోని వర్ణనలకు తీసిపోకున్నవి. కవిత్రయమువారి పోకడలు శ్రీనాథాది తరువాత కవులకు మార్గదర్శకముగా నున్నవి. కవిత్రయమువారి లక్షణ స్వభావ సూచితమైన యంశము, వారి ఆధ్యాత్మిక ప్రవృత్తియైనదే, ఆర్య ధర్మ భావ వ్యాప కోద్దీపితమైనదే, హిందూమత సంప్రదాయము నూది చెప్పుటయే. ఆదిపర్వమున శకుంతలా దుష్యంతుల గాధ చూడుడు. అందు భారత స్త్రీల యున్నతమైన ఆదర్శములు, భర్త కెట్టి యుపయోగకారకులై భార్య లుందురో తెలిపినాడు వాగనుశాసనుడు. వీరిరువురకు కణ్వాశ్రమమున గాంధర్వ వివాహము జరుగుట, శకుంతల గర్భముదాల్చుట, దుష్యంతుడు తన రాజధాని కేగినపిమ్మట తాను శకుంతలను గాంధర్వవిధిం బరిణయమైన విషయము విస్మరించుట, తరువాత కొన్ని దినములకు శకుంతల కుమారునితో భర్త సాన్నిధ్యమున కేగుట, భర్త తనపై యాదర దృష్టి బరపక తన్నెరుంగని వాని చందంబున నుండుటచే శకుంతల విచారాక్రాంతయై పతితో పల్కిన పలుకు లెంత సందర్భ శుద్ధిగల్గి యుజ్జ్వలముగ నున్నవో గాంచుడు. నన్నయగారామె చేత నీ క్రింది రీతిగా చెప్పించెను :

కం|| సతియును గుణవతియు ప్రజా
వతియు ననవ్రతయు నైన వనిత నవజ్ఞా
న్వితదృష్టి జూచు నతి దు
ర్మతి కిహముం బరము గలదె మతి బరికింపన్ ||

సీ || ధర్మార్థ కామ సాధన కుపకరణంబు
గృహ నీతి విద్యకు, గృహము, విమల
చారిత్ర శిక్షకాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికి యూత
గౌరవంబున కేక కారణం బున్నత
స్థిర గుణ మణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము

లెట్టి ఘట్టములను, నెట్టి యాపదలను
నెట్టి తీరములను ముట్టబడిన
వంతలెల్ల బాయు నింతుల బ్రజలను
నొనర జూడ గనిన జనుల కెందు ॥

మరియు భార్య, పురుషునం దర్థం బగుటంజేసి పురుషునకు మున్నపరేతయైన పతివ్రత పరలోకంబునం దన పురుషుంగూడ తదాగమంబు బ్రతీక్షించుచుండు. పురుషుండు మున్నపరేతుండైన తానును పరేతయై తన పురుషుంగూడ నరుగు, నట్టి భార్య నవమానించుట యధర్మంబు, మఱియును పురుషుండు భార్యయందు బ్రవేశించి గర్భంబున పుత్రుండై తాన యుద్భవిల్లు గావున "అంగాదంగాత్సం భవసి" యనునది యాదిగా గల వేద వచనంబుల యందును. జనకుండును పుత్రుడు నను భేదంబు లేదు.

కం॥ విను గార్హపత్యమును న
త్యనలము విహరింపబడి, తదావహనీయం
బన వెలుగునట్లు వెలుగును
జనకుడు దా, బుత్రుడై నిజద్యుతి తోడన్ ॥

కం॥ తాన తన నీడ నీళ్లుల
లో నేర్పడ జూచునట్లు, లోకస్తుత త
త్సూను జనకుండు సూచి మ
హానందము బొందు నతిశయ ప్రీతి మెయిన్ ॥

ఈ సంభాషణలోని భావములు, మాటలు యెట్లున్నవో పరికించిన కవి భారత నారీమణుల యున్నతి ప్రాధాన్యత, స్థానము దంపతుల పరస్పర అవినాభావమైన వైవాహికాచార సంబంధముల గూర్చి యెట్టి హృదయ స్పందనము గలిగించినాడో స్పష్టమగును గదా! సంఘమున, గృహమున భార్యకుగల గౌరవము, విధికూడ బోధించి పురుషులకు స్త్రీలకు తమ తమ హక్కు బాధ్యతల నిర్వచించినాడు. ఇంతియేగాదు ఈ బిడ్డడు నీ పుత్రుడేయని దుష్యంతునికి నచ్చ జెప్పుటకై శకుంతల ప్రయత్నము.

క॥ నీ పుణ్యతనువు వలననె
యీ పుత్రకు డుద్భవిల్లి, యెంతయు నొప్పున్
దీపంబువలన నొండొక
దీపము పుట్టించినట్లు తేజం బెసగన్ ॥

ఇందు చక్కని యుపమానము నింత చిన్న పద్యములో నిమిడ్చి హృదయరంజకము గావించినాడు నన్నయ. కాని దుష్యంతుని హృదయమున మాత్రము తమస్సు విడి దీపము వెలిగింపబడ లేదు. ఇట్టి కవితాసరణియే కవిత్రయ కవితలోగల విలక్షణము. ఏ గాథ తెలిపినను దానిలో కొంత సూక్ష్మమైన భారత వైదికధర్మము పొందుపరుపబడియే యుండును. భారతేతిహాసమున వచ్చెడు పాత్రల జన్మకర్మాదుల వృత్తాంతములు మనకు విశ్వాస పాత్రములుగా నుండక పోవచ్చును. అందు వర్ణింపబడిన మానవాతీత సంఘటనలు మనకసంభవములుగా, నసత్యములుగా దోచవచ్చును, ఆ విషయచర్చకీ ఘొత్తమున తావు లేదు. కవిత్రయ కవితా వైలక్షణ్యము, అనువాద సరణి, కవితా ప్రభావములే ప్రధాన విషయము లగుటచే వానికి సంబంధించిన నితర విషయమునకు వత్తము.

ఈ కథను ప్రసన్నముగా జేయుటకై పైన దెల్పిన అర్థయుక్తి కల్పించినాడు. ఈ యర్థయుక్తి లేనిచో కథవల్ల మనము తెలుసుకోవలసిన పరమార్థ మంతగా నుండదు. ఏదోవిధమైన ప్రణయ గాథగా మాత్రమే తెలిపోవును. ఈ విధమైన ధర్మవాక్య ప్రచారము చేత సంఘమున దంపతు లెట్లు జీవింపవలయునో ఆర్య ధర్మాచరణ నెట్లు నెఱపవలెనో ప్రకటించినాడు. సత్యమునకు కట్టుబడియుండుట మానవు లందరికిని విధియే. అందునను ధర్మరక్షసేయు రాజులకు మిక్కిలి యవసరము. దుష్యంతుడు శకుంతలాజనిత పుత్రునకు రాజ్యము నిచ్చునట్లుగా నామెకు వరంబిచ్చినాడు. సత్యమును విచారింపక నతడు శకుంతలను పుత్రునిగూడ గ్రహింపక నిరాకరించెను. సత్యమును పాటించవలసిన యగత్యము ని ట్లుద్బోధించినాడు :

చం|| నుతజల పూరితంబులగు నూతులు నూరిటి కంటె సూనృత
వ్రత యొకబావి మేలు మఱి బావులు నూరిటికంటె నొక్క-
సత్క్రతు వది మేలు తత్క్రతు శతంబులకంటె సుతుండు మేలు త
త్సుత శతంబు కంటె నొక సూనృతవాక్యము మేలు చూడగన్.

ఇట్టి చక్కని పద్యములలో సత్యవాక్యాచరణ మహిమను పాఠకుల హృదయము లాకర్షించునట్లే మహాకవి కథకు ప్రసన్నత గల్పించెను. ఈ గాథనే కాళిదాసమహాకవి నాటకరూపముగా రచించి, నాటకరమ్యత కవసరమైన మార్పుల జేసియున్నను సత్య ధర్మాచరణ ప్రాధాన్యత పాఠకుల హృదయములపై నచ్చు గుద్దినట్లు తోచదు. కథ సంగ్రహముగా నున్నను వ్యాస హృదయము సువ్యక్తముగా తోపజేయగల్గి నన్నయ చరితార్థు డయ్యెను. ఇట్లే కథ చూచినను దాని కొక ప్రసన్నత కల్పించి, రసవంతములగు పదముల గూర్చి, కథ, భావము, రచనలు మూటిని పొందుపరచినట్లు దోచును. అందువలననే భారతము వేయి సంవత్సరముల క్రిందటనే రచింపబడినను దాని విఖ్యాతి నిత్య నవీనత గాంచుచున్నది.

వర్తమాన విమర్శనాధురంధరులు అక్షర రమ్యత జూడగల్గుచున్నారు. అక్షర రమ్యతకు నన్నయ రచిత భారత భాగమునుండి యనేకోదాహరణముల జూపవచ్చును.

మా|| ఏచి తనర్చిన క్రొవ్విరుల నిమ్మగు తావుల జొంపములన్
పూచిన మంచి యశోకములన్ సురపొన్నల పొన్నలగేదగులన్
కాచి వెడంగుగ బండిన యాసహకారములం గదళీతతులం
జూచుచు వీనుల కింపెసగన్ వినుచున్ శుక కోకిల నిస్వనముల్||

కం|| చల్లని దక్షిణ మారుతే
మల్లన వీతెంచె, దగిలి యాలలనా థ
మ్మిల్ల కుసుమాంగ రాగ స
ముల్లసవ సుగంధి యగుచు, మునివరు మీదన్ ||

చం|| కలి దమయంతి బాప సమకట్టు, సతిం బతి వాయ నోపడా
లలనను దీర్ఘ సౌహృద బలంబున నిట్టులు రెంటజేసి య
న్నలుడు విమోహహర్షల వెనంగి గతాగతకారియైన యు
య్యెలయును బోలె మాటికి నయెంతయు బ్రొద్దు వినిశ్చితాత్ముడై||

చం॥ దళిత నవీన కందళకదంబ, కదంబక కేతకీ రజో
మిళిత సుగంధ బంధురస మీరణమన్ సఖియూచుచుండగా
నులియుచు పూవుగుత్తులను నుయ్యెల లూప్పగ నెక్కి యూగె న
ల్లల దళనీనలంబు మృదుల ధ్వని గీతము విస్తరింపగన్॥

ఇట్టి మృదు మధుర పదంబుల కూర్పుతో కర్ణ రసాయనంబు గావించు పద్యములు పెక్కుగలవు .ఉభయ వాక్ప్రౌఢి జూపి సరళ దీర్ఘ సమాసములతో నిండినపద్యములకు లెక్కయే లేదు. యమకము గమకము గల్గి ప్రవాహ సదృశముగా బరువెత్తున ట్లున్నవి.

మ॥ వివిధోత్తుంగ తరంగ ఘట్టనచలద్వేలావనైలావ లీ
ల వలీలుం గలవంగ సంగత లతాలాస్యంబు వీక్షించుచుఁ
ధవళాక్షుల్ సని కాంచిరంత నెదురఁ దత్తీర దేశంబునం
దవదాతాంబుజ ఫేన పుంజనిభు నయ్యాశ్వోత్తముఁ దప్పులఁ॥

ఇత్యాది సమాస సారళ్యము గలదు.

స్వభావ సిద్ధముగా నన్నయగారు దీర్ఘ సమాసముల సముచితముగా నొక పద్యమందే యనేక చిన్న చిన్న సమాసములు, వాని మధ్య మధ్య కొన్ని తత్సంధాన పదములు చేర్చి పద్యములో పదములను సరితూకములో నుంచును. అట్టి పదములు తెలుగు పదములుగా నుండును.

చం॥ నల దమయంతు లిద్దరు మనఃప్రభువానల బాధ్యమానలై
సలిపిరి దీర్ఘవాసర నిశల్ విలసన్నవనందనంబులన్
నలినదళంబులఁ మృదుమృణాళములన్ ఘనసారపాంసులన్
తలిరులశయ్యలన్ సలిలధారల చందనచారు చర్చలన్॥

ఈ విధము లైన చిన్న చిన్న సమాసకలితము లైనవి, కడుంగడు రమణీయము లైన వనేకము లున్నవి.

ఉ॥ నీల గిరీంద్ర శృంగమున నిర్మల మైన సువర్ణవల్లరీ
జాలము నాని పింగళ విశాల జటాచయ మొప్ప
గా, పచ శ్రీ లలితుండు వచ్చి నిలచెన్ హరి నీల
విగ్రహోరాళ రుచుల్ వెలుంగగ పరాశర సూనుడు తల్లిముందటన్॥

ఈ రీతి పద్యములు పంక్తులు గలవు.

## జా తీ య ప ద ము లు

తిక్కన సోమయాజి కవిత్వములో నున్నన్నిగా జాతీయములు, తెలుగు పద సమాసములు లేకున్నను నన్నయగారి కవిత్వములో నచ్చటచ్చట రుచిరార్థసూక్తులు, జాతీయములు, దేశీయములు గలవు.

"ఆ వరచిన ట్లరచెన్", "జము కత్తుక జొచ్చి వెడలుట", "పట్టి పాలార్పక", "వంటయిల్ కుందేలు జొచ్చె", "తొక్క పలుకుల్", "ఓడు గఱచు", "ఎల్లిద మైతి", "గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్", "రోయు తీగె కాళ్లన్ బెనగెన్" ఇత్యాదులు.

అచ్చ తెలుగు పదములు బహుళములుగా వేసిన పద్యము లచ్చటచ్చట కనుపడుచున్నవి.

కం|| నెఱి నఱక వైరి వీరుల
కఱకులు దూఱంగనేయు నృప పుంగవు నం
పఱ కోర్వక పిఱుసని రని
వెఱచి విపన్నులయి సకలవిషయాధిపతుల్ ||

తే|| పఱతనోపక యున్న మైమఱచి పెంటి
బెనగయున్నను బ్రసవింప మొనసియున్న
దెవులుకొనియున్న మృగముల డివిరియేయ
నెఱచి యాహారముగ మను నెఱుకలైన||

మొదలయినవి.

ఈ మహా కవి కవిత్వమున రూపకాద్యలంకారము జూపు పద్యము లత్యంత రమణీయముగా నచ్చటచ్చట కనుపడుచుండును.

చం|| పరమ వివేక సౌరభ విభావిత సద్గుణ పుంజ వారిజో
త్కర రుచిరంబులై, సకల గమ్య సుతీర్థములై మహామనో
హరి చరిత్రపావన పయః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్ ||

"దుర్గ మార్గ జల గౌరవ భారత భారతీ సముద్రము"

ఈ రీతిగా నన్నయ కవి రెండున్నర పర్వములు రచించెను. మహాకావ్యమున నుండవలసిన యష్టాదశ వర్ణనలు గల్గియు, అనువాదముగాక స్వోపజ్ఞసహితమై యుండును. ఈ మహాకవి నిరుపమాన పండితుడయ్యును పాండిత్యము చూపు తలంపుతో వ్రాయలేదు. సమాసము లుపయోగించినను, అలంకారములు నుదించినను, వ్యస్త పదములు వాడినను సహజమైన ధోరణి కనబరచెను. నన్నయభట్టు 1,010 సంవత్సర ప్రాంతమున బుట్టి రాజరాజనరేంద్రుని యాస్థాన కవియై, పురోహితుడై, మంత్రియై, గుణాశ్రయుడై యుండెను. 1,070 సంవత్సర ప్రాంతమున కాలధర్మమందెను.

# ఎఱ్ఱనామాత్యుడు.

శంభుదాసు, ప్రబంధ పరమేశ్వరు డను బిరుదులు గల ఎఱ్ఱన కవిత్వము నన్నయ కవిత్వము వలెనే ఉభయ భాషా ప్రౌఢిమ గల్గియున్నది. అంతియగాక యితని చిత్రములైన పదముల నిగ నిగ పరిస్ఫుటముగానుండును. పదములు జటిలముగాను, సమాసములు తఱుచు కఠినమై సంస్కృత పద భూయిష్ఠముగాను తోచును. ఈ కవియు తాను వ్రాసిన మూడున్నర ఆశ్వాసముల భాగమునందే యన్నివిధములైన పోకడలు చూపెను. కవిత్వము రసపూరితమై సూక్తివైచిత్రి గల్గియున్నది. అందువల్లనే శ్రీనాథునివంటి మహాకవి తాను "పరిఠవింతు ప్రబంధ పరమేశ్వరుని దేవసూక్తి వైచిత్రి నాకొక్కమారు" అని గర్వముతో చెప్పుకొనగల్గెను. ఈ కవి 13-14 వ శతాబ్దములో నున్నట్లు శ్రీ కందుకూరి వీరేశలింగముగా రభిప్రాయపడినారు. ఈ కవి కవితా రీతుల పరామర్శించు నపుడు మనము ప్ర ప్రథమముగా తిక్కనామాత్యునే దర్శింపవలసియున్నది. గావున నీ కవి రచనా రీతులు పిమ్మట మనవి చేసికొందును.

# తిక్కన సోమయాజి.

నన్నయ భట్టారకుడు శతాబ్ద ప్రారంభముననే బుట్టి యాశతాబ్ద మంతముగాక పూర్వమే చనిపోయినట్లు కందుకూరి వీరేశలింగ కృతాంధ్ర కవుల చరిత్రలో గలదు. 1,055 సంవత్సరము తరువాత భారతాంధ్రీకరణ నన్నయగారు చేసినట్లు వేదము వెంకటరాయ శాస్త్రిగారన్నారు. ఇక తిక్కన సోమయాజిగారన్నో పదమూడవ శతాబ్దమందున్నవారు. హూణ శకము 1,220 సం॥ కు సరియైన శాలివాహన శకము 1,042 సంవత్సరమున శార్వరీనామ సంవత్సర ఫాల్గుణ బహుళ దశమీ కుజవాసరమున జన్మించెను. హూణ శకము 1.288 సం॥ సరియైన శాలివాహన శతాబ్ద 1,210 సం॥న మరణించి నట్లు కనబడుచున్నది. దీనినిబట్టి నన్నయగారికి పిమ్మట యించు మించు 200 సంవత్సరముల తరువాత తిక్కనగారున్నట్లు స్పష్టమగును. తిక్కన పూర్వులు గుంటూరు మండలమున రేపల్లె తాలూకాలో నున్న "పల్లెటూరు" గ్రామ కాపురస్థులైనట్లును, ఈ కవి తాత గారు మంత్రి భాస్కరుడు గుంటూరు పట్టణాధిపతిగాను, తండ్రి కొమ్మనామాత్యుడు గుంటూరులోనే దండనాథుడుగా నున్నట్లును, తరువాత తిక్కనగారు నెల్లూరున కేగి యచ్చట మనుమసిద్ధి కడ నాస్థాన కవియై, మంత్రియై రాజ్య పునస్థాపనాచార్యుడైనట్లు కందుకూరి వీరేశలింగ కృతాంధ్రకవుల చరిత్రలో నుదహరింపబడి యున్నది. నన్నయ, తిక్కన కవుల మధ్యగల దీర్ఘకాలమును బట్టియే వారిరువురకవిత్వ భేదమునకు కారణమైయున్నట్లు యూహింపవచ్చును. మన మెరిగినంతలో సుమారు యేబది సంవత్సరములలోనే భాషలో, కవిత్వ రీతులలో, భావ పరివర్తనలో నెట్టెట్టి మార్పులు మన యాంధ్ర దేశములో గల్గెనో గాంచుడు. మన దేశమున రాజకీయ భావ సిద్ధాంత ప్రచారమున కన్యమైన భాషలో నెట్టి రచనలు, యేవిధమైన పద్యములు, పాటలు, బుఱ్ఱకథలు బయలు దేరినవో చూ

చునే యున్నారు. స్వాతంత్ర్య భావములు, రచనారీతులు, నాటక, సినిమాల కవిత్వమున నెట్టి మార్పులు వచ్చెనో! పూర్వ కవిత్వ స్వరూప సాంప్రదాయములలో నెన్నియో మార్పులు చూచుచున్నాము. కవుల సంఖ్యకు, గ్రంథముల సంఖ్యకు సంతులేకున్నది.

ఈ విధముగానే నన్నయ తిక్కనలకు మధ్యగల కాలములో రాజకీయ వ్యవస్థలలో సాంఘిక వ్యవస్థలలో విప్లవము సంభవించినది. కేవల సంస్కృత భాషా కావ్య సాంప్రదాయ సిద్ధములైన పదప్రయోగములు, భావములు, రచనా రీతులయందు ప్రజలకు గౌరవము తగ్గజొచ్చెను. బౌద్ధ, జైన మత సిద్ధాంత ప్రచారము వలనను రామానుజాచార్య మత ప్రచారమువలనను సంఘమున భిన్నాచారములు వాటిల్లెను. వైదిక ధర్మాచారమునకు గౌరవము క్షీణించెను. మరియు శైవ, వైష్ణవ మతముల వారికి పరస్పర విరోధములు గల్గి సంఘము మల్లకల్లోలమై పోయెను. శివ కేశవులకు విరోధ మారోపింపబడెను. ఇట్టి సంకుల సమరమున తిక్కన భారతము వచ్చెను. భారత ధర్మములు పండితులకొరకే గాక సామాన్య జనులకు తెలుపుటవసరమాయెను, అందుచేత వారికి బోధపడు భాష, అచ్చమైన లోకోక్తులు, దేశీయపదములు వాడవలసివచ్చెను. కావున తిక్కన మహాకవి మత వైషమ్యముల నడంచి వైదికధర్మ గౌరవము చూపి, బౌద్ధ మతాది సిద్ధాంతముల నడంపగలిగిన శంకరాద్వైత మతమును చొప్పించి భారత గ్రంథము వ్రాసెను. మనస్సులో యీలాటి సకల విషయములు బెట్టుకొని శైవ వైష్ణవ భేదమును పాటింపక సమరసభావముతో హరి హర రూపముతో నున్న యీశ్వరునకు భారతము అంకితము చేసెను.

## రచన

ఉ॥ శ్రీ యన గౌరి నా బరగు చెల్వకు చిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణు రూ
పాయ నమశ్శివాయ యని బల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్త్వము గొల్చెద నిష్ట సిద్ధికిన్॥

అని ప్రారంభించినాడు. శివ రూపుడు, విష్ణు రూపుడును నైన హరి హర నాథ స్వామి యొక్కడే! భేదము లేదు. హరి వేరని హరుడు వేరని కలహింప నక్కర లేదు. కావున భక్తిగల్గి "వైదిక ధ్యానము" చేయుడనగా వేదములో నిర్ణయింపబడిన పద్ధతిలో స్వామిని భజింపుడు.. అట్లు చేసిన యెడల నా భక్తుడు, వైకుంఠ మేగాక, కైలాసమే గాక ఆ పదములకు మించిన పర తత్త్వమే ప్రాప్తించునని సూచించెను. ఇతరులకు బోధించుటలోనే సంతుష్టి నందక "అధీతి బోధా ప్రచారణైః" అన్నట్లు తిక్కనగారు తాను స్వయముగా కర్మ, భక్తి, జ్ఞాన మార్గముల గుట్టును తెలిసికొని యాచరణలో బెట్టి పిమ్మటనే యితరులకు బోధించెను. తిక్కన వేదముల సాంగముగా చదివి, కర్మనిష్ఠుడై, యజ్ఞ మొనరించి, సోమయాజియై, అంతటితో తృప్తినందక భక్తుడై, హరి హర నాథ స్వామి నారాధించుచు, వేదాంతమును తెలిసికొని, వ్యాస సిద్ధాంతములను భావలగ్నముగావించి, జ్ఞానానుభవము సాధించి, సర్వజ్ఞుడై, కవిత్వ దీక్షావిధి నొంది భారతము నాంధ్రుల కొరకాంధ్రీకరించెను. ఈ కారణముచేతనే యీ కవి,

ఉ॥ వైదిక మార్గ నిష్ఠమగు వర్తనమున్ దగ నిర్వహించుచున్
భేదము లేని భక్తి మది నిర్మలవృత్తిగ జేయుచుండ, మ
త్పాద నిరంతరస్మరణ తత్పరభావముకల్మి, నాత్మ స
మ్మోదము బొంద గావ్యరసమున్ గొనియాడుచు నుందు దెప్పుడున్॥

అని తనవర్తనము తెలిపినాడు. వైదిక మార్గము, భేదములేని భక్తి, ఆత్మ సమ్మోదము అని మూడు శబ్దములు ప్రయోగించినాడు. మరియు కావ్య రసమున్ అనుపదములో ధ్వనియున్నది. కావ్య రసమనగా శృంగారాది రసమనేగాక "బ్రహ్మానంద రసమని" యర్థము స్ఫురించుచున్నది. "రసో వైసః" అని ఉపనిషద్వాక్యము బ్రహ్మము రసమే యని యర్థము. ఇంతియేగాదు, "కవి" యనగా "బ్రహ్మ" యనికూడా యర్థము. అందుచే కావ్యరసము బ్రహ్మమున సంబంధించిన యానందము బ్రహ్మానందము అని భావము. తరువాత,

కం॥ పారాశర్యుని కృతియై, భారతమను పేర బరగు పంచమ వేదం
బారాధ్యము జనులకు తద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్॥

అని జనులకు ఆరాధ్యమయిన పంచమ వేదమును భక్తితో తెనుగున రచింప ప్రయత్నించుట మోక్షమును గోరుటయే యని హరిహరనాథుడు తన కలలో చెప్పినాడట.

" భవ్య పురుషార్థ తరుపక్వఫలము " గదా ?

ఈ పక్వ ఫలము ధర్మార్థ కామ మోక్షములలో కడపటిదైన "మోక్షమే" యని మెచ్చుకొని స్వామి కవిని జూచి యిట్లనియెను: "నీకు మోక్షము గల్గిన గల్గవచ్చును. అయితే నే నెందుకు వచ్చినానో తెలిసినదా ? ఓయి తిక్కశర్మా, పిచ్చి బాపనయ్యా, కృతిపతిత్వ మర్థించి వచ్చినాను సుమా! అది తెలుసుకో" యని యన్నాడట ! దానికి సంతసించి, పరమేశ్వరానుగ్రహము సంపాదించి యనగా "ఇట్టి పదంబుగాంచి" అంటే పరమేశ్వరునకు మామ గారయిన హోదా పొంది, కృతార్థుడై, "అవ్విభుం గట్టెద పట్ట మప్రతిమ కారుణి కత్వ మహావిభూతికిన్" అని చెప్పినాడు. దీనివల్ల తిక్కనగారు తన పరమాశయమును ప్రకటించెను.

అనంతరము,

ఉ॥ కావున భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి యాంధ్రావళి మోదమున్ బొరయునట్లుగ, సాత్యవతేయ సంస్కృతి
శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షా విధినొంది పద్యముల, గద్యములన్ రచియించెదన్ గృతుల్॥

## నన్నయ, తిక్కనల తారతమ్యము

కవిత్రయములో నన్నయ తాను రచించునది తెనుగు గ్రంథమే యైనను, సంస్కృత భాషయందుగల యభిమాన గౌరవములచేత ప్రారంభమున తెనుగు పద్యము వ్రాయక "శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ

ధత్తో వక్షో ముఖాంగేషుయే" యని గీర్వాణశ్లోకమునే రచించి యున్నాడు. తిక్కన సోమయాజి యట్లు సేయక వేదసన్నిభమైన భారతమును "శ్రీ యన గౌరినాబరగు" యను తెనుగు పద్యముతో డనే ప్రారంభించెను. కాని యీ తిక్కనగారే తాను చిన్నతనమున రచించిన నిర్వచనోత్తర రామాయణము ప్రారంభించుచు తెలుగు పద్యముతో ప్రారంభింపక "శ్రీరాస్తాం మనుమక్షితీశ్వర భుజా స్తంభే" యని సంస్కృత శ్లోకమునే వాడినాడు. నిర్వచనోత్తర రామాయణము రచించునాటికి ఈ కవి తిక్కన నామధేయుడే. అప్పటి కింకా లౌక్య వ్యవహార సంగతుడు మాత్రమే యైయుండెను. నరాంకితము చేయుటకు సంకోచింపలేదు.

క॥ ఏ నిన్ను మామ యనియెద దీనికి తగ నిమ్ము భారతీ కన్యక నా
కీ నర్హుడ వగుదను భూనాయకు పలుకు చిత్తమున కింపగుడుఁ॥

అని చమత్కరించి కారణము కల్పించినను, నన్నయగారు రాజరాజ నరేంద్రుని సంతోషింప జేయుటకై భారత మా ప్రభువున కంకితము జేసినట్లే తిక్కన మనుమసిద్ధిరాజును సంతోషపరచి యాతని యనుగ్రహమును కోరియే నిర్వచనోత్తర రామాయణము నతని కంకితము నిచ్చెను. భారత మాంధ్రీకరించునాటికీ కవి వైదికకర్మనిష్ఠుడై యజ్ఞము జేసి, జ్ఞానియై హృదయ పరిపక్వము నొందినందున యుద్గ్రంథమగు భారతమును పరమేశ్వరార్పణము గావించు సత్సంకల్ప మాయనకు గల్గి యుండవచ్చును. కవిత్రయములో తిక్కనకు తదుత్తర కవులేమి యిప్పటికవులు, విమర్శకులేమి యగ్రస్థాన మిచ్చుచున్నారు. నన్నయ, తిక్కన కవుల కవిత్వభేదమును చూపుచు తదుత్తరాంధ్ర కవీంద్రులు నుతించినారు. కవిత్రయములో చేరిన ఎఱ్ఱాప్రగడగారే తన హరివంశమున నన్నయ తిక్కనల స్తుతింపుచు వరుసగా నీ రెండు పద్యములు వ్రాసినారు;

ఉ॥ ఉన్నతగోత్ర సంభవము నూర్జిత సత్త్వము భద్రజాతి సం
పన్నము నుద్ధతాన్యపరిభావ మదోత్కము న్నరేంద్ర పూ
జోన్నయ నోచితంబునయి యొప్పెడు నన్నయభట్ట
కుంజరం బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుట ప్రస్తుతింపదగు॥

మ॥ తనకావించిన సృష్టి తక్కొరులచేతంగాదు నా నేముఖం
బున దాబల్కిన పల్కులాగమములై పొల్పొందు నావాణిన
త్తను నీతం డొకరుండు నా జనమహత్త్వాప్తిం గవిబ్రహ్మనా
వినతింతు న్గవి తిక్కయజ్వ నఖిలోర్వీ దేవతాభ్యర్చితున్॥

ప్రబంధ పరమేశ్వరుడీరీతిగా నన్నయను వర్ణించుటలో నన్నయ కవిత్వరీతిని, తిక్కనను వర్ణించుటలో తిక్కన కవితారీతిని ప్రదర్శించినాడు. పై రెండు పద్యములను పాఠకులు పరిశీలనగా చదువ తగియున్నవి.

నన్నయగారికి సంస్కృతపద ప్రయోగమునం దాసక్తి మెండు. తెలుగు పదములు మంచి మంచి పదునైనవి యచ్చటచ్చట వాడినను మొత్తముమీద తన పద్యమునకు తెనుగురూప మొసంగుట కవసరమైనంత వరకే యవి వాడినట్లు తోచును. తిక్కనగారి కట్లుగాక తెనుగు పదములయందే మక్కువ యెక్కువైనట్లు కన్పట్టును. తగిన తెనుగు పదము దొరకనపుడు మాత్రమే సంస్కృత పదముల నతడు ప్రయోగించుచుండును. రచనా ప్రారంభ దశలో విరాట్పర్వమునందును, వీర, రౌద్ర రసములు ప్రదర్శించు యుద్ధ పర్వమునందును సంస్కృత పదములు సమాసములు విరివిగా వాడి యున్నాడు. కాని యట్టి పద్యములలో కూడ తెనుగు పదములు చొప్పింపక పోలేదు. భారతానువాదమున తిక్కన పద్యములనే యధికముగా వ్రాసెను. వచన భాగము చాలా తక్కువగా నుండును. ఈ కవి రచించిన భారతమున నూటికి 67 పద్యపంక్తులును, 33 గద్యపంక్తులును గలవు. నన్నయరచన భాగమున 54 పద్యపంక్తులును, 46 గద్యపంక్తులును గలవు. సంస్కృత కవులు తమ కావ్యారంభమున పూర్వకవిస్తుతులు జేసినట్లు లేదు. సూటిగా కథారంభము జేయుచుండిరి. కాళిదాస మహాకవి రఘువంశమున పార్వతీ పరమేశ్వర ప్రార్థనము మాత్రము జేసినాడు. కాని వ్యాసాదులనైనను సన్నుతింపలేదు. అట్లే తిక్కన భారతమున "సకల బ్రహ్మ ప్రార్థనంబు గావించి" యని నుడివినాడు. వ్యాసుని నన్నయ

భట్టును సత్కరించినను స్తోత్రరూపముగా జెప్పక భారత రచనను గూర్చి నుడువుచు, వ్యాసుడు జగద్ధితముగా లేఖ్యంబైన యామ్నాయమును జేసెననియును అందు మూడు పర్వములు నన్నయభట్టు దక్షతతో తెనుగు జేసెననియు యోగ్యతాపత్రము మాత్ర మొసంగెను. భారతమునకు ముందే రచించిన నిర్వచనోత్తర రామాయణము నం దైనను నన్నయభట్టు పేరుదహరింపక,

చం॥ హరి హర పద్మ గర్భులను నాది కవీంద్రుల
నూత్న సత్కవీశ్వరులను భక్తి గొల్చి మతి
వారి కృపన్ కవితావిలాస విస్తర మహనీయుడైన నను......

అని పలువురు కవు లున్నట్లు సూచించి వారి నందరను యూక యుమ్మడిగా గొల్చెదనని మాత్రము వ్రాసియుండెను. ఈ పద్యమున "వారి కృపన్ కవితా విలాస విస్తరము" తనకు గల్గినట్లు చూపుట చేత నన్నయగారికి పూర్వముగాని పిమ్మటగాని యుండిన కవుల కావ్యము లుండినట్లును, వారి వారి కవిత్వమునం గల పోకడలవల్ల తన కవితకు విలాస విస్తరణము గల్గిన ట్లాయన దలంచినట్లు దోచుచున్నది. అట్లుగానిచో నన్నయ కవిత్వమునకును, తిక్కన కవితా ధోరణికిని గల తేడాకు కారణము చూపట్టదు. ఉభయకవులకు మధ్య కొందఱితరకవు లున్నట్లు స్పష్టము. వారిలో పావులూరి మల్లన్న యొకడు. ఈ కవి నన్నయభట్టు కాలములోని వాడని శ్రీ కందుకూరి వీరేశలింగార్యు లాంధ్ర కవుల చరిత్రలో జెప్పి యున్నారు. ఈ కవికూడ గ్రంథాదిన తొంటి కవులవలెనే కవిస్తుతి చేయలేదు.

శ్లో॥ శ్రీకంఠం సగుణం సమస్త జగతాకర్తారమీశం గురుమ్
భూతోయానలచంద్ర సూర్యపవనవ్యోమాత్మ మూర్తిం విభుమ్
నిత్యానంద మయోపయోగిరిజయాసార్ధం ప్రజావృద్ధయే
మాయాయోగము పైతితం శివకరం వందే శివం శ్రేయసే॥

అని సంస్కృత శ్లోకమే వాడియున్నాడు. ఇట్లు ఆద్యాంధ్ర కవులైన నన్నయ, తిక్కన, భాస్కర, పావులూరి, మల్లనల గ్రంథములలో మాత్రము కనుబడుచున్నవి. తిక్కన భారతానంతర కవులందరును తెలుగు పద్యములనే వాడి యున్నారు.

## తిక్కన క్రొత్త పోకడలు.

ప్రాచీన కవు లెవ్వరును స్వప్నగాథ తమ కావ్యములలో చెప్ప లేదు. షష్ఠ్యంత పద్యముల జేర్చియుండలేదు. ఈ రెంటిని ప్రారంభించిన యాది కవి తిక్కన సోమయాజియే! కావ్యలక్షణములలో నీ రెండును ప్రధాన లక్షణము లని యెంచి కాబోలు తిక్కన సోమయాజిని మార్గదర్శకునిగా బెట్టుకొని తమ తమ కావ్యముల ప్రారంభమున స్వప్నగాథను, షష్ఠ్యంతములు పలువురు కవులు వ్రాసికొన్నారు. స్వప్నగాథ లెట్లున్నను షష్ఠ్యంతములు మాత్రము విధిగా జేర్చుచున్నారు. ప్రస్తుత కాలపు కవులును, భావకవులును తమ స్వప్నగాథలను కథల రూపముననను, భావగీతములలోను వెల్లడించుచున్నారు. వీరికిని మార్గదర్శకుడు తిక్కనామాత్యుడే. మొత్తము మీద తిక్కన తెనుగు కవిత్వమున కొక నూతన శోభను గల్గించి నూతనపంథా త్రొక్కెను. తెనుగుపదముల సొంపు,కూర్పు యీతనితో సమానముగా వ్రాయువారు లేరని పండితుల అభిప్రాయము. ఇట్టి పదసముదాయ సంపద తిక్కన కెట్లు లభించెను? పైన దెల్పినట్లు తిక్కన తాత, తండ్రులు గుంటూరు మండల వాసులు. కావున తిక్కన చిన్నతనమున నీ మండలములోనే యుండి యిచ్చటి దేశీయపదముల కలవాటుపడి, పిదప నెల్లూరు మండలములో చిరకాల ముండుటచేత నచ్చటి మాండలిక పదముల గణించి, లౌకిక వ్యవహార దక్షుడై రాజకీయ కార్య దురంధరుడై పలుచోట్ల తిరిగిన దిట్టయగుటచేసి యా యా మండలముల జనుల వాడుకమాట లతనికి కరతలామలకమై వాచోవిధేయము లయ్యెను. అందుచేతనే తిక్కన కవిత్వమున నట్టి తెనుగు దేశ వ్యవహారిక పదములు సులువుగాను, సరళముగా, నప్రయత్నముగా తమంతతామే వచ్చిపడినట్లు కనుపడును. తిక్కనగారి పద్యమెన్ని పర్యాయములు చదివిన నంత సారము, శబ్దశక్తి, రసము హృదయంగమమై తోచును. ఈతని కవిత్వమును గూర్చి పూర్వ కవులే గాక యిప్పటి విమర్శకులు సైతము మంచి యభిప్రాయ మిచ్చుచున్నారు. ఆంధ్ర కవుల చరిత్రలో వీరేశలింగం పంతులుగా రిట్లనిరి:

"తిక్కన సోమయాజి శైలితో సమానముగా వ్రాయు టెవ్వరికిని సాధ్యముగాదు. తెలుగు భాషయం దెన్నో గ్రంథము లున్నను తిక్కన కవిత్వముతో సమానముగాగాని, దానిని మించునట్లుగా కాని కవిత్వము చెప్పగల్గిన వారొక్కరును లేరు. తిక్కన కవిత్వము ద్రాక్షాపాకమై మిక్కిలి రసవంతముగా నుండును. ఈతని కవిత్వమునందు పాద పూర్ణమునకై తెచ్చిపెట్టుకొను వ్యర్థ పదము లంతగా నుండవు. పదములకూర్పు మాత్రమే గాక అర్థ సందర్భమును మిక్కిలి పొందికగా నుండును. ఏవిషయము చెప్పినను యుక్తియుక్తముగాను, ప్రౌఢముగాను నుండును. ఎక్కడ యే విశేషణము లుంచి యేరీతి నే పదములు ప్రయోగించి రసము పుట్టింపవలయునో యీకవికి తెలిసినట్లు మరి యే కవికిని తెలియదు. ఈయన కవిత్వము లోకోక్తులతోగూడి జాతీయములుగా నుండును. ఈయన పద లాలిత్యము, యుక్తి బాహుళ్యము, అర్థ గౌరవము, రచనా చమత్కృతియు, శయ్యావిశేషమును, సందర్భశుద్ధియు, కల్పనా కౌశలమును అన్యులకు రావు. ఈ కవిశిఖామణి యొక్క కవిత్వమునం దొక వంతు సంస్కృత పదములును, రెండు వంతులు తెలుగు పదములు ఉండును."

ఈ విధమైన ప్రస్తుతి మఱి యే యితర కవులను గూర్చియు శ్రీ వీరేశలింగార్యులు చేసియుండ లేదు. కావ్యము రమణీయముగా నుండుట కింతకంటె కావలసిన విశేషము లేమిగలవు? ఇంతకంటె నెక్కువ విశేషములు దొరకకపోవుటచేత కాబోలు నంతటితో తిక్కన కవితాభివర్ణనమును ముగించినారు పంతులుగారు. పాప మాయన మంచి కవి, రసజ్ఞుడు, బహుగ్రంథ పఠనగల్గి విమర్శనాపూర్వకముగా నాంధ్ర గ్రంథము లెల్ల పరిశీలించిన నేర్పరి. ఈయన తిక్కన కవితా రసాబ్ధిలో మునిగిపోయినాడు. ఆయన కవిత్వములో నే లక్షణము చూచినను మైమరచి, తన్మయుడై, రసామృతము గ్రోలి, మునుకలు వేసి తెప్పరిల్ల జాలక పోయినాడు. అతని కవితామృత రసప్లుతమైన హృదయోల్లాసమున పొంగి తొణికిసలాడి పొరలిన భావపరంపరలనే పంతులుగారు

అక్షరరూపమున విరియించియున్నారు. ఇంతకంటె యధికముగా తిక్కన కవిత్వాభివర్ణనము నెవ్వరును జేయలేరు. అయిన నిక మనము చేయవలసిన దేమనగా, పంతులుగారు చెప్పిన గుణములన్నియు నిక్కముగా తిక్కన కవితలో గలవా? అని పరిశోధించి చూచి, గ్రహించి, యాతని కవితామృతమును స్వయముగా గ్రోలి, యానందించినగాని సంతృప్తి నందజాలము.

## కవితా రీతులు

అట్టి రసాస్పదమైన కవితాసరణుల జూపుటకు ముందు కవిలోని సామాన్యలక్షణములను కొంచ ముదహరించుట యవసరమని దోచుచున్నది. పాకము, రీతి, వృత్తి, శయ్య, అలంకారము, అర్థము, శబ్దము, భావము, కథ, రచన, ధ్వని మున్నగునవి కవిత్వ సమగ్రతకు వలసిన సంభారము లైయున్నవి. భారత కవిత్రయమునకు కవిత్వమున సామాన్యముగా కదళీ ద్రాక్షా పాకములు విరివిగా నుండును. నారికేళ పాకము చాల యరుదుగా నున్నది. నన్నయ కవిత్వమున వైదర్భి, పాంచాలీ రీతులు దృశ్యములు; గౌడవృత్తి యెచ్చటనోగాని దోచదు, ఈ రెంటిలో పాంచాలీ రీతి యధికము. తిక్కన కవితలో ప్రాయికముగా వైదర్భి రీతి గలదు. పాంచాలీ తోరముగా నున్నను బాగుగా నరసినచో నదియును వైదర్భి వైపునకు జారుచుండును. రౌద్ర, భయానక దృశ్యము లుత్పాదించవలసినచోట్ల గౌడరీతియును ఆరభటీ వృత్తియు చూపకపోలేదు. కాని మొత్తముమీద కైశికి, భారతీ వృత్తులును, పాంచాలీ, వైదర్భి రీతులును చూపట్టును. పాకములు రెండని లక్షణవేత్తలు కొందరును, మూడని కొందరును భిన్నాభిప్రాయులై యున్నారు. నరస భూపాలీయ మను నామాంతరముగల కావ్యాలంకార సంగ్రహకర్తయగు మూర్తి కవి, పాకములు ద్రాక్షా నారికేళములు మాత్రమే యని యుదహరించియున్నారు. ఈ రీత్యా తిక్కన కవిత్వము పైనదెల్పిన విధముగా ద్రాక్షాపాకమున రచింపబడి

నట్లు చెప్పవచ్చును. మధురములైన పదములతో నర్థస్ఫూర్తి గలిగించుట ద్రాక్షాపాకము. తిక్కన కవితలో నీ పాకము వెల్లివిరియుచుండును.

కం॥ ఆపద గడవం బెట్టగ
నోపి శుభంబైన దాని నొడగూర్పగ మా
కీ పుట్టువునకు పాండు
క్ష్మాపాలుండు నిన్ను చూపి చనియె మహాత్మా॥

కం॥ వెఱ పెట్టిదియో యెన్నడు
నెఱుగని నీ యట్టి వాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడ
గఱపిన వా రనుచు శౌరి కల కల నవ్వెన్॥

కం॥ క్షీరోదక గతి బాండవ
కౌరవు లాడ గూడి మనికి, కార్యం బది నీ
వారసి నడపుము వారన
వీరన గురుముఖ్య నీవ వేఱుంగలదే॥

చం॥ భరతకులంబు ధర్మమును, బాడియు సత్యము, బొత్తు, పెంపుయున్
కరుణయు గల్గి యుండు నన గా నుతి గన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీ యనుగు దమ్ముడు నీ తనయుల్
యశోధురంధర శుభశీలు రీ సుచరితక్రమ మిప్పుడు దప్ప నేటికిన్॥

ఇట్టి ద్రాక్షాపాక రీతులకు లెక్కలేదు.

ఇక ధ్వన్యలంకారము లనుడు :

మ॥ వలలం డెక్కడ జూచె నొం డెడన నేవ్యక్ష్మాజముల్ పుట్టవే
ఫలితంబై వరశాఖ లొప్పగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయనుపాశ్రితప్రతతికి న్విశ్రాంతి గావింపగా
గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపగా నేటికిన్॥

ఈ పద్యము ద్రౌపది వెంటబడి వచ్చిన కీచకునిపై గవియుటకై భీమసేనుడు సమయభంగ విచారణ సేయక, తమ కాశ్రియ మిచ్చుచున్న విరాటుని మన్నింపక సమీపమున నున్న చెట్టును బెఱికి నుంకింపగా నతని వారించుటకై ధర్మరాజు డాసందర్భమున సందర్భ

చితమగు వాక్యములలో శబ్దార్థధ్వని కల్గునట్లు పల్కిన పద్యము. భారతమున కథ తిక్కన కల్పించినది గాదు. ఆ విషయమై యాతని నభినందింపజాలముగాని యున్నకథనే సంగ్రహపరచియు, వర్ణనాంశముల పట్టున కొంత పెంచియు రమ్యముగా రూపొందించిన యీ కవి ప్రశంసనీయుడు. సంస్కృత భారతమున రచనాచాతుర్యము, పదముల పొందికకంటె తెలుగు భారతమున నీగుణంబు లధికమని చెప్పక తప్పదు. వ్యాస భారతమున భీష్మ పర్వాంతర్గతములైన శ్రీమద్భగవద్గీతలు సనత్కుమార సంహిత, మున్నగు కొన్ని ఘట్టములు రసవంతములై యున్నను తక్కిన భాగములలో భాష కొంత పేలవముగాను చర్విత చర్వణముగా నున్నట్లు దోచును. తిక్కన రచితమైన అనువాదములు యథా సంస్కృతముగా నుండక స్వేచ్ఛానువాదములై, స్వతంత్ర రచనవలె పఠితలకు తోచును. స్వభావముగా తిక్కన కవిత్వము మిక్కిలి సంగ్రహ పదములతో క్లుప్తముగా వ్రాయబడియుండును. ఈ కారణముచేతనే సుమారు అరవై వేల శ్లోకములుగల విరాటాది స్వర్గారోహణ పర్వము వరకుగల పదునేను పర్వములలోను తిక్కన యిరవై వేల పద్యములలోనికి దించెను. ఆపద్యములలో చాలాభాగము కంద పద్యములే. చిన్న చిన్న పద్యములలో నధికమైన భావమును, విషయమును యిమడ్చగల శక్తి యీతనికి గలదు. కొన్ని కొన్ని చోట్ల యీ మాటల కుదింపుతో పద్యములు పిప్పళ్లబస్తావలె నుండును. తిక్కన యొక్క పద్యములో చెప్పగల విషయమును ఇతరకవులు రెండు మూడు పద్యములలోగాని చెప్పలేరు. చూడుడు— కర్ణుని వధానంతర మాతని మరణమున కెందరు కారణమో తెల్పుచు నారదుడు ధర్మజునితో నిట్లనియె :

చ॥ వినుము నరేంద్ర విప్రు డలిగెన్, జమదగ్ని సుతుండు శాప మి
చ్చె, నమరభర్త వంచనము జేసె, వరంబని కోరి కుంతి మా
న్చె నలుక, భీష్ము డర్ధరథు జేసె, యలంచె కలంచె మద్ర రా
జనుచిత మాడి, శౌరి విధి యయ్యె, నరుం డని జంపె కర్ణునిన్ ॥

ఇది శాంతి పర్వము లోనిది.

ఉద్యోగ పర్వమున ధర్మజుడు కృష్ణుని కౌరవ సభకు రాయబారిగా పంపు సందర్భమున తాను జెప్పవలసిన మాటలన్నియు చెప్పి చివరి భాగమున :

కం|| మ మ్మెఱుగు దెదిరి నెఱుగుదు
నెమ్మి యెఱుగు దర్థసిద్ధి నెఱి యెఱుగుదు వా
క్యమ్ముల పద్ధతి నెఱుగుదు
ఏ మ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్ ||

గంభీరముగా, సంగ్రహముగా కృష్ణుని గౌరవభంగము గలుగకుండా తన యల్పత్వమును కృష్ణుని యుదాత్తతను సూచించునట్లున్న యీ చిన్నపద్య మెంత చక్కగానున్నదో చూడుడు.

విదురుడు ధృతరాష్ట్రునితో :

ఉ|| దక్కెను రాజ్యమంచు నకటా యిటు తమ్ముని భాగ మీక నీ
వెక్కటి మ్రింగజూచె దది యె ట్లఱుగున్ విను మీనులోలతన్
గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పు సూవె
యిట్లుక్కివుడైన నీ కొడుకు నుల్లము నున్నటు లార గూడునే ||

చూచితిరా, యీపద్యమునందుగల సొబగు కడురమణీయము. తిక్కనగారి యెత్తుగడయే కొంత విశిష్టత గల్గియున్నది. ఇందతని యుపమాలంకార మెంత సారముగాను, యుచితముగాను, హృదయ శోధకముగాను, గాలము గ్రుచ్చునట్లు మనసు కలవరపరచునట్టిదిగా నున్నదో తిలకింపుడు. ఇంత రసోచితముగా తక్కిన కవులు వ్రాయజాలరు. ఎక్కడే పదము వాడి రసము పుట్టింపవలయునో తిక్కనకు తెలిసిన ట్లితరులకు తెలియదని ముందే చెప్పియుంటిని. ప్రథమ పద ప్రయోగమే యీ పద్యమునం దొక భావమున్నట్లు సూచించును. విదురుని హృదయమునం గల యుద్వేగ మెంత సూటిగా ధృతరాష్ట్రుని యుల్లము ముచ్చిపోవునట్లు ప్రారంభించినాడో తెలియనగును. ఇట్టి పద్యములు హృదయ మర్మభేదకములై, రస మూరుచుండునని వేరుగా చెప్పనక్కరలేదు. కవిత్రయములో తక్కిన యిరువురు నయితము ఖ్యాతని విధముగా రచనా శిల్పము చూపలేదు. జాతీయము లింతగా

వాడలేదు. ఎట్లన, నన్నయభట్టు రీతిగనే యనర్గళమైన ధారయును, సంస్కృతపద వైచిత్రియు చూపెనుగాని జాతీయ పదప్రయోగములని చెప్పదగిన ప్రయోగము లాతని యరణ్యపర్వ భాగమున గనుపింపవు. ఎట్లనగంటె నన్నయగారి రచితభాగముననే కొన్ని కొన్ని జాతీయములు రసోచితముగా జొప్పింపబడి యున్నవి. ఈ విషయములో తిక్కనకు తిక్కనయే సాటి. వర్ణనాభాగమున ప్రాయికముగా తిక్కన తెలుగు పదము లెక్కువగా ప్రయోగించుచుండును.

విరాటపర్వమున ఉత్తరకు బృహన్నలకడ నృత్యగీతాది విద్య లభ్యసింపజేయుటకై తండ్రి పిలిపింపగా వచ్చినపట్ల నామెనువర్ణించిన తెఱంగు గాంచుడు :

సీ॥ అల్లదనంబునను నువ్వుమైకొన జూచు
నడపు కాంతికి వింత తొడవు గాగ
వెడవెడ నూగారి వింతర్థై యేర్పడు
దేరనివళులలో నారు మిగుల
నిట్టలం ద్రోచుచు నెరవులకలమేర
తెల్లను బిగియెక్కి యేర్పడంగ
తెలుపును, కప్పును వెలయంగ మెరుగెక్కి
తీరకంబుల గల్కిదనము దొడర
చరణములును, నడుము గన్నులం
జవ్వనంపు చెన్ను, నివ్వటిల్లు
చునికి చెలుపుచుండ నుత్తర సనుదెంచె
నలరు విలుంతు పూవుటమ్ము వోలె॥

ఇట్లే,

సీ॥ నెత్తమ్మి రేకుల మెత్తదనము దెచ్చి
యచ్చున బెట్టి న ట్లందమొంది
చక్రవాకంబుల చందంబుగొనివచ్చి
కుప్పలుసేసిన ట్లొప్పమెఱసి
చందురునునుగాంతికం దేర్చి గూర్చి బా
గునకు దెచ్చినయట్లు కొమరు మిగిలి
యళికంబులం గప్పు గల యంతయునుబుచ్చి
నాలుపోసినభంగి నవక మెక్కి

యం(ఘ్రితలములః గుచములు నాననంబు
కచభరంబును నిటులున్న రుచిరమూర్తి
యనుపమాన భోగములకు నాస్పదంబు
కాదె, యీ త్రిప్పలేటికి కమల వదన॥

ఇట్టి పద్యంబులందు తియ్యని పలుకులేగాక శిల్పముగూడ నంద ముగా నున్నది. నన్నయగారి పద్యములలో వర్ణనలలో పలుకుల మార్దవ మధికముగా నున్నను, రచనాశిల్పము తక్కువ. నన్నయగారి వర్ణనసందర్భమున, "పలుకులముద్దును" అనుపద్యమును చూడనగును.

ఇట్టి మార్దవపదప్రయోగ మంతగా నెఱ్ఱన కవిలో దీపింపదు గాని తిక్కన రచనా కౌశలము చూచి యా రీతి పద్యముల కొన్ని వ్రాసి యున్నాడు. తిక్కన విరాట పర్వమున పాంచాలి సింహాబలు నిచే భంగపడి వచ్చినప్పటి యామె వర్ణనను పరికింపుడు :

సీ॥ ఎలదీవ గప్పిన లలితపరాగంబు
క్రియమేన మేదినీ రేణువొప్ప
చంపకంబున నవసౌరభం బెసగెడు
గరణి నాసిక వేడిగాడ్పు నిగుడ
దోయజదళముల తుది మంచు దొరగెడు
గతి కన్నుగవ నశ్రుకణము లురుల
నిందు బింబముమీది కందుచందంబున
గురులు నెమ్మొగమున నెఱసియుండ
సర్వజన వంద్యయైన పాంచాలి......

ఇట్టి పద్యమును ఎఱ్ఱనకవి భారతారణ్య పర్వమున లంక నున్నకాలమున సీతను వర్ణించుచు నేదో కొంత మార్దవము చూపించెను :

శీ॥ కన్నీరు జడిగొని గ్రమ్మ బాల్కెక్కిన
క్రమ కపోలభాగములు గలిగి
యవశయై రొఱగిన యంగవల్లిక పొంత
నున్న భూమీరుహం బూత గాగ
వెడలు నిట్టూర్పుల వేడిమి గలిగిన
యధర పల్లవము గారాకు బోల

తలపుల సందడి, దండడించిన తాల్మి
కదలు శిరఃకంపగతుల బెరయ
నున్న పుణ్యమూర్తి యుత్తమ సౌందర్య
సవనతాస్య నార్తయైన దాని
గని విదేహ తనయగా నెఱింగితి నేను........

ఈ విధముగా వ్రాసినాడు గాని తిక్కన పోలుపు మాత్రము రాలేదని చెప్పక తప్పదు. ఎఱ్ఱనకవికి తిక్కన కవిత్వమునం దెక్కువ గౌరవము గలదని వీరేశలింగం పంతులుగారు అభిప్రాయపడినారు. కాని నిజముగా పరిశీలించినచో నాయన పోకడలన్నియు నన్నయార్యుని పోకడలవలె నుండును. కొన్నిచోట్ల నన్నయ పద్యచరణములే యథాతథముగా తన గ్రంథమున వ్రాసికొన్నాడు, పరికింపుడు. సభాపర్వమున రాజసూయయాగ మహోత్సవ సందర్భమున శ్రీకృష్ణుని ధర్మజుడు పూజింపగా శిశుపాలుడు కుపితుడై యుద్ధమునకు లేవగా నుభయ సైన్యస్థితిని వర్ణించుచు నన్నయగారు :

చం॥ రయ విచలత్తురంగమ తరంగములన్ మదనాగనక్రసం
చయముల, చంచలచ్చటుల సైనిక మత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణి భోజకురాంధక వారిధియుం గలంగె........

యని వ్రాయగా ఎఱ్ఱన అరణ్యపర్వ షష్ఠాశ్వాసమున దుర్యోధనుని ప్రాయోపవేశ విరమణానంతరము పురికేగు సందర్భమున,

చం॥ రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగనక్రసం
చయముల చంచలచ్చటుల సైనిక మత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజచంద్రు నుదయంబున, దద్దయు బొంగె ప్రస్ఫురతన్
భయద మనోహరప్రకటి భంగుల తద్భటవార్ధి యిద్ధరన్ ॥

అని వ్రాసినాడు. మొదటి రెండు చరణములును నన్నయ పద్యమునకు నకలే! నన్నయ పద్యమున "వారిధి" ఎఱ్ఱన పద్యమున "వార్ధి" గా మారినది.

కవితాధార పదవైఖరియం దించుమించుగా వీ రిరువుర శైలియు నొకే మార్గముగా నున్నది. కాని తిక్కన వరవడి గనుపింపదు, కవిత్రయ కవితా ప్రభావ మనంతర కవులపై నేవిధముగా

నున్నదో వ్రాయు సందర్భమున ఎఱ్ఱన విషయ మేమని చదువరులకు దోచవచ్చును గాని ఎఱ్ఱన యీ త్రిత్వములో చేరినవా డగుటచేత నించుక నిచ్చట చెప్పవలసివచ్చినది. నన్నయ ఎఱ్ఱనల కవితలలో సన్నిహితత్వ ముండుటకు కారణము లేకపోలేదు. ఎఱ్ఱన నన్నయ విడచిన వనపర్వ శేషముల పూరించుచు తన పేరగాక నన్నయగారి పేరుతోనే నన్నయ రచించినట్లే యుపహరించెను. అందుచేత శైలిభేద మగుపడకుండ వ్రాయవలసివచ్చెను. ఆ మాటనే ఎఱ్ఱన భారతమున స్పష్టముగా చెప్పెను:

గీ॥ ఎఱ్ఱనార్యుండు సకలలోకైక విదితు
డయిన నన్నయభట్టు మహాకవీంద్రు
సరససారస్వతాంశ ప్రశస్తి దన్ను
జెందుటయు సాధుజన హర్షసిద్ధి గోరి॥

కం॥ ధీరాచారుడు తత్కవి
తా రీతియు గొంత దోప దద్రచనయ కా
నారణ్య పర్వ శేషము
పూరించె కవీంద్ర కర్ణపుట పేయముగన్॥

అని వ్రాసికొన్నాడు. కనుకనే పలుచోట్ల చిత్రమైన పదముల ప్రయోగమున్నను శైలినిబట్టి చూచిన యించుమించు నన్నయ వ్రాసినట్లే దోచును కాని వేర్వేరు కవులు వ్రాసినట్లు కనుపడదు. ఎఱ్ఱనగారి హరివంశము, లక్ష్మీనృసింహ పురాణములలోని రచనా విధానము కొంత వేరుగా నున్నది. లక్ష్మీనృసింహ పురాణము ప్రహ్లాద చరిత్రయే. ఆ కవిత్వము ప్రబంధశక్తి గల్గియున్నది. అదియే భాగవతమున సప్తమస్కంధమున బమ్మెర పోతనామాత్యుడు వ్రాసియున్నాడు. పోతరాజుగారి కవిత్వమువలె నంతసరళముగాను, మృదువుగాను, భక్తిరస పూరితముగా నుండదు. కాని ప్రౌఢముగా నున్నది. అదియును భక్తుని చరిత్రయే, అయినను భక్తిరసము వెల్లి విరియుచున్నట్లుండదు. హరివంశము దాదాపు తక్కిన పురాణములవలెనే యున్నది. ఎఱ్ఱననుగూర్చి వ్రాసినపుడు ముందు ముందు వీరి రచనను గూర్చి వ్రాయుదునని చెప్పియుండుటచే యింతగా వ్రాయవలసివచ్చినది. ఈ యంశ మింతటితో విడచి తిక్కనకడకు తిరిగి వత్తము.

# తెలుగు దేశీయ పదములు

సూక్తి సుధా నిధియని నన్నయ వ్రాసికొన్నను పలువురు సామాన్యముగా వ్యవహారమున వాడు సూక్తులు జాగ్రత్తగా వెదకిన గాని నన్నయభాగమున కానరావు. తిక్కన రచనభాగమున నట్టి సూక్తులు గల్గిన పద్యము లనేకములున్నవి. తరచుగా తిక్కన పద్యములనో, చరణములనో, దినదినము తెలుగు దేశమున వాడుచునే యుందురు. మచ్చునకు కొన్ని చూపుదును—

(1) కుంతీ సంతానముతోడి పొత్తు జనునే మాకున్

(2) వాడి సూది మొన మోపినంతేని వసుధ నీను

(3) పట్టపగటింటి సూర్యుని పగిది కర్ణు డుగ్రమూర్తియై వెలుగుచు నున్నవాడు మాధవా మన రథమ్మను మరలనిమ్ము బ్రతికి యుండిన శుభముల బడయవచ్చు

(4) బడుగయి పాలలో బడిన బల్లివిధంబున నుండకుండునే

(5) ఆ సేనకు యీ సేనకు వాసి యడిగె దీవు గాని వసుదేవ సుతుం డా సేనగలడు. దత్సము నీసేనం జూపు మానవేశ్వర నాకున్

(6) వచ్చిన వాడు ఫల్గుణ డవశ్యము గెల్తు మనంగరాదు రా లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే

(7) అడుగులు దిన్నట్లగునే కడుపున గుట్టెత్తినపుడు కడుపరచితి నా డొడలెరుగక పాండుసుతుల నుడిగి మడన్గవలసె నిప్పు డొక సాత్యకిచే

(8) అడిబీరపు తులువ గెలుచునటె పాండవులన్

(9) తిండిపోత నీకు భండనం బేటికి

(10) ఆపద గడవంబెట్టగ నోపి శుభంబైనదాని నొడగూర్పగ మాకీ పుట్టువునకు పాండుక్ష్మాపాలుడు నిన్ను జూపి చనియె మహాత్మా

(11) అటు మిన్నందిన యట్టి వాని పొడ వెంతన్నట్లు
(12) చిచ్చునకు దోడు గరువలి వచ్చిన క్రియ
(13) శ్రీ రా మోకా లొడ్డిన తీరుగాదె
(14) గుండ్లు తేలి బెండ్లు మునింగి నట్లయ్యె

తిక్కన వాడిన విచిత్రమైనమాటలకు లెక్కలేదు. అచ్చతెలుగచ్చుపోసినట్లున్న వీనిని పరికింపుడు — ధర్మసూతి మెత్తని పులి; నభంబు తూటుకట్టు; ఎడవాళ్లంబనుచు; ఉల్లికుట్టుమాటలు; మిసిమింతులు; నోరిచేటలు; తుత్తురుముసేసె; పులివాతికండ; తెప్పతెరలగవిసిరి కడిమిన్; ఓహరిసాహరి; ఉరవడించు; మంటికలు; చిట్టలుగట్టుమంటలోన్; చిట్టాడుట; కనుపుగొట్టి; పీనుంగుపెంట జేసె; ఉల్లంబుచ్చిపోనాడుమీ; పుయిలోడు; చూపరపిండు; తామరతంపర; పొనుంగుపడు; పోరాని చుట్టము; అరవాయిగొనక; మిఱ్ఱుపల్లములు; కప్పయెలుంగుపాము; తేనెపూసినకత్తి; తలచీరె; మారుమలయు; నుగ్గునూచమై; కనుకనింబరచె; పడల్వరచు; క్రేళ్లువారు; అంపవెల్లి; కురుకులుగట్టు; కుప్పెకోలము; వెఱవరి; ప్రారపొచ్చెము; చిడిముడిపాటు; క్రందుకయ్యము; పిచ్చలించు; చేతోగతిపల్లటిల్ల; పుల్లవడి; మెయిమఱువుల; పురళ్లుజేయు అడిబీరవుతులువ; గఱితలు; బెండుపడు; జెట్టాజెట్టులు; మిఱ్ఱెక్కి......

ఇట్టివి వందలును వేలును చూపవచ్చును. ఈకవి సామాన్యముగా ప్రతి పద్యమునందును నేదో యొక వింత పదముగాని సామెత గాని జాతీయముగాని ప్రయోగించుచునే యుండును. ఆ యాపాత్రల సంభాషణలు మిక్కిలి సహజముగ నుండి వాడుక పదములతో నిండియుండును. ఎదురుపడి మాట్లాడుచున్నట్లు దోచును. ద్రోణపర్వమున కర్ణుడొకసారి భీము నోడింపగా నతడు డాగిన సందర్భమున కర్ణుడు భీమునిజూచి "తిండిపోత నీకు భండనం బేటికి" అని యుపాలంభించిన తరువాత నర్జునుడు వచ్చి యామాట విని కర్ణునితో:

ఉ॥ ఏమిర కర్ణ, భీము నటు లేటికి దిట్టితి తతండుదోల సి
గ్గేమియు లేక పారునెడ నెవ్వరు దిట్టిరి నిన్ను గెల్చు సం
గ్రామమునందు తప్పిదము గల్గినయంతన యింత గ
ర్వమేలా మును నిన్నెరుంగమె చలంబున సాత్యకి యిష్టు గెల్వడే॥

మరియును ఉద్యోగపర్వమున శ్రీకృష్ణుడు తన రాయబార సందర్భమున భీముని జూచి :

కం॥ వెఱ పెట్టిదియో యెన్నడు
నెఱుగని నీ యట్టివాని కెవ్వారో కో యీ
పిఱికితన మిట్టు లలవడ
గఱపిన వా రనుచు శౌరి కల కల నవ్వెన్ ?

అట్లు నవ్వి తానును పార్థుడును యుద్ధము సేయుటకు ప్రయత్నము సేయుచు నీ సహాయము కోరుకొన నుండగా నీవు సంధిమాటలేల చెప్పెదవని పరిహాసించినపుడు భీముం డిట్లనియె :

శా॥ ఏమీ ! పార్థుడు నీవు దండిమగలై యీవచ్చు కౌరవ్య సం
గ్రామక్షోభము బాహుదర్పమున దీర్పన్ పెద్ద మిట్లైక్కి మి
మ్మేమెల్లన్ వ్వెరగంది జూచెదముగా కీ సారికిఁ పోయిరా
భీముం డిత్తరి రిత్తమాటలకు కోపింపండు నూ పెంపెరఁ॥

గీ॥ నడికి రేయివచ్చినను నొవ్వ బలికిన
గలుగునయ్య జయము, కడగి నీవు
నడుపు మనికి నెల్లి నాచేతి బలుపు చూ
చెదవుగాక వేయుచెప్ప నేల ॥

ఈ విధముగా ముఖా ముఖీ మాటలాడు పద్యములు సందర్భోచితముగ నుండును. ఈ కవి వాడని తెలుగు పదమును ఆయనకు పూర్వులుగాని తరువాతవారుగాని వాడియుండలేదు. అందుచేతనే “ అభినవ దండి ” యని బిరుదమందిన కేతన తాను రచించిన దశకుమార చరిత్రము తిక్కనగారి కంకిత మిచ్చుచు తిక్కన నభివర్ణించు పట్టున :

కం॥ అగునన గొమ్మయ తిక్కడు
జగతిన పూర్వార్ధశబ్ది, చారుకలితమై
నెగడిన ‘ బాణోచ్ఛిష్టం, జగత్రయం ’
బనెడు పలుకు సఫలం బయ్యెఁ ॥

యనెను. ఇది సత్యమే యనుటకు సందియము లేదు. సమకాలికులగు కేతనాదు లిట్లుగ్గడించుటంజేసి తిక్కన కవి ప్రతిష్ఠ యతని

జీవితకాలములోనే దేశమున వ్యాపించెనని తలంపవచ్చును. మరియు నుభయ కవిమిత్రు డను పేరును "కవితా వాక్పతి" యను ప్రశస్తియు గల్గినట్లు కేతన గ్రంథములోని కొన్ని యితర పద్యములవలన దెలియుచున్నది.

## అనువాద పద్ధతి

సంస్కృత భారతమును తెనిగించుటలో కవిత్రయము వారు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారివలె యథాతథముగా తెనిగింపక కొన్నిచోట్ల పెంచియు, కొన్నిచోట్ల కుదించియు, గ్రంథము రమ్యముగా రసవంతముగా నుండి వినువారికి విసుగు పుట్టని రీతిగా రచించిరని పైన దెల్పియున్నాను. తిక్కన విరాట్పర్వములో మాత్రము కథ పెంచి వ్రాయబడినది. అయ్యది ప్రారంభ శూరత్వమేమో కాని తక్కిన చాలా భాగములో సంగ్రహముగానే వ్రాయబడినది. స్థాలీ పులాక న్యాయముగా కొన్నిటి నిం దుదాహరణముగా చూపవచ్చును. విరాట్పర్వమున కీచకునిచే భంగపాటుగనిన ద్రౌపది విరాటుని సభ కేగి మొరబెట్టుకొను ఘట్టమును గాంచుడు :

శ్లో॥ సాసభా ద్వారమా సాద్యరుదతీ మద్యమ బ్రవీత్
అవేక్షమాణానుశ్రోణీ పతీంస్తాన్ దీనచేతసః ॥

ఆకార మభిరక్షంతీ, ప్రతిజ్ఞాం ధర్మసంహితాం
దహ్యమానేన రౌద్రేణ, చక్షుసాద్రుపదాత్మజా ॥

అను శ్లోకములకు తిక్కన తెలుగున ఈ క్రింది పద్యములు రెండిటిని గాంచుడు :

సీ॥ ఎలదీగ గప్పిన లలిత పరాగంబు
క్రియయైన మేదినీ రేణు వొప్ప
చంపకంబున నవసౌరభం బెసగెడు
కరణి నాసిక వేడి గాడ్పు నిగుడ
తోయజ దళముల తుది మంచు ధారగెడు
గతి కన్నుగవ నశ్రుకణము లురుల
నిందు బింబము మీది కందు చందంబున
గురులు నెమ్మొగమున నెనసియాడ ॥

సర్వజనవంద్యయైన పాంచాలి, సింహ
బలునిచే నివ్విధంబున భంగపాటు
తనకు వచ్చిన నెంతయు దైన్య మొంది
య వ్విరాటుని సభ జేరి నరిగి నిలచి ||

ఉ|| పంబనకోపము న్నమయ భంగ భయంబున నగ్గలించి యు
ల్లంబు పెనంగొనంగ బతులం దగుసభ్యుల జూచుమాడ్కి ధూ
ర్తుంబగు చూడ్కి నా ద్రుపదుకన్నియ జూచి సభాజన ప్రతా
నంబును మత్స్యనాథుడు వినంగ నెలుంగు చలింప నిట్లనెన్||

ఈ పద్యములలోని సీసము మొదటి నాలుగు చరణములలోను చూపిన వర్ణన శ్లోకములలో లేనే లేదు. తిక్కన రెండవ పద్యమునం దును స్వంతభావముల జేర్చి వర్ణనాచమత్కారము చూపెను.

శ్లో|| తాం వేశ్మాం న ర్తనాగారం పాంచాలీ సంగమాశయా
మన్య మానస్య సంకేతమగారం ప్రవిశ త్తతః||

అను సామాన్య విషయమునకు

శా|| సింగంబున్న గుహానికేతమునకున్ శీఘ్రంబున న్వచ్చు
మాతంగంబున్ బురుడించుచున్ పవన పుత్ర స్వీకృతం బైన యా
రంగాగారము చేరవచ్చె మదిలో రాగంబు ఘూర్ణిల్ల నిం
తిం గాముం డిటదేడె యింత కని యు ద్వృత్తాంగజోన్మాదుడై ||

యని పెంచి రెుక యుపమాలంకారమును జేర్చి వ్రాసినాడు. ఇట్లే గ్రంథమునం దంతయును స్వేచ్ఛానువాదము, కథ కుదింపు, పదముల బిగింపులతో నుండును. తిక్కన యిరువురును యిట్లే అనువదించిరని ముందే చెప్పితిని.

## రా జ నీ తి చ తు ర త

రాజనీతికి సామ దాన భేద దండోపాయంబులు ముఖ్యములు. ఈ నాల్గుపాయములు శత్రువులతో వ్యవహరించు సంధ్భమున ప్రయో గింపవలసినవి. అందు మొదటిది సామము. మంచితనముతో శత్రువుల నడంచుటగాని, శాత్రవము నడంచుటగాని జరుగవలయును. అయ్యది

సాధ్యము కానియెడల కొంత దాన మిడి యనగా ధనము నిడి శత్రుత్వ
మును పోగొట్టుకొనుట; తర్వాత తన పని సాధించుట. అట్టి యుపా
యము సహితము ఫలింపని పట్టున శత్రువులలోనే పరస్పర భేదములు
పుట్టించుట లేక న్యాయముగనే తగాయిదా పెట్టుకొని ధర్మముగాను
హేతువాదములతోను ప్రతిఘటించుట. ఈ మూడుపాయములు కొన
సాగక లేక ప్రయోజనము లేకపోయినచో యుద్ధముచేయుట. ఈ
చతుర్విధోపాయముల వలన నొక రాజు ప్రజాను రంజకుడగుట,
ప్రజలకు తనపై సానుభూతి గలుగుట, తనయందు దోషము లేదను
నాత్మతృప్తి గలుగుట—ఈరాజనీతి భారతయుద్ధవిజయమున చక్కగా
పాటింపబడినది. ఇంతియగాక యిరుగు పొరుగు రాజుల సహాయము
కావలసియుండును. అందుచేత దేశమునంగల రాజులకు తమ దోష
మేమాత్రము లేదని నచ్చజెప్పవలెను. శత్రువు దుష్టుడనియు, ధర్మ
దూరుడనియు నమ్మింపవలెను. ఈ విధమైన ప్రచారము ముందుగా
జరుపవలయును. పాండవులు మత్స్యరాజు పట్టణములో నుండగనే
యభిమన్యుని వివాహమునకై యనేకమంది రాజు లరుదెంచిరి. అదే
మంచితరుణము గావున తమ బంధువులయిన రాజులేగాక పరిణయ
సమాగతాఖిల ధరణీశుల సమావేశపరచి యచ్చట శ్రీకృష్ణుడు
పాండవ కార్యార్థియై యిట్లు ప్రసంగించెను:

మ॥ కపట ద్యూతమునందు సౌబలునిచే, గౌంతేయు లాత్మీయ రా
జ్య పదభ్రంశము బొంది, సత్యనిరతిఁ శక్తాత్ములై యుండియున్
కుపితస్వాంతులు గాక తత్సమయ సంక్షోభంబు గాకుండగా
విపినావాసము గూఢచర్యయును గావింపం దలంపొప్పదే॥

ఆ॥ తలచినట్ల వ్రతము సల్పి యమ్మాడ్కి
పండ్రెండు వత్సరములు పాండవేయు
లకట క్రూర సత్త్వయాతుధానావళి
తోడ కాననమునగూడి మనరె॥

కం॥ పదపడి దుస్తరమగు నీ
పదమూడవ యేడు గడపబడుట యరిది త
మ్మెది రెరుగమికై యాపద
లొదవిన సైరించి రిట్టి యునికియు గలదే॥

తే॥ ధర్మమార్గంబు దప్పడు తలప డొక్క-
తెఱగు ధర్మము దప్పి యుధిష్ఠిరుండు
బడయ నోడబడ డఖిలేంద్ర పదవినైన
నుచితగతి నెంత వసుసిన యుల్లసిల్లు ॥

అని ప్రారంభించినాడు. రాజ్యము పాండవుల పితృధన మని యును, దిగ్విజయము చేసి సంపాదించుకొన్నదనియును న్యాయ శాస్త్ర రీతిని వాదించెను. అచ్చట నున్న రాజులందరి సమ్మతి వడసి ద్రుపదుని పురోహితుడు ధృతరాష్ట్రుని యొద్దకు పంపిరి.

పిమ్మట కౌరవులకును, పాండవులకును యుద్ధము సిద్ధమేయని తలంచి తమ తమ పక్షముల బలము గావించు ప్రయత్నమున శల్యుడు దుర్యోధనునకు సహాయమొనర్చెదనని వాగ్దానము చేసి ధర్మజుని కడకు రాగా నతని వాగ్దాన విషయ మతనిచేతనే వినెను. శల్యుడు మాద్రికి సోదరుడు. నకుల సహదేవులకు మేనమామ యయ్యెను, తను కబురు పంపగా వచ్చుచున్నవాడయ్యెను, మార్గమధ్యములో దుర్యోధను డెదుర్కొని యాతని సహాయ మర్థింపగా నాతనికి సహాయ మొనర్చెదనని చెప్పినందుకు ధర్మజుం డతనిపై కోపము వహించి, తిర స్కారభావము చూపియుండవలసినది. కాని ధర్మజు డట్లుసేయక :

తే॥ మేలుచేసితి రొక్కరి మెచ్చి వారి
కోర్కె దీర్చుట పెద్దల గుణముగాదె
యది మదీయ చిత్తమునకు హర్ష కరమ
తివిరి యొక్కటి వేడెద నవధరింపు ॥

పార్థునకు కృష్ణుండు సారథి. కర్ణార్జునుల యుద్ధమున కృష్ణునకు ప్రతిసారథి యచ్చట నెవ్వడును లేరు. కావున కర్ణునకు నీవు సారథ్యము చేయక తప్పదు. ఆ సమయమున కర్ణుచిత్తమున కలకబుట్టించి పార్థుని రక్షింపవలయును. అకృత్యమని యనుమానింప వలదని ప్రార్థించి యతనిచేత పార్థుని కాపాడెదనని వాగ్దానము పొంద గలిగెను. ఇది రాజనీతి చతురత. మఱియు, సంజయుని రాయబారమున ధర్మజుడు చూపిన వాక్చాతురత సమంజసముగా నుండును, మీ యోగక్షేమము

లెట్లున్నవో తెలిసికొనుటకు నన్ను మారాజుగారు పంపినారని సంజయుడు చెప్పినప్పుడు ధర్మజుడు :

కం॥ ఆరాజు మాదెసం గల
కారుణ్యము కతమునను సుఖంబున నిట్లు
న్నారము నిను బుత్తెంచిన
గారవమున నాదు మది వికాసము బొందెన్॥

కం॥ అమ్మనుజేశ్వరునకు సే
మమ్మే, పుత్రకులు సుఖులే, మనుమలు సమ్మో
దమ్మున బెరిగెదరే, నగ
రమ్ముల భూములను సుఖపరంపర గలదే॥

మొదటి పద్యమున కొంత యెత్తిపొడుపు ధ్వనించునట్లు, పైకి మర్యాద దోచునట్లును చెప్పి, రెండవ పద్యమున ధృతరాష్ట్రునకు మనస్సంతోషము గల్గి, కొంత మోమోటము జనించునట్లు పల్కినాడు. సామాన్యముగా తనకంటె తన బిడ్డల క్షేమమును వారి యభివృద్ధిని గూర్చి విచారించు మాటలతో ప్రతిమానవుడు నధిక సమ్మోదము పొంది అది విచారించువారిపై నాదరము చూపుచుందురు. అది మానవ స్వభావము. పిమ్మట పెద్దలును తమయం దభిమానము గల వారైన ద్రోణ, భీష్మాదుల క్షేమము నడిగెను. వారితోడను ముందు పని యున్నది. వారి క్షేమము తన కవసరము. అనంతర మచ్చటి పరిస్థితుల నెరుంగ గోరెను. సంధి కుదురుట కవకాశమున్నదో లేదో తెలుసుకొనుట యవసరము. అందుచేత ధర్మజుడు :

కం॥ దుర్యోధనుని యింటం దేకు
కార్యమునకు ఖడ్గమునకు గలవాడై, చా
తుర్యంబు మెరయు కర్ణుని
యార్యత్వము సెల్లుచున్నయదియే సెమ్మిన్॥

అని ప్రశ్నించెను. సంజయుం డా ప్రశ్నోద్దేశ్యము గ్రహించి యీ విషయ మంతగా విచారింప నక్కరలేదని సూచించుటకు "కురురాజునొద్ద నవినీతులు, నీతిపరులు, సత్త్వసంపన్నులు, దురహంకారులు

మఱియు వివిధ ప్రకారులు బెరసియుందు” రని చెప్పి ధర్మజునకు కొంత ధైర్యము తోచునట్లు “వా గ్లోక ళ్లోకళ్ల మాటలం బోయెడు వారు కారు” అని చతురముగా నుడివెను. క్షేమసమాచారముల సమాధానము చెప్పుచు శాంతి సూచించు సలహా తోచునట్లు నేర్పుగా :

కం॥ పొందొందగ దలచితి నీ
విందు శశిరమైన విమల హృదయంబున వా
రందరకును సేమం బిట
ముందర లేకున్న నేడు మొదలుగ గలుగున్॥

అని పల్కెను. పిమ్మట వచ్చి తెచ్చిన సమాచార మేమని యడుగగా, సంజయుండు శాంతిపడుట మంచిది. సంగరబుద్ధి మానవలెను. అహింస దొడ్డది. అత్యంత ధర్మాత్ముడవు, శాంతియుతుడవు నీవు. వారు దుర్మార్గులు. నీ కీర్తికి శాంతికి భంగకరమగు యుద్ధపు తలంపు మానుము. భీష్ముని యభిప్రాయము సహిత మిట్లే యున్నది. జయాపజయము లూహింప శక్యము గానివి. శలవు దయచేయుడు. పోయివచ్చెద నని, ఆశ సందకుండా, శోకను పొందకుండా తియ్యని మాటలు చెప్పి వెళ్ళుదలచెను. అపుడు ధర్మజు డాతనికి సమాధానము చెప్పుచు :

ఉ॥ సెయ్యము దప్ప నొండొకటి నీ చెవి సోకనె నాదు పల్కులం
దియ్యెడ సంజయా, యనికి నిమ్మెయి నల్కెదు నీవు మాకు దా
గయ్యము దక్కి మన్కి దగు కార్యము కాదొకొ పోరితంబు లే
కయ్యెడు నర్థసిద్ధి వెడగైనను నొల్లక యొందు నేయునే॥

సంజయా! సమచిత్తుండవై విను :

కం॥ తానైన నపుడు వక్రుం
డై నీతిపథంబు విడచె, నక్కట పతి మ
మ్మైనను చక్కని తెరువున
బూని నడుపుడనచు నిపుడు బుద్ధులు సెప్పెన్॥

అని మరియు :

కం || ఎదిరిం దమయట్టుల. కా
మది దలచిన పొసగుగాక మాకం గుడు మిం
డిద మీరు వస్రిక్క గొనుడని
చదురడచిన మనసు పొందు చక్కంబడునే ||

మొదలైన విషయంబులు చెప్పి గురు, భీష్మ, ధృతరాష్ట్ర, కృపాచార్యులకు నమస్కారంబు లందింపుమని చెప్పి సంజయు నించుక పొగిడెను :

కం || నీవొండె విదురు డొండెను
గావలయుంగాక యిట్టి కార్యంబునకున్........

యని హృదయము చూరగొనెను. సంజయుడు తాను కురురాజు నొద్ద నుండినను సమయము వచ్చినపు డెల్ల పాండవ పక్షపాతియై ధృతరాష్ట్రుని ముఖముననే యతనిని నిందించి మందలించుచుండెను. అన్ని సంగతులు పూర్తిగా చెప్పిన పిమ్మట సంజయుని చూచి పితామహునితో నిట్లనుమని చెప్పెను:

కం|| ఇంతలు పుట్టినచోటను
శంతనునందనయ హీన శాంతిపరుండై
కాంతే యగ్రజు డాలము
పొంతం బోనొల్ల డనుము, బుధు లియ్యకొనన్ ||

మరియు —

చం|| అడగగనీక శంతనుని యన్వయముం గలిగించి తీవ యి
ప్పుడు దగ నీమతంబునన పొందొనగూడగ జేర్చి పౌత్రులన్
నడికి సధర్మవృత్తికిని చావునకుం దొలగించి మన్చినన్
పుడమి జనంబు రాజులును, భూసురులున్ న్నిను బ్రస్తుతింపరే||

ఈ రెండు పద్యములతో భీష్ముని మనస్సు కరిగి నీరై పాండవుల పక్షమున కురుసభలో వాదించుటకై ధర్మజు డాతనికి నచ్చునట్లు జేసెను.

సంజయుడు తన రాయబారము ముగించుకొని హస్తిన కేగిన పిమ్మట తమ నిశ్చయమును తెలిపి సంధికి ప్రయత్నము చేయుటకై

శ్రీ కృష్ణుని కురురాజు కడకు పంపు తలంపుతో నొక సమావేశమును ధర్మరాజు సమకూర్చెను. అందు పాండవులు, కృష్ణుడు, పాంచాలియు ప్రధాన సభ్యులు. ఎట్లైనను సంధిజరుగుటే యతని యభిమతము. ఈ కోర్కె నేరవేరవలె నన్నచో శ్రీకృష్ణుని ముందుగా నొప్పింపవల యును. సంజయునితో కృష్ణు డన్న మాటలధోరణి చూడగా నతనికి యుద్ధమే యవశ్యకర్తవ్యమైనట్లు స్పష్ట మయ్యెను. అయినను కృష్ణునే రాయబారిగా కరినగరి కంపిన యచ్చటగల ద్రోణ, విదుర, భీష్మాదుల తోను, ధృతరాష్ట్రునితోను, సామ దాన భేద దండోపాయముల నేర్పు చూపి కార్యసిద్ధి గల్గించునను నాస పోలేదు. కావున మున్ముందుగా నతనిని సుముఖుని జేసుకొనవలెను. ఇక తన తమ్ము లున్ననో వారి తలపులు గౌరవయుక్తమైన సంధి కనుకూలముగానున్నట్లే భావించెను. వారివల్లసంధికి నిరోధముగల్గదని విశ్వసించెను. అన్నిటికి "మూలకందం ముకుందమ్" అనునట్లు కృష్ణుని సానుభూతి సంపూర్ణముగా సంపాదింప వలెను. ఈ మహాత్కార్యము సాధించుటకు ముందుగా నతని హృదయ మునకు నచ్చచెప్పవలెను. పిమ్మట లాభాలాభములు, ధర్మాధర్మములు మున్నగు తక్కిన యంశములను చర్చింపవచ్చును. ఈ భావముతో తాను తమ్ములు ద్రౌపది యితర బంధు మిత్రులతో మాధవు మందిర మున కేగిరి. అట నందరు కృష్ణుని పరివేష్టించియుండి వినయముతో నాతని జేరి ధర్మజుడు కృష్ణు నుద్దేశించి :

కం॥ ఆపద గడవం బెట్టగ
నోపి శుభంబైనదాని, నొడగూర్పగ మా
కీ పుట్టువునకు పాండు
క్ష్మాపాలుడు నిన్ను చూపి చనియె మహాత్మా॥

అని హృదయమును తట్టెను. పిమ్మట:

గీ॥ సమయ మిది మిత్రకార్యంబు జక్కజేయ
నీకతంబుననే మవినీతుడైన
యా సుయోధను తోడి పోరాట దక్కి
యనుభవింతుము మాయంశమగు ధరిత్రి॥

అని చెప్పి యతని శక్తిని కొనియాడెను. అంతటితో నూరకుండక "నీకు మేము ప్రద్యుమ్నాది కుమారులతోటివారము. మమ్ము దురితంబులు బొరయకుండ నరసి రక్షింపుము" అని వాత్సల్య సంపాదన కోరెను. ఇది రాజకీయ చతురత, కార్యసాధన కుపలక్షణము. శ్రీకృష్ణుడో యితనికంటె చతురుడు. ధర్మజుండట్లు చెప్పి యంతదీనముగా బ్రతిమాలిన కారణము గ్రహించెను. తాను సంజయునితో నట్లు చెప్పినను ధర్మజు కార్యభంగమునకు తాను కారణము గారాదు. నింద తనపై బడరాదు. అందుచేత నతనితో నేవిధమైన చర్చ సాగింపక యే "నీ పంచినట్లు గావించెద, నీతలం పెయ్యది" చెప్పుమని యాదరముతో ననెను. ధర్మజుండంత హింసాపద్ధతి నిరసించెను. క్షత్రధర్మము నీసడించి వెక్కసపడెను. జయాపజయములు శంకించెను. పగ నిర్మూలించుట ప్రధానమని వక్కాణించెను. రాజ్యలాభావశ్యకత విశదపరచెను. శాంతి నొందుట కర్జంబనెను. తన కష్టసుఖములను, ప్రజాక్షేమమును విశద పరచెను. ఈ తన సంభాషణతో తమ్ములు సయితము మెత్తబడునట్లు చేయగల్గెను. తన మనోవేదన వెల్లడించెను. సమస్తము కృష్ణునకు నివేదించి తుదకు:

ఇన్ని సంకటముల నిబ్భంగి నెంతయు
నొగులు చిత్తవృత్తి నొవ్వ దీర్ప
వె నొజ్జ వీవు గావె వేయేల యేగతి
నడప దలచి తదియ నాకు ప్రియము॥

అని భారమంతయు కృష్ణుని భుజాస్కంధములపై బెట్టెను. ఈ సందర్భమున సకల ధర్మవేత్త ఎట్లు పలుకవలయునో యట్లు పలికెను. ఈ పలుకులతో హేతువాదము, ధర్మవిచక్షణతో భీముడు సహితము సంధి కియ్యకొనెను. కాని శ్రీకృష్ణుడు తుదివరకు విని తన యభిప్రాయము తేటతెల్లముగ జెప్పివేసెను. నాలుగక్షతలు వెదజల్లెను. సంధి కాదనెను. "అక్లేశవృత్తి రాజ్యము చవిగొన్నవారేల యిత్తురు నీకు వాల్లు చెప్పుము" అని ప్రశ్నించెను.

మఱియు " అర్థి వర్గజయమున గలుగు నిహ పరములు జిర కీర్తియును పాండురాజ తనయ " అని సూచించెను. తక్కిన సోదరుల చిత్తవృత్తు లెఱుంగగోరి వారి యాత్మగౌరవమును, పౌరుషమును రేకెత్తించుటకై కౌరవులు చేసిన దుండగములు, దుర్నయము లాద్యంతము నేకరువుబెట్టెను. కాని యన్నగారి యుల్లమునకు బాధ కలిగించుటకు తమ్ము లిష్టపడలేదు. అందుచేతనే భీముడు :

కం॥ సమరంబు గలుగ ననచుచు
మము వెఱపింపగవలదు మాధవ నీ వా
కుమతియగు ధార్తరాష్ట్రుడు
శమించు కార్యంబు నడపు సౌజన్యనిధీ॥

అనునట్లు ధర్మజుడు చేయగ్గలెను.

ఈ సందర్భమున ద్రౌపదీ సహదేవుల ఉద్రేకపూరిత వాక్యముల నెట్లు తిక్కన చిత్రించెనో చూడ నచ్చెరువు గోల్పుచుండును. ఆ వాక్యములు రాజనీతిచతురతకు సంబంధించినవు కావు గావున వాని నిచట విడువదగును.

ఇక కృష్ణుని హస్తినాపురములోని చర్య గమనింతము. ధర్మజుడు ముందుగానే కృష్ణునితో నన్నిసంగతులు చెప్పి వెళ్ళమని కోరి తిరిగి యాలోచించి శంకించి ధార్తరాష్ట్రులు కృష్ణున కపాయము చేతురేమో యని భీతినొంది కృష్ణునితో మరల :

గీ॥ కుటిలమతు లవినీతులు క్రూరకర్ము
లట్టి నీచులకడకు నిన్ననుపజాల
నీవు సంకటపడియెడు దేవపదవి
యైన నే నొల్ల నొంటి యందరుగు టుడుగు॥

అని చెప్పెను. అయ్యది మనస్సులో నుంచుకొనియే గాబోలు కృష్ణుడును సాత్యకి మున్నగు దమవారిం దోడ్కొని చక్రాద్యాయుధ సంపన్నుడై తగు జాగరూకతతోడనే కరిపురి కేగెను. అచ్చట ముందు పెద్దరాజుం జూచెను. తదుపరి విదురు నింటికేగి సమస్తవిషయ

ములు, సమాచారములు గ్రహించెను. పిమ్మట కుంతికడ కేగి, యామె చిత్తవృత్తి తెలుసుకొనెను. అవ్వల దుర్యోధనుని మందిరమున కరిగి, కుశలప్రశ్నలతో ముగించి, విదురు నింట విందున కేగెను. ఈసందర్భమున సుయోధనుడు వంటకము చేయించితి ననియును, తనయింట భుజింపు మనియును, కోరగా నందులకు కృష్ణు డియ్యకొనకుండుటచే సుయోధనుడు కారణమడుగగా కృష్ణుడు తాను పగవాడననియు పగతురయింటిలో కుడుచుట కూడదనియు కట్టెవిరచి పొయిలో పెట్టినట్లు మాట్లాడెను. ఇట్టులలౌక్యముగా మాట్లాడుట చూడ రాజకీయ చతురత కాదేమోనని తోచుచున్నది. రాయబారమునకు ముందుగానే నీవు దురాగతుడవు, పగతుడవు, నీయింట కుడవనని నిర్మొగమాటముగ చెప్పుట కృష్ణునివంటి రాజకీయతంత్రజ్ఞునకు తగినటువంటిదా ? అను సందియమునకు తావొసగుచున్నది. తిక్కన కవియేగాక మంత్రియు రాజ్యతంత్రిజ్ఞుడుకూడ నైయున్నాడుకదా! అట్లు చిత్రించుట కేమైన మంచికారణ మున్నదేమో ఊహాతీతము.

తాను వచ్చినపని సాఫల్యము నందకుండినందున గ్రిమ్మర వెళ్ల బోవుచు తనను పంప వచ్చినవారి నందరిని పంపి కర్ణు నొక్కనిని పిలచి రహస్యముగా మాట్లాడిన సందర్భములో కృష్ణుడు కొంత చాతుర్యము చూపెను. కర్ణుని జన్మరహస్యము తెలుపుటచే సామోపాయంబును, యతనినే రాజుగా చేసెద ననుటచే దానోపాయంబును, తదుపరి పాండవులు తప్పక గెలుతురని బెదరించుటచే భేదోపాయంబును వెల్లడించినాడు. ఇట్టి చతురత వెల్లడించుట కర్ణుని సమాధానము మున్నగు పట్టులందు నత్యంత కవితా చమత్కృతి సయితము చూపినాడు తిక్కన.

ఇంతపరకు యుద్ధనీతి మాత్రమే చెప్పబడినది. అట్టినీతియేగాక రాజులు తమ పరిపాలనా విధానమునందును, ప్రజారక్షణమునందును, పరిపాలనాసౌష్టవము కొఱకును అవలంబింపవలసిన పద్ధతు లెన్నిటో కలవు. ఆ నీతులను సందర్భానుసారముగ భారతమునం దచ్చటచ్చట

తెలుపబడియున్నవి. సమగ్రముగా శాంతిపర్వమున సమస్త ధర్మములు విరివిగా వెదజల్లబడియున్నవి. వానినే భీష్మ ధర్మములని చెప్పుదురు. పాండవ విజయానంతరము ధర్మజుడు రాజ్యభారమును వహించి శక్తివంతముగాను ధర్మముగాను దేశమును పరిపాలించుటకు కావలసిన ధర్మములనెల్ల శరతల్పగతుడైన భీష్మాచార్యునిచే ధర్మజునకు బోధింపబడినవి. ఈ ధర్మములను చిన్న చిన్న కథల రూపముతో వినువారి చెవుల కింపగునట్లు మనోహరముగా రాజనీతి, సంఘనీతి, తత్త్వశాస్త్రము మున్నగు ననేక విషయములు చక్కగా తెలుపబడినవి. ప్రస్తుతకాలమున మన దేశమున నవ్య సాహిత్య పద్ధతులతో చిన్న చిన్న కథల మూలమున విషయ ప్రచారము చేయుట కుత్సాహము చూపుచున్నారు. కాని యీ పద్ధతి తిక్కనచేతనే ప్రారంభింపబడినది. అందు గద్య పద్య రూపముగా నుపాఖ్యానములను పేరుతో వ్రాయబడినవి. వానిని యిప్పటి ఖండకావ్యములతో పోల్చవచ్చును. మన భారతము వేల తరబడి ఖండకావ్యముల సంపుటమని చెప్పనొప్పు. ఇక ప్రస్తుతాంశమునకు వత్తము.

భీష్మ పర్వానువాదము చేయునపుడు సర్వోపనిషదర్థ విజ్ఞానమును బోధించు భగవద్గీతల భాగమును ననువాదనచేయక తిక్కన విడచిపెట్టినాడు, కాని భగవద్గీత యందలి సమస్త విషయములు శాంతిపర్వమునం దచ్చటచ్చట తెలిపెను. అట్లు తిక్కన గీతాభాగమును భీష్మపర్వమునందు విడచుటయే కవి చాతుర్యము. దానిని విడువక యేడునూర్ల శ్లోకములను తెనిగించిన వినువారికి విసుగు పుట్టును. దురవగాహమైన తత్త్వశాస్త్ర చర్చ యుద్ధరంగమున బోధించుటవలన గ్రంథము రసాభాసమై రోతపుట్టించును, కావ్య రమణీయత చెడును. అందుచేతనే తిక్కన గీతా భాగమును విడచి కావ్యమునకు సొంపు నింపినాడు. అవసరము గలిగిన పట్టున శాంతి పర్వములో చెప్పియున్నాడు. తిక్కన అద్వైతి. తత్త్వశాస్త్రమును అద్వైతపరముగానే యనువదించియున్నాడు. భారత గ్రంథారంభముననే కృష్ణద్వైపాయనుని చెప్పుచు
“ధర్మాద్వైత స్థితిభారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్”

అని వ్యాఖ్యానించెను. ఆ ధోరణిలోనే శాంతి పర్వమునగల భాగము ననువదించెను. పైన దెల్పినట్లు తిక్కన, కర్మ, జ్ఞాన, భక్తులకు సమానత్వము ప్రతిపాదించినాడు. అందుచేత ముక్తపురుషుని సైతము వర్ణాశ్రమధర్మములు విడువబనిలేదని పలుచోట్ల నుడివియున్నాడు. తిక్కన రచన యే విషయమును చెప్పినను, నిగూఢార్థమునైనను తేలికమాటలతో చెప్పును. అయినను ప్రతి ఆశ్వాసాంత పద్యమునందు నాశ్చర్యకర నిగమాంత విషయమును దెలుపుచు సంస్కృత భాషా భూయిష్ఠమైన పద్యములను వ్రాసెను. మచ్చునకొకటి రెండు పద్యములం జూపెద :

కం॥ భవదుఃఖభర నిరాస
ప్రవీణ నానాభిధాన పారాశర్య
స్తవనీయ గుణనిధాన స
మవ బోధనిరంతరా విదాత్మక్షీనా ॥

మ ॥ పరమాయః పరమార్థసిద్ధి పరమ ప్రావీణ్య సంపాదనా
దర సంభావిత భక్తలోక నిగమాంతస్ఫీతహార్మ్యాగ్రి సం
చరణ ప్రౌఢమయూరచిత్ర మహిమా సర్వాత్మ విజ్ఞాన సం
పరిపాక ప్రకటాకృతీ శమదమోద్భావాహిత స్వీకృతీ॥

---

# కవిత్రయ కవితా ప్రభావము

ఇంతవరకు కవిత్రయ కవితా విలక్షణములం గూర్చియు, అనువాద సరణిం గూర్చియు, శైలిం గూర్చియు నించుక దెలిపికొంటిని. ఈ ముప్వురిలో నొక్కొక్క రొక్కొక సంస్థయని మున్నే చెప్పియున్నాను. పూర్వము వ్యాస పీఠమువంటివే యీ పీఠములు. సంస్థయనగా పీఠమని చెప్పికొనవచ్చును. అష్టాదశ పురాణములన్నియు వ్యాస ప్రోక్తములని చెప్పబడినను ఆయూహ సత్యము కానేరదు. వ్యాసపీఠము నాశ్రయించి, వ్యాసునకు శిష్యులుగానో. అనుయాయులుగానో యుండి కవితా కళాభిజ్ఞులైన యితరకవులు, తక్కిన పురాణముల రచించినట్లు తలంపబడుటకు మంచి యవకాశములు గూడ గలవు. బాదరాయణుని విద్యాపీఠమునకు చెందినవారు వ్యాసునివలె జగద్ధిత తత్పరులై కొందఱు, వ్యాసరచిత కావ్యములు తదుక్త ధర్మములు ప్రచారణ చేసిరి. కొందరు వివిధ పురాణ రచయితలై లోకోపకార మొనర్చిరి. అట్లే నన్నయ పీఠము ననుసరించి యాతని కవితారీతుల ననుసరించి తమ కవిత్వము నడిపిన వారు కొందఱును, తిక్కన పీఠానుకరణ మొనర్చి తమ తమ కవితాశైలి నలవఱచుకొనుటలో నతని పోకడల చూపినవారు కొందఱును గలరు. కాలానుసారముగా భావములు మారుచుండును. అభిరుచులు మారుచుండును. ఆశయములు మారుచుండును. ఈ విధపరివర్తనము ప్రపంచమున ప్రతి దేశమునందు రాజకీయ, సాంఘిక. భాషా విషయముల జరుగుచునే యుండును. వాల్మీకి, వ్యాసాదుల శైలికిని ఆశయములకును తదనంతర సంస్కృతకవుల శైలికిని, భావములకును, ఆశయములకును క్రమేణా మార్పు చూపట్టినట్లే, యాంధ్రకవుల కవితా లక్షణములుగూడ మార్పు చెందినవి. అయినను సుమారు పాతిక సంవత్సరముల క్రిందటి వఱకు తెలుగు కవులందరు శైలిభేద మెట్లున్నను మొత్తముమీద

భారత రామాయణ, భాగవత గాథలనే - తమ కావ్యముల కితివృత్తములుగా గ్రహించియున్నారు. వర్ణనలు, అలంకారములు, ధ్వనులు, శ్లేషలు మున్నగు ననేక మెఱుగులతో తమ కవిత్వమును భాసింపచేసి కొన్నారు. అంతేగాని యితివృత్తములు పూర్వగాథాధారములే. మన తెలుగు కవులందఱు నట్టికావ్యములే రచించియున్నారు. మఱియు నట్టి కావ్యములు రచించుటే యొకవిశేషముగా దలంచినారు. అందు చేతనే రామరాయ భూషణుడు తన వసుచరిత్రమున :

ఉ॥ కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్య సత్కథల్
వావిరిబుట్టురత్నములవారితె సత్కవి వర్ణనా విభూ
షావహ పూర్వ సత్కథలు సానలుదీఱిన జాతిరత్నముల్
కావున నట్టి మిశ్ర కథ గా రచియింపుము నేర్పు పెంపునన్ ॥

అని మిశ్రకావ్య ప్రాశస్త్యము ప్రతిపాదించియున్నాడు. కల్పనా శక్తి యధికముగా గల్గిన పింగళి సూరనార్యుడు సయితము కళా పూర్ణోదయమునదక్క తన ప్రభావతీ ప్రద్యుమ్నమునం దేమి, రాఘవ పాండవీయమునం దేమి, పురాణగాథలనే యితివృత్తములుగా గ్రహించి మిశ్రమకథలుగా జేసినాడు. శ్రీ మహా భారతము నూతనచరిత్రయై, కురువంశగాథయై, పాండవ యుద్ధ వర్ణనాకవిత గ్రంథమైనను, అందు దెలుపబడిన యుపాఖ్యానము లన్నియును తత్పూర్వ రాజుల చరిత్రలతో నిండియున్నవి. కావుననే భారత తేతిహాసమను పేరువచ్చినది. మనకు చరిత్ర లేదని నవీను లందురుగాని భారతాది గ్రంథాలు చరిత్రలు కావా? తారీఖులు, తిథి, వార, నక్షత్ర నిరూపణ లేదుగాని, చరిత్రాంశములు, వానివలన మనము తెలుసుకొనవలసిన నీతులు, ధర్మములు పెక్కులు గలవు. మన పూర్వ కవుల యాశయములు, నీతులు, ధర్మములు బోధించి కావ్యమును విశ్వశ్రేయముగా నొనర్చుటేగాని తారీఖుల వారిగా నే దినమున నేమిజరిగినదో నిర్ధరించుట గాదు. పాశ్చాత్య చరిత్రవిధాన దృష్టితో పరికించు మనకు మాత్రము పౌరాణిక గాథలు చరిత్రలుగా గోచరించవు. ఈ విచారణ నింతటితో ముగించి ప్రస్తుతాంశమునకు వత్తము.

కవిత్రయము సంస్థా త్రయమని చెప్పినాను. వారి వారి కవితా ప్రభావము తెలుగు వారి కవులపై నెట్లుండెనని విచారించుటే యిప్పటి నా యుద్యోగము. ఆంధ్ర భాషా సౌధమున నేటికిని యీ ముప్వురు కవులు మహోన్నత శృంగములవలె ప్రకాశించుచు మెఱుగులు తగ్గక జగ్గు నిగ్గులు వెలుగ నవీన విమర్శనా ఘంటెలకు నెడమీక, మహో జ్వాల దీప్తులతో, సజీవకళలతో నుల్లసిల్లుచున్నారు. విమర్శించినకొలది జిగివి హెచ్చుచున్నది. వారి కవితా విలాసము అందు నన్నయ కవితా శైలి నతనికి పిమ్మట వారందఱు కొంచెముగానో గొప్పగానో అనుస రింపక పోలేదు. తిక్కన సోమయాజి సయితము కొంతవరకైనను నన్నయ శైలి ననుసరింపక పోలేదు. అందుచేతనే తెలుగుదేశమున నన్నయ తిక్కనాదుల గాథయొకటి యిప్పటికిని ప్రచారములో నున్నది. నన్నయ వ్రాసిన రెండున్నర పర్వములుపోగా పరిశిష్ట భాగమును పూర్తి చేయుటకుతగిన కవులకొఱకన్వేషింపుచు రాజరాజనరేంద్రుడు యితర రాజాస్థానములనున్న కవులకు నన్నయ కవితా శైలినిజూపు పద్యముల మచ్చునకు పంపెనని యు, పలువురు కవులు తమకు తోచినట్లు తమ కవితా శైలినిచూపు పద్యముల వ్రాసి పంపినారనియు, తిక్కన మాత్రము వేరుపద్యమును వ్రాయక నన్నయ పద్యము వ్రాయబడిన తాటి యాకుపై ఆకుపసరు, బొగ్గు కలిపి పద్యాక్షరములు విస్పష్టముగా కను పట్టునట్టుగా మెఱుగుపెట్టి పంపెననియు ప్రతీతి. ఆ కథయొక్క నిజా నిజము లెట్లున్నను, దీనివలన యొక్క సంగతి మాత్ర మూహింపవచ్చును. నన్నయ కవిత్వమునకు కొంత కొంత మెఱుగుపెట్టి కవితా రచనచేయు బుద్ధి తిక్కన సోమయాజికి కలదని తలంచవచ్చును. ఆ ప్రయత్నము తిక్కన తాను దలంచిన దానికంటె యధికముగానే సాధించియున్నాడు. తిక్కన నూతన సృష్టి నిరుపమానశక్తితో చేసి నట్లు తక్కిన కవుల యభిప్రాయము. ఈ కారణముచేతనే ఎఱ్ఱన మహా కవి తిక్కన నభినుతించుచు :

"తన కావించిన సృష్టిదక్కొరులచేతం గాదు నా"

"వాణినత్తన తానొకరుండు నా"

మున్నగు విశేషణముల జేర్చియున్నాడు. నన్నయను గూర్చి "నన్నయభట్ట కుంజరం బెన్న", "నిరంకుశోక్తి గతి" యను విశేషణము మాత్రమే చేర్చెను. ఇదియును సకలార్థ స్ఫురితము చేయ వచ్చును.

నన్నయ రచించిన "మదమాతంగ తురంగ కాంచనల సన్మాణిక్య" అను పద్యము రాణ్మహేంద్రుడు కవులకు పంపెననియును, దానికే మెరుగుపెట్టి తిక్కన తిరిగి పంపెననియు నొక ప్రచారము కలదు. ఆ పద్యము మంచి శబ్దములతో ధారాప్రవాహము జూపుచున్నను, నన్నయ కవిత్వ ప్రాశస్త్యముయందంతగా లేదు. ఈ పద్యము తిక్కన మెచ్చుకొని అట్టి పద్యము నే మెఱుగు పెట్టెదనని సూచింపగల రమణీయతగాని భావశబలతగాని కానుపింపదు. దీర్ఘ సాంస్కృతిక సమాసంబులతో నిండియున్నది. అది తిక్కనకు మెచ్చుగొల్పునది కాదు. అయినను తిక్కన వ్రాసిన భారతమున నన్నయ కవిత్వమును బోలిన పోకడ లనేకములు పలుచోట్ల గలవనుటకు సందియము లేదు. తిక్కన విరాట పర్వారంభమున నన్నయనుగూర్చి "అందాదితొడంగి మూడుకృతు లాంధ్ర కవిత్వ విశారదుండు, విద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్" అని చెప్పుటచే నతని కవిత్వమందు తిక్కనకు మిక్కిలి గౌరవ ముండినట్లు తోచుచున్నది. ఇక తక్కిన కవులంగూర్చి చెప్పనేల.

నన్నయ ధార యుభయ వాక్ప్రౌఢితో నిస్తులముగా నుండుననియును, రమణీయముగా నుండుననియును నన్నయనుగూర్చి చెప్పునప్పుడే వ్రాసియుంటిని. నన్నయ పోకడలు శంభుదాసుని భారత రచనానువాదమున సమాచీనముగ కనుపడుచున్నయవి. పోతరాజుగారు రచించిన భాగవత పురాణమున నన్నయధార ననుగమించి నట్లున్నది. కొన్ని కొన్ని చోట్ల నన్నయ పద్యముల ఫక్కిని వ్రాసినవి గలవు. నన్నయ భారతమును పారిజాత మహీరుహముతో బోల్చగా పోతరాజుగారు తన భాగవతమును కల్పవృక్షమని వర్ణించినాడు. వీ రిరు

వురి పద్యములు పఠితలకు మచ్చుచూపుటకై యీ క్రింద నుటంకించు చున్నాను :

నన్నయ పద్యము,

మ|| అమితాఖ్యానక శాఖలంబొలిచి, వేదార్థామల చ్ఛాయమై
సుమహా వర్గచతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానా గుణ కీర్తనార్థ ఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరన్ ధాత్రీ సుర ప్రార్థ్యమై ||

పోతన పద్యము,

మ|| లలిత స్కంధము కృష్ణ మూలము శుకాలాపాభిరామంబు మం
జు లతా శోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్విజ శ్రేయమై ||

నన్నయ పద్యము ప్రౌఢముగా నున్నచో పోతన పద్య మత్యంత లాలిత్యముతో గూడియున్నది. నన్నయ ఆది పర్వ తృతీయాశ్వాసమున ఉపరిచరవసు వృత్తాంత సందర్భమున "గిరిక" ను వర్ణించు పట్టున "పలుకులు ముద్దును కలికి క్రాల్గన్నుల తెలివున" అను పద్యమును బోలిన పద్యమును పోతనామాత్యు డష్టమస్కంధమున మోహినీ దేవి నభివర్ణించు నవసరమున :

" మెత్తని యడుగులు మెఱుగారు జానువు
లరటికంబములదొడ్డైన తొడలు
.... — .... ...
తెలిగన్నుగవయును, నలికుంతలంబులు
బాలేందు సన్నిభ ఫాలతలము.

ఇట్లే శైలిలో మార్దవము పోతన రచనలో నున్నను, ధారలో నన్నయ ననుకరించెనని చెప్పనొప్పును. ఈ విషయ మధికముగా పోతనామాత్యునిగూర్చి వ్రాయునపుడు తెలుపబడును.

నన్నయ కవితా శైలిని, ఉభయభాషా శబ్ద మాధురిని మెచ్చని తెలుగు కవి యొక్కడును లేడు. అయినను కాలానుసార

ముగా భాషలో వచ్చిన మార్పుల ననుసరించియు, అభిరుచుల ననుస రించి కవితాశైలి, భావ పరివర్తన, వర్ణనారీతులును మారిపోయెను. గాని ప్రాతిపదిక మాత్రము నన్నయగారిదే యనుటకు సందేహము లేదు. అందుచేతనే కాబోలు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు సుకవి ప్రార్థన చేయుటలో :

సీ॥ నన్నయ కవి పెట్టినాడు గదా తిక్కనాది
  కవీంద్రుల కాది భిక్ష
భిక్ష లోపల భిక్ష పెట్టె శ్రీనాథాది, కవుల
  కెల్లరకు తిక్కన మనీషి
శ్రీనాథ కవిరాజశేఖరుం డల
  పెద్దన కవిత్వమునకు ప్రాణమ్ము బోసె
తరువాత కవుల కందరకు మార్గము జూపె
  తాతగారైన పెద్దన్నగారు

....  ....  ....  ....

అని చక్కగా నభివర్ణించినారు. దీనిబట్టి యేమి, తదనంతర కవులు జూపిన గౌరవమునుబట్టి యేమి కవులందఱు నన్నయ కవిత యన్న మిక్కిలి మన్ననగల్గి యతని ననుసరించుటకే ప్రయత్నములు చేయుచుండిరి. కాని ఆయన సమకాలికులలో లేక పిమ్మట కొంతకాల మునకు జీవించియున్నవారో అయిన పావులూరి మల్లన, పాల్కురికి సోమనాథుడు, రంగనాథుడు మున్నగు కొందరు మాత్ర మతని మార్గ మవలంబించినవారు కారు. శైవమతప్రచారము చేయుటకై గ్రంథముల రచించిన మల్లనాదులు తమ కవిత్వము నత్యంత సులభ మైన తెలుగు పదజాలముతో నింపివైచిరి. ప్రాయికముగా ద్విపద కావ్యములుగా జేసి సామాన్య ప్రజా హృదయాకర్షకముగా పాటల వలె గూడ చదువ దగినట్లుగా రచించిరి. నన్నయ కవిత్వ సరణి గాకున్నను, సంస్కృత పద భూయిష్టమై, ప్రబంధఫక్కిని వ్రాయబడిన నన్నెచోడుని "కుమార సంభవము" ఆ కాలముననే వ్రాయబడినది. ఆయనమీద నన్నయ కవిత్వ ప్రభావ మున్నట్లు తోచదు. ఆ కవి నన్నయకు పూర్వుడని కొందఱి వాదము. మొత్తముమీద తిక్కన

కవితారంగమున ప్రవేశించువరకు నన్నయ ననుకరించినవా రున్నట్లు కనుపడుట లేదు. తిక్కనకు ముందున్న మంత్రి భాస్కరుని రామాయణ కవిత్వసరణి మిక్కిలి జటిలమై, సమాస భూయిష్ఠమై, రసవంతమై, చాలభాగము పురాణఫక్కి గాక యది యొక ప్రబంధ పాకఘటితమా యనుపించుచుండును. నన్నయ కవిత్వ శైలికిని, భాస్కరుని శైలికిని చెప్పదగిన సామ్యము కానరాదు. సామాన్యముగా తరువాత కీర్తిగాంచిన కవులు పలువురు తమ తమకావ్యములకు నితివృత్తము గ్రహించుటకు పైనదెల్పినట్లు భారతేతిహాసమునుండియే గైకొనుట చేత నాంధ్రీకృత భారతమును చదువకుండుట సంభవింపదు. కావున కొద్దిగానో, గొప్పగానో భారత రచనావిశేషమును గ్రహించి యను కరించుట వింత గాదు.

ఎఱ్ఱనామాత్యుడు తన కవిత్వమును పురాణ ఫక్కిని రచించి నను లక్ష్మీనృసింహ పురాణమున ప్రబంధ పోకడ జూపినాడు. అందు చేతనే కాబోలు అతనికి ప్రబంధపరమేశ్వరుడను బిరుదము వచ్చుట. కవిత్రయమువారి తరువాత ప్రసిద్ధులై యనర్గళ పాండితీ విలాసము నెఱపిన వారు: భాస్కరుడు, నాచన సోముడు. భాస్కరుడు రామాయణమును, సోమనాథుడు ఉత్తర హరివంశమును రచించిరి. భాస్కరుడు పురాణరీతినే యవలంబించినను ప్రబంధమునంగల చక్కని వర్ణనలు, శబ్దాలంకారములు వాడియున్నాడు. బమ్మెర పోతనామాత్యుని సమాసాంత యమకములకీ భాస్కరరామాయణము సోమనాథుని హరివంశము మార్గదర్శకములై యుండవచ్చును. భాస్కర రామాయణ బాలకాండమున తాటకను వర్ణించు పట్టునగల :

ఉ॥ పాటిత దుష్ట సత్త్వ వనవాటిక, నిర్ధబలావరుద్ధ శృం
గాటక, గ్రంధిల భ్రుకుటి గాఢ లలాటక గ్రూర తారకా
నాటక, సాంద్ర కాంచి పరిణద్ధశవప్రపత త్క్రిమిచ్ఛటా
కీటక, రక్తసిక్తపటు ఖేటక, తాటక గాంచి రయ్యెడన్॥

అను పద్యమును బోల్చి చూచినచో, భాగవతమున నవమ స్కంధమునం గల ;

మ॥ సవరక్షార్థము తండ్రి బంప జని విశ్వామిత్రుడుం దోడ రా
నవలీలం దునుమాడె రాము డదయుండై బాలుడై కుంతలచ్ఛవి
సంపజ్జిత హాటకన్ కపట భాషావిస్ఫుర న్నాటకన్
జవభిన్నార్యమఘోటకన్ కరవిరాజత్ఖేటకన్ తాటకన్॥

అను పద్య మా మొదటి పద్యమును చదివి యా మాదిరిగా వ్రాయదలంచి వ్రాసినట్లు దోచక మానదు. మఱియును భాస్క రారణ్యా కాండమునం గల :

ఉ॥ పుణ్యచరిత్రు డత్రి మునిపుంగవు వీడ్కొని రాము డంచితా
గణ్యగుణాభిరాము డుపకంఠమునం జని కాంచె దండ కా
రణ్యము సిద్ధసంయమి విరాజితచారుతపోనుజాత స
త్పుణ్యము నిర్మలాంబువర పుష్కర పూర్ణ సరోవరేణ్యమున్॥

భాగవత నవమ స్కంధమునందు :

ఉ॥ పుణ్యుడు రామచంద్రు డట బోయి ముదమ్మున గాంచె దండకా
రణ్యము తాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హి బర్హ లా
వణ్యము గౌతమీ విమలవాఃకణ పర్యటనత్ప్రభూత సా
ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజ వరేణ్యము నగ్రగణ్యమున్॥

ఈ పద్యము నొకేభంగి రచింపబడినట్లు స్పష్టముగదా ?

పురాణ కవిత్వమున సందర్భశుద్ధియు, యౌచిత్యము గలిగి, కథా విస్తరణము మృదుపద సంఘటనము భాసింప వస్తు విషయ ప్రధానమై సందర్భోచితాలంకార వర్ణనలు గలిగియుండును. అర్థగౌర వమునకు భంగము వాటిల్లదు, పురాణ కవిత కొంత మార్పుతో విపుల కావ్యకవిత్వముగా పరిణమించినది. ఇట్టి కవిత్వము భాస్కరు నితో ప్రారంభ మయ్యెనని చెప్పనొప్పును. ఈతనితో పుట్టిన యీ మాదిరికవిత్వము నాచెన సోమనాథుడు, పోతరాజు, మడికి సింగన, శ్రీనాథాదులచే పెంపు చేయబడినది.

# నాచన సోమనాథుడు

ఈ విపుల కావ్య కవిత్వమందే ప్రబంధ కవిత్వమునకు బీజాంకురములు గలవు. ప్రబంధ కవిత్వమందువలె విషయమును విస్మరింపక, కేవల వర్ణనలకే ప్రాధాన్య మివ్వక, శ్లేషాద్యలంకారముల మీదను, ధ్వనులమీదను నధికదృష్టి నిడక, యమకసమాసముల మీదనే గౌరవము చూపక, రసము చెఱుపక, క్లిష్టార్థములకు తావొసంగక విపుల కావ్యకవిత్వము మిక్కిలి రసవంతమై విషయ ప్రాధాన్యతతోబాటు భాషాశోభ గలిగి, శ్రోత్రపేయమై, కడుంగడు హృద్యమైయుండును. నన్నయ, తిక్కన, యెఱ్ఱన, మారన, కేతనాదులు పౌరాణిక శైలితో రచించిరి. అయ్యాది కొంతమార్చి పైన దెల్పినట్లు భాస్కరాదులు విపుల కావ్యకవిత్వమునకు దొడంగిరి. అందుచేత పురాణకవితా వాసన వీరికి పోలేదు. కాని సంస్కారవాంఛ పొడమెను. అది నూతన దశలోనే యుండెను. కావుననే పురాణ ప్రబంధ ధోరణులు రెండును, భాస్కర, సోమన, పోతన, సింగన, శ్రీనాథ, జక్కనాదుల కావ్యకవితలలో విపులముగా దోచుచుండును. భాస్కరుడు సూర్యాస్తమయ సందర్భమును వర్ణించుతఱి:

చం॥ ఉరుతర కుంకుమారుణ పయోధరయై భువిసక్త భానురాం
బరయయి పాశహస్తుదెస భానుడు జేర గృశానురాగ సుం
దరియగు తూర్పుదాల్చె నుచితస్థితి లేనిదబోలె నన్యలన్
మరగిన కాంత కాంతులకు మానుగ పశ్చిమగన్యయేగదా?॥

యనియును దశరథుని వర్ణించుచో:

మ॥ జనలోకైక మహారథుండు ద్విజరక్షాదక్షు డాజిన్ త్రిలో
చను డుద్యత్ చతురంగసైన్యుడును, భాస్వద్రూప పంచాస్త్రు డ
న్య నృపకారించపడానసుండు ఘనసప్తాశ్వాన్వయుం డష్టమం
త్రి నవద్రవ్య నిధీశు డా దశరథక్ష్మాధీశ్వరుం డొప్పెడున్ ॥

అనియును చతుర రచనము గావించి పైనదెల్పినట్లు ప్రబంధ శై[illegible]ంబరములు నాటెను. ఘటియు దీర్ఘసమాసములు, యమకాది

శబ్దాలంకారములు కావ్యమున విరివిగా వెదజల్లినాడు. ఈతని పిమ్మట నాచన సోమనాథుడు తిక్కన సోమయాజియం దత్యంత గౌరవము గల్గి సొంపైన తెలుగు నుడికారము పలుచోట్ల జూపుచు, ప్రౌఢ సంస్కృత దీర్ఘసమాస భూయిష్టముగా తన యుత్తర హరివంశమును రచించి సీసపద్యముల కీవి మెఱయించి, ధ్వనులు, శ్లేషలు, నానుడులు, జాతీయములు, సామెతలు చేర్చి, కూర్చి, కూర్పు నేర్పు వెలయించి, వర్ణనా వైదగ్ధ్యము భాసింపజేసి, యమకము, గమకము దోచునట్లు తన కవిత్వము నడపెను. ఈ మహాకవికి తిక్కనపై నెక్కువ మక్కువ గలిగియుండెననుటకు తనకావ్యమున నాశ్వాసాంత గద్యము సయిత మొక నిదర్శనముగా నున్నది. ఆశ్వాసాంత గద్యములో సామాన్యముగా కవులు తమ శక్తి, తమ వంశ ప్రసిద్ధి మున్నగు నంశములను మాత్రమే తెలిపికొందురుగాని తనకు సంబంధ బాంధవ్యములు లేక సుమారు నూరు సంవత్సరములకు పూర్వము చనిపోయిన తిక్కన సోమయాజిని తన యాశ్వాసాంత గద్యలో జేర్చుట సహజముగాదు. అంతేగాక, నన్నయ, యెఱ్ఱన, భాస్కర ప్రముఖ కవుల నెవ్వరిని చేర్చియుండలేదు. ఇందులకు కారణ మేమై యుండును? చేర్చిన వాక్యము లెట్లున్నవి? పరికింపుడు:

"శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున శ్రీ మత్సకల భాషా భూషణ సాహిత్య రస పోషణ సంవిధాన చక్రవర్తి సంపూర్ణ కీర్తి నవీన గుణసనాథ నాచన సోమనాథ ప్రణీతంబైన యుత్తర హరివంశము" అని వ్రాసికొనెను.

తిక్కన ప్రణీతంబైన మహాభారత కథానంతరంబున యనుటలో విశేషమేమైన కలదా? యోచింపవలసియున్నది.

సామాన్యముగా భారత కథానంతరమని చెప్పినచో భారతము తరువాత నుత్తర హరివంశము రచింపబడెనని కాలనిర్ణయమునకై వ్రాయబడియుండవచ్చునని యనుకొనవచ్చును. నాచన సోమ

నాథుడు, నన్నయ, తిక్కన లిరువురకు తరువాతవాఁడే. వాడినమాట లలో భారతానంతర మనక తిక్కన రచిత భారతానంతరము అనెను. అట్లుగాక కేవలము భారతమునకే ప్రాధాన్యత నొసంగె ననుకొందమా? నన్నయ భారతము వ్రాయలేదా? కవిత్రయ ప్రణీత మహాభారత కథానంతరమని చెప్పవలయుగదా? అట్లును చెప్పలేదు. పోనీ సోమన ఉత్తర హరివంశమును రచించునప్పటికి నన్నయ తిక్కన కృతములైన భారత భాగములు మాత్రమే పూర్తియై అరణ్య పర్వ భాగము పూరింపబడక నిల్చియే యుండలేదుకదా? చరిత్రమున తెలియుదానినిబట్టి, విమర్శకులు నిర్ణయించినకాలమునుబట్టి "శంభు దాసు" 1324 సం॥ ప్రాంతముల నున్నట్లు కొందఱును, 14-వ శతాబ్ది ప్రథమ భాగములో నున్నట్లు కొందఱును తెల్పినను మొత్తముమీద నతడు 14-వ శతాబ్దాంతమునను 15-వ శతాబ్దాదియందును నున్నట్లు నిర్ణయింపబడిన సోమనాథునికంటె యేబది వర్షములైనను ముందున్న వాఁడేకదా? అదియుంగాక, ప్రబంధ పరమేశ్వరేత్యాది బిరుదము లంది, రాజాస్థాన మర్యాదల సహితము నందిన యెఱ్ఱాప్రగడ భారతము పూరించెనని సోమనాథునకు తెలియకుండునా? నాచన సోమనాథుడు కొంచె మహంభావముగల్గి పూర్వకవుల నెవ్వరిని తన గ్రంథాదిని స్మరించి యుండలేదు. కేవలము సంస్కృతకవుల ధోరణితో కథా ప్రారంభమునకు గడంగెను, "హరిహరనాథునకు" మాత్ర మొక సంబోధన పద్యము తగిలించెను. మఱియు నితడు తన ఉత్తర హరివంశమున పూర్వ హరివంశ మున్నట్లయినను చెప్పలేదు. భారత గ్రంథమును ప్రస్తావించినపుడు, తన గ్రంథమున కుత్తర హరివంశమని పేరు పెట్టికొన్నప్పుడు పూర్వహరివంశ మొకటి యున్నట్లు చెప్పినగదా యుక్తము, ఉత్తర హరివంశ నామము సార్థకమగుట. నాచన సోముడు తన గద్యమందు తన తండ్రిపేరైనను చెప్పక తన శక్తిని మాత్రము జూపు పదములు మాత్రమే ప్రయోగించి స్వోత్కర్ష జూపుకొనెను. ఈ రీతి స్వభావముగల వాఁడగుటచేత పూర్వకవుల నెవ్వరిని స్మరింపకుండెనని చెప్పవచ్చును. అట్లయినచో నొక్క

తిక్కన సోమయాజిని మాత్రము స్మరింపనేల? దీనికి తగిన కారణ మూహింప దగియే యున్నది.

సోమనాథుడు తనకున్న సకల భాషా భూషణ, సాహిత్య రసపోషణాది శక్తులన్నియు తిక్కన శక్తి తరువాతనే గణింప తగిన వని సూచించుటయే. తక్కిన కవు లందఱికంటెను తా నధికుడనియు, తిక్కనకంటె కాదుసుమా యనియును తోచునట్లు జేయుటకై సకల గుణములుగల తిక్కన భారత కథానంతరమే తాను నవీన గుణ సనాథుడ నన్నట్లు వ్రాసెను. తిక్కన సోమయాజి తనకంటె నన్నివిష యముల నధికుడను భావ మీతని కున్నట్లు చూపుటకే యీ విషయ మింతగా వ్రాయవలసి వచ్చినది. కవిత్రయములో నొక్కొక్క రొక్కొక్క కవితా సంస్థయని మున్నే చెప్పితిని. ఆ మూడు సంస్థలలో తిక్కన సోమయాజి సంస్థ మిక్కిలి పెద్దదై విశాలముగా వ్యాపించి శాఖోపశాఖలతో నాంధ్రదేశ మెల్ల నెల్లవారికి రమణీయచ్ఛాయా సదనమై భాసించుచున్నది. ఈ సోమనాథునకు సర్వజ్ఞుడను బిరుద ముండెనట! నవీనకాల విమర్శకులు పెక్కండ్రు, అందు కందుకూరి వీరేశలింగంపంతులు, బహుజనపల్లి సీతారామాచార్యు లిద్దరు సోమన కత్యున్నత స్థాన మిచ్చినారు. వీరేశలింగంపంతులు యాంధ్ర కవుల చరిత్రలో సోమనను గూర్చి వ్రాయుచు భారత కవులలో ననేకుల కంటె నధికుడని నుడివెను. అనగా నన్నయ, శంభుదాసులకంటెనని భావము. పైన దెల్పిన సమగ్ర విషయ విచారణ పిమ్మట, సోమన, తిక్కన సంస్థకు చెందినవాడనియు, తిక్కన కవితా ప్రభావ మాతనిపై నెక్కువగా ప్రసరించెననియును చెప్పనొప్పును. కాని తిక్కన, సోమనల కవితా రచనలలో గమనింపదగిన భేదములుకూడ లేకపోలేదు.

స్థూలముగా జూచిన తిక్కన కవిత్వములో విషయము విస్తరించి వ్రాయబడినట్లు తోచును. నాచన సోమన కవిత్వమందు విషయము కుదించి కేవలము వాక్ప్రౌఢిమకును, పాండిత్యప్రకర్షకును, వర్ణనా ప్రాగల్భ్యమునకును ప్రాధాన్యత నొసంగినట్లు కనుపడును. సోమన

మిక్కిలి రసపుష్టికై, భావస్ఫురణకై, ప్రబంధపద సమాస గుంభనకై చాల కష్టించెనని చెప్పవచ్చును. తిక్కనకు సర్వతోముఖప్రజ్ఞ కలదు. పాత్రచిత్రణలోనేమి, సమయోచిత పద ప్రయోగములోనేమి అద్వితీయుడు. పదౌచిత్యము తిక్కనకవితలో సహజముగా నప్రయత్నముగా నుట్టిపడును. సోమనాథుని కవితలో నట్టి పదప్రయోగములు కావలెనని పట్టుబట్టి కూర్చినట్లు కన్పట్టును. తిక్కన కవితలో సమాసము లున్నను అవసర మున్నంతవరకే రసోత్పత్తికి, పూర్వాపర సందర్భములబట్టి యుచితమైనంతవరకే వానిని చేర్చిన భంగి దోచును. సోమనాథుని కావ్యము నలలితములై, మృదువులై, మధురములైన పదములకూర్పు లనేకచోట్ల గలిగియున్నను మొత్తముమీద సంస్కృత శబ్దభూయిష్ఠములతో దీర్ఘసమాస భూయిష్ఠమైయుండును. సమాసాంతయమకము ప్రాయికముగా నాద్యంతమును ప్రవహించుచునే యుండును. తిక్కన కవితాధారలోవలె యొజ్జబంతులవంటి తెలుగు నుడుల సౌకుమార్యము, సోమనాథుని కవిత్వమున దోచదు. ఎంతచూచినను సోమన ప్రబంధ ధోరణికి చొక్కును. తిక్కన పురాణగతిలో తొట్రుపాటు నొందదు. తిక్కన రసముజూపుచు విషయమును రుచింపజేయునుగాని సోమనవలె రసోత్పాదనకై విషయమును విస్మరింపడు. తిక్కన సమయోచితముగా వర్ణనల శ్లిష్టముగా, పొందికగా కూర్చును. సోమనాథుడు వర్ణనావైచిత్రికొరకు, భావకల్పనకొఱకు తక్కినవి విస్మరించును. తిక్కన కవిత్వము పండిత పామరు లందఱకు నాహ్లాదము గల్గించును. నాచన సోమనాథుని కావ్యము కేవలము పండితులకు, రసగ్రహణ పారీణులకు, కవితారస పిపాసులకే చవులు పుట్టించును. అందుచేతనే భారత కావ్యము సకల ప్రజారంజకమై విన్నకొలది యుల్లాసము గల్గించును. ఉత్తర హరివంశము భగవంతుడగు శ్రీకృష్ణుని మహత్తర కావ్యముల వర్ణన మయ్యును, వినుటకుగాని, చదువుటకుగాని యుత్సాహము జూపువారు లేరు. కావుననే యీ కావ్యము కవితా ప్రౌఢిమ దృష్ట్యా అత్యంత యుత్తమ మయ్యును గ్రంథాలయ పేటికలలో నేదో మూల తరుచుగా నస్పృహణీయమై యుండవలసిన గతి పట్టినది.

అంతమాత్రముచేత దానికి కావ్యగౌరవము పోజాలదు. పైన దెల్పినట్లు భాస్కరాదుల ప్రబంధ కవితా రీతు లీతని హరివంశమున ప్రజ్వలితములై, వికసించి విశిష్ట రూపొందినవి. చూడుడు :

సీ॥ పన్నగంబుల రాజు, పగవాడు గూడి నీ
  శయనంబు, పయనంబు సంతరింప
దుగ్ధ వారాసి కూతురు నాలుగూడి నీ
  శరణంబు, చరణంబు సవదరింప ............

సీ॥ దైతేయ మదవతీ ధమ్మిల్లములతోడ
  విరుల నెత్తావికి వీడుకోలు
దనుజ శుద్ధాంత కాంతా కటాక్షములతో
  కలికికాటుకలకు కాని వాలి............

సీ॥ నరకాసురప్రాణ నాళోత్తరణకేళి
  రణకేళి వలకేలి రమణ జూపె
కంస దానవ శిరః కమలకర్తనమేలు
  తన మేలుచేయి పెద్దలకు నొసగె............

ఇత్యాది పద్యరత్నము లాతని భావనాశక్తియును, పదప్రయోగ కౌశలమును తెలుపగలదు. కొన్ని కొన్ని పద్యముల భంగులు నన్నయ, తిక్కనాదుల కవిత్వము ననుసరించియేయున్నను, సోమనాథుడు తన పద్యరీతులను తఱువాతి ప్రసిద్ధ కవులు వఱవడిగా గ్రహించునట్లు మలచెను.

చం॥ చని చని కాంచెనంత ఋషిసంహతి సారసకేసరాంత రా
సనస రసాళిసంగ, తటచందన శాఖి చలత్తరంగ గాం
చన సరసీ జలార్ద్రియతి సంచితశైకతలింగ సంగనం
జనగిరిగాఢగంధ గజసంగత శృంగ రథాంగ సత్తరిన్ ॥

ఈ విధ పద్యముల ననుసరించి యాంధ్ర కవితా పితామహుడగు నల్లసాని పెద్దనామాత్యుడు :

చం॥ అటజనికాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరఝ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుటనటనానురూప పరిఫుల్లకలాప కలాపిజాలమున్
కటక చరత్కరేణు కరకంపిత సాలము శీత శైలమున్ ॥

అని రచించినాడు. అట్టి పద్యము లతని కవితా విలాసము చూపునవి గాకున్నను, అతని సరళి పిమ్మటి వా రనుసరించి గౌరవము చూపిరని దెల్పుటకే పై పద్యము నుదహరించినాను. సమాసముల సొంపు, అలంకారముల యింపు, భావ శబలత చూపుటలో నితనికి మిక్కిలి ప్రీతి. తిక్కన సోమయాజివలె నీతడును తెలుగు పలుకులు, సామెతలు, విచిత్ర పద ప్రయోగములును ముమ్మరముగా వాడి యున్నాడు :

గుండారపు బొమ్మ; చుక్క యెదురు; కాని వావి; నీళ్లలోని ముల్లు; కొఱకుల బట్టించె; ఒడిదప్పిన పాము నట్లు; పొత్తుల దానవు నీవు తొయ్యలీ; చిల్క బోయిసం బంజర మేమి సేయు; మిరియాలుం జొన్నల సరిపోవే.

ఇత్యాది ప్రయోగములు మిక్కిలి గలవు. వాస్తవముగా నట్టి చిత్ర చిత్ర ప్రయోగములు తిక్కన సోమయాజి కావ్యమునకంటె యీ కవి కావ్యమునందే యెక్కువ గలవని చెప్ప వచ్చును. తిక్కన సోమయాజి కథ చెప్పు సందర్భమున నవశముగా తమంతట తామే దొర్లిపడినట్లు వచ్చిన చిత్రమైన తెలుగు సూక్తు లుండును. కాని యొకా నొక చిత్రపదముగాని సామెతగాని ప్రత్యేకముగా నుపయోగించు తలంపుతో చేర్చినట్లు కాన్పించదు. కావున సోమనాథుని కావ్యమున నున్నన్ని లోకోక్తులు చిత్రపదములు భారతమున లేవు. తిక్కన కవితారచనలో ద్విరావృత, త్రిరావృ తాక్షరములు, పదము లచ్చటచ్చట యాదృచ్ఛికముగా నుండును.

" తమ వారిం జూచినం దారుసాధింపన్ జాలరో లేక పోర తగ నుద్ధింపక దలంపేని శంకిపన్ పట్టాకో. "

అను రీతి కవితా విశేష మచ్చటచ్చట కనుపడును. ఉత్తర హరివంశమునందన్నో వలుచోట్ల పట్టుదలతో నట్టి ద్విరావృతాక్షర ములతోనున్న శబ్దము లుపయోగింపబడియున్నవి. అట్టి రచన పైన

జూపిన "చని చని కాంచిరంత మునిసంహాతి" యను పద్యమున కను పడుచునేయున్నది. ఇంతేగాక సమాసాంత యమకముగల పద్యములు తిక్కన సోమయాజి భారతమున నెచ్చటనో క్వాచిత్కముగను, ఆశ్వాసాంత పద్యములలోను మాత్రమే దోచుచుండును. సోమనాథుని కావ్యమున వందలు గలవు. తిక్కన యమకమును బహువిస్తరము చేయక క్లుప్తముగనే వాడును. తిక్కన పద్యమంతా యమకము జూపిన చోటు బహు అరుదుగానుండును. చూడుడు :

చం|| పరమకృపావిధేయ, నిరుపాధిక చిన్మయ కాయ, గాఢ వి
స్తర నిగమైక వేద్య, గుణతత్త్వ వికార నిరత్యభేద్య సం
స్మరణ నిరస్తతాప, ఘనసంసృతి సంతమస ప్రదీప, ని
ష్ఠురభుజసార దానవనిషూదన భక్తజన ప్రమోదనా ||

కం|| శ్రుతిమౌళి రత్నమూర్తి
శతధృతి ముఖపద్మషండసౌరభకీర్తి
రతిపతి హితాహితాక్షా
సతత సమాచరిత భక్తజన సంరక్షా ||

సోమనాథుని యమకము తిలకింపుడు :

ఉ|| వాసుకిహారసంతత నివాసము, వాసవ వల్లభ ప్రభా
న్యాసము నాసముద్రరశనా క్షితిహాసము, నాత్మకీర్తిన్యాసు
ప్రాసము, దత్తదిక్తట నిరాసము, కంసవిరోధి గాంచె, గై
లాసము, నభ్ర విభ్రమ కిలాసము మేరుతటీవిలాసముౕ ||

ఈ కవికి పిమ్మటనే పోతరాజు తన కిట్టి రచన నచ్చినందున కాబోలు భాగవతమునందు విరివిగా యీ యమకము ననుసరించి కృతకృత్యు డయ్యెను.

ఇక తిక్కన సామాన్యముగా వర్ణనా సందర్భమునదక్క తక్కిన చోట్ల సీసపద్యములు వచనములుగానే రచించెను. నన్నయాది కవి త్రయము వారి సీసపద్యములలోనే అన్ని రకముల పద్యములు గలవు. తిక్కన రచిత సీసపద్యములలోనివి తరువాతి కవులకు మార్గదర్శకము లైనవి పెక్కుగలవు :

సీ|| కరుణారసము పొంగి తొరగెడు చాడ్పున
శశిరేఖ నమృతంబు జాలువాఱ
హరినీల పాత్రిక సురభిచందన మున్న
గతినాభి ధవళపంకజము దనర......

సీ|| ఎవ్వాని వాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజి నడగు
ఎవ్వనిగుణలత లేడువారాసుల
కడపటి కొండపై గలయ బ్రాకు......
నతడు భూరి ప్రతాప మహా ప్రదీప
దూర విఘటిత, గర్వాంధకారవైరి
వీరకోటీరమణి ఘృణి వేష్టితాంఘ్రి
తలుడు కేవల మర్త్యుడే ధర్మసుతుడు||

సీ|| నీరజాకరములు నిష్ఠమై జేసిన
భవ్యతపంబు సదఫల మనంగ......
హరి హర బ్రహ్మ మహోను భావంబు లొ
క్కటి గాగ గరగిన గుటిక యనగ
నతుల వేదత్రయ లతికా చయము పెను
పొంద బుట్టెడు మూలకంద మనగ......
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె||

ఇందలి రచనా గంభీరత, ఠీవి, భావముల యుదాత్తత, సొంపు, తక్కిన కవు లనుసరించిరి. శృంగార రసము వర్ణించుపట్ల తిక్కన ప్రబంధ పాకము కూడ సరసముగా జూపెను. కీచకుడు ద్రౌపదికై విరహావేగము భరింపజాలక యుద్యానవనమున కేగి యచ్చట :

సీ|| ఇంపైన ప్రియకావ నిచ్చి నిల్చిన
మధువాదటనామ మత్తాళి విభుని
చెట్టపట్ పచరించి చుట్టు గ్రుమ్మరి మనో
రమ నియ్యకొలుపు మరాళ విభుని
ఫలరసమొండొంటి వెలమిచుంచుల నిచ్చి
మెయినచొక్కెడు శుకమిథునములను
గమిభాసి తలిరుజొంపమునకు మెయి మెయి
దాకంగ జను పికదంపతులను

చూచి చూచి యుల్లంబున నేచి కోర్కు-
లడర, జిడిముడిపడు, భ్రాన్తుపడు, వెడంగు
పడు, వెనుంబడు, తల్లడబడు, దురంత
చింత భారికి నగపడు, సింహబలుండు ||

లలితమై, సరసమై, స్వాభావి కాలంకార శోభితమైన రచనా సౌందర్య మిది. ఏ రసమున కుచితమైన పద సమాహార మెట్లు పొసంగించవలయునో యట్లు నవరసస్ఫూర్తి గలిగించెను. పైనచూపిన సీస రచన గైకొని మెఱుగుబెట్టి, పాకముమార్చి, జగ్గు నిగ్గు గూర్చి, ప్రబంధపాకమున కనువైన, భావములు, ధ్వనులు, శ్లేషలు సంధించి, సోమనాధకవి కావ్య మల్లెను. తిక్కన కవితా ప్రభావ మీ కవి కవిత్వముమీాద చాలవరకు ప్రసరించెనని మున్నే దెలిపియుంటిని.

## కేతన

ఇక తిక్కన కవిత ననుసరించిన వారిలో కేతన యొకడు. కేతన తిక్కన సమకాలికుడే. ఇతనికి తిక్కనపై మక్కువయని లోగడ చెప్పితిని. సమకాలికుడై తిక్కన ప్రతిభ, తిక్కన జీవితము, వర్తన, కర్మ, జ్ఞాన, భక్తి, నిష్ఠ, వితరణ, రాజకీయ కార్యధురంధరత్వము మున్నగు నెల్లవిషయములు, స్వయముగా నెఱింగిన వాడగుటచేతనో, లేక తాను రచించిన దశకుమార చరిత్రము, తిక్కన కంకితమొసగి యాశ్రితుడైనందుననో యీా కేతనకవి తిక్కనకవి నధికముగా పొగడియున్నాడు. కేవల కవిగామాత్రమేగాక తక్కిన విషయములందును తిక్కన నిరుపమానుం డనునట్లు స్తోత్రము చేసెను. ఈతని కవిత్వము రస వంతమై తెలుగు నుడికారము గలిగి, సరసముగాను, ప్రౌఢముగాను విలసిల్లుచున్నది. కేతనకు అభినవదండి యను బిరుదము గలుగుట చేతను, యిప్పటి బిరుదములవలె అప్పటిబిరుదములు సులభసాధ్యములు కాక పాత్రత గల వారికే లభ్య మగుచుండుటచేతను ఈ కవి తనను గూర్చి చెప్పుకొనుచు తిక్కన మెచ్చునట్లు కవిత్వము చెప్పినవాడనని

గర్వముతో చెప్పుకొనెను. ఇతడు ప్రసిద్ధ పండిత కవి యనుట నిక్కము. ఈ కవి కవితపై తిక్కన ప్రభావ ముట్టిపడినట్లుండును. సోమనాథునివలె దీర్ఘ సంస్కృత సమాసములకై పరితపింపడు. యమకముపై నతనిదృష్టి యంతగా బోదు. ప్రబంధపాకము గాదు. కథా రచన రమ్యమై యుండును.

## మారన

మారన కవి సోమనాథునకు పూర్వుడని తోచుచున్నది. ఈ కవి చక్కని తెలుగు నుడులతో, లలితమై, మనోహరమైన శైలితో మార్కండేయ పురాణము రచించెను. తిక్కన కావ్యముల కనుబడు రసముగాని ప్రౌఢిమగాని యితనికావ్యమున లేకున్నను రమణీయ సులభ కవితాధార గలదు. పురాణశైలి నవలంబించి నన్నయవలె ధారాళ, సరళ, గీర్వాణపదములు నాతిదీర్ఘసమాసములుగూర్చి మధురముగా నితడు పురాణ మనువదించి యున్నాడు. ఇత డితర కవులకు మార్గదర్శియని చెప్పుటకు వీలు లేదు. ఇతని మార్కండేయ పురాణమునందలి వరూథినీ గాథను గ్రహించి, పెంచి, సొంపు నింపుల గూర్చి ప్రబంధ రాజముగాజేసి మనుచరిత్రమను పేర అల్లసాని పెద్దన ప్రబంధ ప్రతిభ వికాసంపజేసి "ఆంధ్ర కవితా పితామహ" విఖ్యాతివహించెను.

ఈ సందర్భమున మరల నింకొక విషయము తెలుపవలసి యున్నది. నన్నయ, తిక్కన కవుల కవితా ప్రభావము చాలవరకు చెప్పబడినది కాని యెఱ్ఱన కవితా ప్రభావము తరువాత కవుల మీద యేమాత్రముగలదను సంగతి నించుక వివరించెదను. ఎఱ్ఱన తాను సంస్కృతపదజాలము నన్నయభట్టు కవితనుండియు, తెలుగు నుడులసొంపు తిక్కన సోమయాజినుండియు సంగ్రహించినట్లు మున్నే తెలుపబడెను. ఎఱ్ఱన, నాచన, సోమనాథులు కొంచెము హెచ్చు తగ్గులుగా నొకే కవితా యుగమునకు చెందియుండిన వారగుటచేతను, ఉభయులును పెద్ద పండితులై విఖ్యాతకవు లగుటచేతను, హరివంశ

మను నొకే గ్రంథమును నాంధ్రీకరించిన వారగుటచేతను వీరిలో శంభుదాసుని కవిత్వమే యెక్కుడు శ్లాఘ్యమా? సోమనాథుని కవిత్వ మెక్కుడు పొగడ్తకు తగినదా? యను విచారణ పలువుర విమర్శకుల నాకర్షించినది.

కందుకూరి వీరేశలింగం పంతులుగారు సోమనాథుని కగ్రస్థాన మిచ్చిరి. శబ్దరత్నాకర నైఘంటిక కర్త బహుజనపల్లి సీతారామాచార్యులవారు సహితము నట్లే జేసిరి. కాని యిటీవల విమర్శకులు శంభుదాసునకే ప్రథమస్థాన మొసంగిరి. అందుచేత వీరిరువురును సమానస్కంధు లని నుడువదగును. వీరిలో శంభుదాసు సోమనాథుని కంటె కొంత పూర్వు డగుటచేతను పురాణశైలియం దభిమానము ఎక్కువగల వాడగుటచేతను సోమన జూపిన ప్రాబంధిక శైలిని జూప లేదు. మఱియు సోమనకవి శంభుదాసునిచే రచింపబడిన హరివంశము జూచి, దానంగల కవిత్వపు లగువులు బిగువులు విమర్శించి యాతని కావ్యమునకు మెఱుగు బెట్టినట్లు తన ప్రతిభ నెఱపుటకై ప్రయత్నించి ఉత్తర హరివంశ కావ్యమును రచించినట్లు పాఠకులకు కనుపడకపోదు. సహజభావములు చక్కగా పోషించు శక్తి శంభుదాసునకు గలదు. ఊహాతీతమైన భావ సంభార మేర్పరచుకొని, సాహిత్య ప్రతిభ చూపి అలంకార బాహుళ్యము మేళవించి విద్వజ్జనైకవేద్యము చేయు శక్తి సోమనాథునకు గలదు. శంభుదాసుని హరివంశము సామాన్యముగా భారతాది గ్రంథముల భంగి చదువు వారికి విను వారికి ఆనందము కలుగ జేయుచుండును. అందుచేతనే కాబోలు అనంతకృష్ణశర్మ గారు సోమనకంటె ఎఱ్ఱన కగ్రస్థాన మిచ్చిరి. ఎట్లున్నను ఎఱ్ఱన కవిత ననుసరించుటలో దానికి శతాధికముగా మెఱుగుపెట్టి సోమన సాహితీ లోకమున కాహ్లాదమొనర్చె ననుటలో సందియము లేదు. ఇంతటితో కవిత్రయ కవితా ప్రభావ మప్పటి కవుల కెంతవరకుండెనో దిఙ్మాత్రముగా నెఱింగింపబడెను. ఇక పిమ్మటి కవులపై యెంతగా చూపట్టు చున్నదో చూతము.

## ద్వితీయ శ్రేణి

## పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు

పైన దెల్పినట్లు సోమన, కేతన, ఎఱ్ఱన లేగాక తక్కిన పూర్వ కవులలో మరికొందరు కవులు సయితము కవిత్రయము వారి కవితారీతుల ననుసరించిన వారు కలరు. అట్టివారిలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి యొకడు. ఈ కవి జైమినీభారతము, శృంగార శాకుంతలము రచించెను. కాని జైమినీ భారతమునకే యెక్కుడు ప్రచారము గలదు. పురాణ శైలినవలంబించెను. ఈకవి కవిత ద్రాక్షాపాకమై తియ్యని నుడికారము గల్గి, పదములకూర్పు మిక్కిలి పొందికగా నుండి, సందర్భ శుద్ధి విలసిల్ల కథా రచనా పటిమ మిక్కిలి చక్కగా శోభించుచుండును. కథ చెప్పటలో, నూతన కథ నతికించుటలో వింతగొల్పు చమత్కారము జాలువారుచుండును. నన్నయవలె నీ కవియు నుచిత వీరశృంగార రస ప్రకటనలో వైదగ్ధ్యము చూపెను. అర్థపుష్టిగలిగించుటకీ కవి భారత కవిత్వముతో పోటీచేసినట్లు దోచును. అందుచేత నీతని కవిత రసోత్కటముగా నుండును. ఈ కవి పైనదెల్పిన రెండుకావ్యము లేగాక నారదీయము, అవతారదర్పణము, మాఘమహాత్మ్యము, మానసోల్లాస సారము, పురుషార్థసుధానిధి యనుగ్రంధములు రచించినట్లు చెప్పుదురు. కాని వానికి జైమినీ భారత, శృంగార శాకుంతలములకు వచ్చిన పేరు రాలేదు. మొత్తముమీాద పురాణ ఫక్కిలో రచింపబడినను పినవీరన్న శైలి ప్రబంధ పోకడలతో గూడి ఉజ్జ్వలముగా నుండును:

సీ॥ అమృతాంశు మండలం బాలవాలము గాగ
మొలచె నొక్కటి జగన్మోహనముగ
చిగిరించె, విలయ, సింధుగతక్కైతవడింభ
శయనీయ వర పలాశములతోడ
పితృదేవతల కంచిత సత్రశాలలై
చెట్టు గట్టెను గయాక్షేత్రసీమ
నిలువ నీడయ్యె నిందీవరప్రియ కళా
కోటీరునకు భోగికుంభులనకు

మట్టి మాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలె గాదు శారదా పీఠకంబు
వారిలోపల పిన వీరు వాక్యసరణి
సరసులకునెల్ల కర్ణ రసాయనంబు ॥

ఈ రచనా శోభ తిలకింపుడు. ఊహా, ఊహానుతగిన పలుకుల సొంపు, అర్థ సౌభాగ్యము, రచనా చమత్కృతి, భారత కవుల పోకడలు, తెలుగు పలుకుల సొబగు యీ పిన వీరన కవిత్వమున తొణికిసలాడుచుండును. సోమనాథుని గడుసు పోకడ లంతగా లేకున్నను కవిత్వమంతకంటె కర్ణ రసాయనముగా నుండుననుట కెట్టి సందియమును లేదు. ఇతనిని పురాణ కావ్య ప్రబంధకవు లిరు తెగల కవుల పంక్తులలో చేర్చదగినవాడు.

## శ్రీనాథుడు

పురాణ కవిత్వమునకు, ప్రబంధ కవిత్వమునకును మధ్యగల కవిత్వమును, కావ్య ప్రబంధ కవిత్వమని యొక విశిష్టమైన తరగతి గలదని చెప్పితిని. పురాణ కవిత్వమునకు కవిత్రయము, కావ్య ప్రబంధ కవిత్వము, సోమనాథునితో సంకురించినను యీరకపు కవితకు బమ్మెర పోతరాజు, శ్రీనాథుడు, పిల్లలమఱ్ఱి పిన వీరనకవులు పట్టాభిషిక్తులైనారు. అందుచేత కావ్య ప్రబంధ కవులపై కవిత్రయ ప్రభావ స్వభావ మేవిధముగా ప్రసరించినదో తెలిసికొందముగాక !

మొత్తముమీద పురాణ కవితా గ్రంథములనుండి భాగములు గైకొని తమ కవిత్వ కల్పనలతో నలంకరించి కావ్యముల పెంచి రచించినవారు వీరు. ఆధునిక కాలమున భావకవిత మల్లువారును, తదితరులును ఖండకావ్యములను పేరుతో చిన్న చిన్న కథలను వ్రాయువారును కలరు. ఇట్టి యూహాలనే పూర్వులును గల్గియుండి, పురాణ గాథలను ఖండ ఖండములుగా విభజించి వాని ప్రత్యేక కావ్యములుగా విభజించినారు. ఉత్తర హరివంశము వ్రాసిన సోమనాథుని ఖండకావ్య

కర్త యనవచ్చును. అట్లే పోతననుకూడ ఖండకావ్య సంపుటికర్త యని చెప్పనొప్పును. భాగవత కావ్య మొక ఖండమమాత్రమే గాదు. హరి వంశమునంగల నరకాసుర వధ మున్నగు గాథలును, లక్ష్మీనృసింహ పురాణమునంగల ప్రహ్లాద చరిత్రమును, మత్స్య కూర్మ పురాణములలోని గాథలను సంగ్రహించి వాని నన్నిటిని జేర్చి భగవంతుని చరిత్రమను పేర భాగవతము రచింపబడినది. గావున దానిని ఖండ కావ్య సంపుటమని నుడువ దగును. అట్లే శ్రీనాధ మహా కవియును స్కాంధ పురాణాంతర్గతమగు, కాశీ ఖండమును, భీమఖండమును గైకొని ఖండ కావ్యములను రచించెను. పౌరాణిక గాథలేయైనను అందును స్థల పురాణములైన ఈ భాగములను ప్రత్యేక కావ్యములుగా స్వతంత్ర కల్పనా చాకచక్యముతో, రసోత్కట రచనావిశేషములతో, నఖండ పాండిత సాహిత్యము వెలయించి కావ్య ప్రబంధ నిర్మాణ శక్తి జూపినవాడు కవి సార్వభౌముడు. భీమ ఖండమునకు భీమేశ్వర పురాణ మని పేరిడెను. పురాణ కవిత్వమం దీకవికి మిక్కిలి గౌరవ మున్నట్లు తోచుచున్నది. పురాణార్థ విజ్ఞాన మొక గొప్ప విశేషముగా శ్రీనాధుడు తలంచియున్నట్లు కొన్ని కొన్ని చోట్ల కనుపడును. తాను రచించిన నైషధానువాద కావ్యమున కృతిభర్తయగు సింగనమంత్రి, కృతికర్తయగు తనను బిలిచి సత్కరించి సంబోధించుటలో :

శా॥ బ్రాహ్మీదత్త వరప్రసాదుడవు, రుద్రప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుడ వీశ్వరార్చన కళాశీలుండ వ,భ్యర్హిత
బ్రహ్మాండాది మహా పురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళా నిధానమవు, నీ భాగ్యంబు సామాన్యమే॥

అని "బ్రహ్మాండాది పురాణార్థ జ్ఞాన సంపన్నుడవ" న్నట్లు గర్వముతో చెప్పికొనెను. పురాణ కవులని ప్రసిద్ధినొందిన కవిత్రయమును మాత్రమే స్తుతించెను.

తిక్కనవలె నీ కవి తన కావ్యములలో షష్ఠ్యంత పద్యముల వ్రాసెను. సోమనాధ కవి షష్ఠ్యంతములు చేర్చలేదు. షష్ఠ్యంతముల జేర్చుటకు తిక్కన సోమయాజి యిచ్చిన హేతువు హృదయంగమముగా

నున్నది. ఆయన "ఈదృశ పుణ్య ప్రబంధములు దేవ సన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషం బగుటం జేసి" అని చెప్పి:

కం|| ఓంకార వాచ్యునకు, నన
హంకార నిరూఢభావనారాధ్యునకున్
హ్రీంకారమయ మనోజ్ఞా
లంకారోల్లాస నిత్య లాలిత్యునకున్ ||

"ఏను విన్నపంబు సేయు తెరంగున గానం తత్సన్నిధిం గలిగించుకొని యమ్మహా కావ్యంబు సద్ధంబు సంగతంబు జేసెద" అని జెప్పి పిమ్మట షష్ఠ్యంతములు విడచి ప్రత్యక్ష సంబోధన ప్రారంభించి:

కం|| శరణాగత సంశ్రితభయ
హరణా, సురనికర శేఖరా నర్ఘమణి
స్ఫురణా పరిచయరంజిత
చరణా, వనమాలికాభుజం గాభరణా ||

అను పద్యము నారంభించెను. తిక్కన ననుసరించి తరువాతి కవులలో పెక్కండ్రు తమ తమ కృతి భర్తల కాశీర్వచన పూర్వకములగు శుభములను గోరుచు కృతికర్త ప్రశంసాపరమైన పదములతో షష్ఠ్యంత పద్యముల నిప్పటివరకును వ్రాయుచున్నారు. కృతి భర్త దైవమైనచో తద్విశేషవర్ణనాపూర్వక పద్యముల వ్రాయుచున్నారు.

తిక్కన కవిత్వమునం గల యర్థపుష్టి గూర్చుటకై శ్రీనాధుడు ప్రయత్నించి చాలవరకు కృతకృత్యుడయ్యెను. కావ్య ప్రబంధ యుగమునకు శ్రీనాధుడే అధినాధుడు. తత్పూర్వాపర కవులెవ్వరు శ్రీనాధుని స్థాన మాక్రమించుకొన్నవారు లేరు. ఎట్టి కవితా విధానము గావలెనన్న నా విధముగా కవిత్వము చెప్పగలశక్తి యతనికి గలదు. తెలుగు పదముల వాడుకయును రమ్యముగా నుండును. లోకోక్తులు పెక్కులు గలవు. ఈతడు కేవల కవిమాత్రుడే గాక సంస్కృతాంధ్రములం దత్యంత పాండిత్యము గల్గి, తర్క, వ్యాకరణ మీమాంస శాస్త్రములలో కూలంకష ప్రజ్ఞ గలిగి రాజాస్థానముల

లోని విద్వాంసులను వాక్యార్థముల నోడించి కీర్తిగన్న ధీశాలి. ఈతని కవిత్వమున సంస్కృత వ్యాకరణ సాంకేతిక పదము లుబుకుచుండును. శ్రీనాథుడు సంస్కృ తాంధ్ర భాషలు రెంటను నిరుపమాన నిరాఘాట కవితాధార జూపిన మహాకవి.

సీ॥ ముక్కంటి దరహాసమున కనుప్రాసంబు
మిన్నేటి నీటికి మిక్కుటంబు
శారదసమయజ్యోత్స్నకు ప్రతిచ్ఛదంబు
నలువ శుద్ధాంతమున కనుభాష.......

మ॥ హరిదంత ద్విపదంత కుంతముల కన్యాదేశమాశీవిషా
భరణోత్తంస సుధాంసురేఖకు ననుప్రాసంబు కైలాస భూ
ధరకూటస్ఫటికోపలప్రతతి కధ్యాహారమిమ్మేది నీ
శ్వర దేవేంద్రుని సాంద్ర నిర్మల యశోజాలంబు లీలావతీ ॥

ఇత్యాది రమణీయమై ప్రౌఢమైన తెలుగు గీర్వాణ పద ప్రయోగముల శాస్త్ర సాంకేతిక పదములను గూర్చుటలో నితడు జాణ. అందమైన తెలుగు పదములను సుందరమైన తత్సమ పదములను గూర్చి పద్యమునకు మనోహరత చేకూర్చు కవిత్వ మితని సొమ్మనుటకు సంశయము లేదు. పరికింపు డీ రచనా విశేషము :

సీ॥ సింహాసనము చారుసిత పుండరీకంబు
చెలికత్తె జిలువారు పలుకుచిలుక
శృంగార కుసుమంబు చిన్ని చుక్కల రాజు
పసిడి కిన్నెర వీణ పలుకు దోడు
నలువ నెమ్మోము దమ్ములు కేళిగృహములు
తళుకు టద్దంబు సత్కవుల మనసు
వేదాది విద్యలు విహరణ స్థలములు
చక్కని రాయంచ యెక్కిరింత
యెపుడు నే దేవి కాదేవి యిందుకుంద
చంద్ర చందన మందార సారవర్ణ
శారదా దేవి మామక స్వాంతవీధి
నిండు వేడుక విహరించుచుండు గాక॥

అంత్య గీత పాదముల సరళ సమాసమును, సీసమున నాల్గుపాద

ములలోని యుభయభాషా పదముల సొంపు యెట్టివారికి నుల్లము పల్లవింపజేయక మానదు.

ఈ కవి తిక్కన సోమయాజివలె చక్కని సూక్తు లచ్చటచ్చట విరివిగా వాడినాడు. తిక్కన యుద్యోగపర్వమున "దయ్యాము నెత్తి క్రోలు తుది దాకుటగాదె భుజంగ భంజనా" యని భీముడు కృష్ణునితో బల్కిన ట్లుపయోగింపగా శ్రీనాథ కవి శృంగార నైషధ కావ్యమున, పంచమాశ్వాసమున దమయంతి స్వయంవర సందర్భమున సభలో సరస్వతి నానా దేశాధీశ్వరులను, దేవతలను పేర్వేర దమయంతికి చూపి వర్ణించుచట్టున దేవతలం జూపి దేవతలలో నొకనిని వరించినచో "యా దయ్యము నెత్తి క్రోలు తుది దాకుటగాదె సరోజ లోచనా" యని వ్రాసినాడు. సంస్కృత పదఘటిత దీర్ఘసమాస జటిల మయ్యును, శ్రీనాథకవి కవితాధార మఱియొకరికి రాదు. సీసపద్యముల తూగు, ఒయారము, ఠీవి యద్వితీయము. ధారావేగ ముచే పాఠకులు దొర్లిపోవలసినట్లుగా నుండును. తెలుగు పదముల సొంపుసయితము నిరుపమానము. నాచన సోమనాథుని సీసములయందు యెక్కువ సోయగము కన్పించును. అయినను పదములుతూచి, చర్చించి, భారతమునంగల తెలుగు పోకడల స్మరణకు దెచ్చుకొని ప్రయోగించునట్లు దోచును. గాని శ్రీనాథుని సీసము లప్రయత్నముగా ధారాగతిలోనే యర్థవంతములై చొచ్చుకొని వచ్చినట్లు దోచును. అత్యుద్ధతితో పరువిడి వచ్చు ధారలో సయితము సందర్భోచితి క్షేమాత్రము లోపము రాదు. ఈ మహా కవి కవితలో లోకోక్తులు, పదమార్దవము, సంస్కృత పదజాలమునకు మధ్య కలసిపోవునట్లుండును. వర్తమాన కవు లభిలషించునట్టి సీసపాదము లీతని కవితలో మిక్కుటముగా నుండును. సీసములలోని తూగు నీ క్రింద గాంచుడు :

సీ॥ తన కృపాణము సముద్ధతవైరి శుద్ధాంత
తాటంకముల కెగ్గు దలపుచుండ
తన బాహుపీఠంబు ధరణి భృత్కమఠాహి
సామజంబులకు విశ్రాంతి యొసగ........
మంత్రి పెద్దయ సింగనా మాత్యవరుడు ॥

సీ॥ తపనీయదండైక ధవళాత పత్రి తో
ద్దండ తేజః కీర్తిమండలుండు........

సీ॥ గగనకల్లోలినీ కల్లోల మాలికా
హల్లీసకములతో నవఘళించి........

శీ॥ అఖిల దిగ్గేశరాజాకర్షణ క్రియా
మహనీయతర సిద్ధ మంత్ర విద్య........

ఇట్టి తూగు, ప్రౌఢ శబ్దోద్ధతి, శావ్యత, నడకలో కులుకు, గమకములపట్టున యీ కవి నెఱపిన శిల్పచాతుర్య మెవ్వరును చూపి యుండ లేదు. ఇట్టి ప్రౌఢమైన నడకతో తిక్కనయు పెక్కు పద్యముల రచించెను. మహాకథాసముద్రము కరణి యపార వివిధ విషయము లను విశదీకరించి కథాసముద్రము నుత్తరించవలసిన భారత కావ్య మున, కొలది కథారచనతో గూడిన కావ్య ప్రబంధములలోవలె రచనా వైచిత్రికి, సమాసముల తూగునకు, దీర్ఘసమాస సంపత్తికి నంతగా నవకాశము లేకున్నను అచ్చటచ్చట తిక్కన తన శక్తి చూపగల పద్యములు వ్రాసెను. ఆతూగు శ్రీనాథుని తూగునకు దారి జూపెను. తిక్కన పద్యముల చదివి శ్రీనాథుడు తా ననుకరించెను. తిక్కన పద్యపాదముల తిలకింపుడు :

సీ॥ కుంజరనికురుంబ కుంభస్థలీ సంగ
సిందూర రుచులతో జెలిమి చేసి
కేతనవ్రాత సంకలిత మాణిక్య
రశ్ముల గొడ విహారంబు సలిపి
సైనిక నికర వక్షస్థ్సల పరిలిప్త
కాశ్మీర దీప్తుల గాగలించి
దండనాథోత్కర చండ భావోద్వృత్త
చక్షుః ప్రభలతోడ సరసమాడి........
బాల్య రమణీయుడగు చిత్రభాను డొప్పె॥

శీ॥ ధరణీపరాగ సంతానంబు గబళించు
కరశీకరచ్ఛటా స్ఫురణములును
చంచరీకావళీ ఝుంకృతుల్ గల్పించు
కర్ణ ఝుళం ఝుళా కలవములును........

సీ॥ కాండ మహా తరంగముల వైరులముంచు
విజయాంబురాసికి వేలవగుడు
విశిఖోగ్ర శిఖల విద్విషుల నేర్చు కిరీటి
ఘోరదావాగ్ని కాసార మగుడు........

శీ॥ రోష మహాటోప భీషణ హరితోడ
సమరంబునను హరిణము గడంగి
దానధారాభీల దంతావళముతోడ
సంగ్రామమునను శశంబు గడగి
చండస్వభావోగ్ర పుండరీకముతోడ
నాజికి సారమేయంబు గడగి
దారుణ తుండాతి ఘోర గృధ్రముతోడ
కలహంబునను నురగంబు గడగి........

సీ॥ రాత్రి మైదాకి క్రూరత బోరి మగటిమి
వాసిన యంగార పర్ణు కంటె
ఖాండవోద్యానంబు గావ నేరక సిగ్గు
పడి చన్న నిర్జర ప్రభుని కంటె........

సీ॥ జగము లన్నియును తేజంబున వెలిగించి
యపరాద్రి సేరిన తపను మాడ్కి
నున్నత గతి చెడి యుర్విపై గడు
విన్నవై పడియున్న సుధాంశు భంగి........

సీ॥ దివ్య రథ స్ఫార దీప్తి జాలంబులు
పద్మరాగోజ్వల ప్రభలు గాగ
మహనీయ రథ్య విగ్రహముల జిగిసొంపు
ఘన వజ్ర వసుసముత్కరము గాగ
ప్రస్ఫీత కేతనాగ్రస్థిత కపి దేహ
రోచులు గరుడాశ్మ రుచులు గాగ........

తూగు, కూర్పు, నేర్పు గల యిట్టి పద్యము లనేకములు గలవు.

ఈ విధమైన సీసపద్య రచనా పద్ధతిలోనే గాక శ్రీనాథుడును, నాచన సోమనాథుడును గూడ ఉద్ధతమైన వీర, రౌద్ర రసములు చూపవలసిన చోట్ల, స్రగ్ధర, మహాస్రగ్ధరా వృత్తములలోను, మత్తేభ

శార్దూల వృత్తములలోను దీర్ఘ సమాస ఘటితములుగా తిక్కనవలె రచించిన పద్యములు పెక్కులు గలవు. మచ్చుకొకటి రెండు చూపుచున్నాను.

తిక్కన :

స్రగ్ధర ॥ శాతాస్త్రస్ఫార వీచీసముదయరభసాశ్చర్య సంపాదిహేలా
స్ఫీతంబై క్రమ్మ దేరన్ బెదరక కడచెన్ భీష్మవారాసి తుచ్ఛా
రాతి వ్యాపారదుర్వారత......

స్ర॥ సాయంప్రాతర్హుత ప్రజ్వలిత హుతవహస్ఫార నిర్ధూత జాడ్య
స్థాయచేతః ప్రసాద ప్రసృమర విమలప్రౌఢ బోధానుమోద
మాయావ్యాపార దూరామఘతతినిర్మాణ సంపాద్యమానా
శ్రేయోరాజ త్రిలోకాశ్రితజన దురితక్షేప లీలావిలాసా ॥

పై విధముగా తిక్కన పోకడలు సోమనాథ, శ్రీనాథు లనుకరించియే యున్నారు. అనుసరింపక తప్పదు. మహార్ణవంబువంటి మహాభారత గ్రంథమున జూపని సౌందర్యము లేనందునను, త్రొక్కని కవితామార్గము లేనందునను ప్రతివిధమైన పోకడలు అందందు మచ్చునకు దొరకుచునే యుండును. ఆ గ్రంథమును చదువకుండా తక్కిన కవులు తమ కావ్యములు, వ్రాయుట సంభవింపదు,

ఆంధ్ర కవితా వారాసిలో మునుంగదలచిన ప్రతి కవియును కవిత్రయ కవితాతరంగముల తాకిడి తప్పించుకొన జాలడు. కవిత్రయమును వర్ణించుచు మాదయగారి మల్లన కవి యొకచో :

తే॥ గీ॥ సరస సంస్కృత పుష్పగుచ్ఛ ప్రభూత
మగు తెలుంగను నెత్తావి కఖిల దిశల
తరుణ పవమానమగు కవిత్రయ విశేష
చతుర వాచానిరూఢి కంజలి యొనర్చి ॥

నాడు. తిక్కన తెలుంగున సోమనాథుని భంగి నీ కవికూడ పైన తెల్పినట్లు లోకోక్తు లుపయోగించెను. భీమేశ్వర పురాణములో నిట్టి సామెతలు మిక్కుటముగా చూపట్టుచున్నవి.

"ముగురం గూర్చిన ముండ దైవమునకున్ మోమోట లేదాయె"; "ఆవగింజంత మై బూది యలమికొనిన, వెలది గుమ్మడి కాయంత వెఱ్ఱి బుట్టు"; "కట్టి మూచూడగ దోసకాయ లే?"; "మగడో బ్రమానో"— ఇట్టి వెన్నియో యున్నవి. ఎన్ని యున్నను యీ కవి గీర్వాణ భాషయందే మక్కువ గల్గియుండును. నైషధ కావ్యానువాదము నెంత రమణీయముగా రచించినను, భారత కవిత్ర యానువాదమునకు దీనికిని చాల తారతమ్యము గలదు. సంస్కృత వాక్యములు యథాతథముగానే నిల్పి తెలుగు విభక్త్యంతముతో పద్యము పూరించినాడు :

గమికర్మీకృతనైకనీవృతుడనై
అస్తి నాస్తి విచికిత్సాహేతు శాతోదరికా
సదసత్సంశయగోచరోదరీ
శరత్సంపూర్ణ చంద్రాననకా ॥

అని వ్రాసియున్నాడు. అంతటితో తనివిదీరక, "గమికర్మీ భూత నా నా నదీ నద కాంతార పురీశిలోచ్చయుడనై" యని యింకొక సారి ప్రయోగించినాడు. సంస్కృతమున మహోద్దండ పండితుడు తానైనట్లు పాఠకుల హృదయములకు గట్టిగా తట్టుకొనునట్లు చేయు దలంపుతో వ్రాసిన భంగి నీతని పాండిత్య ప్రతిభ మిఱుమిట్లు గొల్పు చుండును. పద్యములలో సమాసము ముగించు తఱిని, "అయ్యో! సమాసము ముగియుచున్నదే" యను విచారముతో తిరిగి ప్రక్కనే యింకొక సమాస మందుకొనుచుండును. అట్లని తెలుగు సొంపులకు కొఱత రానివ్వడు.

"చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాడు"
"నూనూగు మీసాల నూత్న యౌవనమున"

చం ॥ చిలుంపని కమ్మతేనియలు, చిప్పిలి హస్తము లస్తకంబులన్
నిలుపక జీరువారు నెడ నీ యతి సాంద్రప రాగముల్లదా
యలరుల వింటిజోదునకు నప్పటి కప్పటి కప్పళించుకో
గలిగెడునంచు వేకనలు గైకొనిదూరె విభుండు కేళికా ॥

శ్రీనాథుని ఉద్ధత కవిత్వము నైషధ, భీమఖండములలో నున్నట్లు, కాశీఖండములోను హర విలాసములో నంతగా కనుపడదు. బహుశా వయస్సు బాగా ముదిరి వార్ధక్యము సమీపించు దినములలో వ్రాసి యుండుటచేత యుద్ధత తగ్గియుండ వచ్చును. అర్థపుష్టి కాశీ ఖండమున నధికముగా నుండును. హర విలాసమున కల్పనా నైపుణి మిక్కుట ముగా నున్నది. తిక్కనవలె కాశీఖండమున నర్థపుష్టి కెక్కుడు విలువ నిచ్చి పదాడంబర మొక్కింత తగ్గించినట్లు తోచక మానదు. ఉభయ వాక్ప్రౌఢి భారత కవిత్రయములోని నన్నపార్యుని చూపగలిగెను. రసపుష్టి తిక్కన్న నొరవడిగా గొనెను. విచిత్రమైన సూక్తుల శోభ ప్రబంధ పరమేశ్వరు ఛాయ ననుసరించెను. అందువలన కవిత్రయ కవితా ప్రభావము శ్రీనాథునిపై పూర్తిగా ప్రసరించెను.

## పోతనామాత్యుడు

శ్రీనాథునితో సమానకాలమున నత్యంత సుందర కవితా సుధా ప్రవాహములచే నాంధ్రదేశము నంతటిని ముంచియెత్తి నేటికిని ముంచు చున్న మహాకవి బమ్మెర పోతన. ఈ కవికృతాంధ్ర మహాభాగవతము నంతయో, కొంతయో చదువని యక్షరాస్యులు తెలుగు నాటిలో నుండరు. కొద్దికాలము క్రిందటివరకును సామాన్యముగా ప్రతి గ్రామ మున భాగవత పురాణము ప్రతిదినము కాలక్షేపము చేయుచుండెడి వారు. అందు ముఖ్యమైన ఘట్టములు— సప్తమ స్కంధమున ప్రహ్లాద చరిత్రము, అష్టమ స్కంధమున గజేంద్రమోక్షము, వామనచరిత్ర, సముద్రమథనము, దశమ స్కంధమునగల రుక్మిణీ కళ్యాణము, కృష్ణ లీలలు, నవమ స్కంధమునగల గంగావతరణ గాథ మున్నగునవి యాబాలగోపాలమును మిక్కిలి కుతూహలముతో చదువుచుందురు. చదువలేని వారు వినుచుందురు. ప్రతి యింటను పసిబిడ్డలకు మాటల వలెనే;

ఓ యమ్మ నీ కుమారుడు
మా యిండ్లను పాలుం పెరుగు మననీడమ్మా
పోయెద మెచ్చటికైనను మాయన్నల
సురభులాన మంజుల వాణీ॥

చేతు లారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగా దలపడేని
గలుగ నేటికి తల్లుల కడుపు చేటు॥

చేతుల తాళము బట్టుచు చేతోమోదంబుతోడ చిడిముడిపడుచున్
పాతరలాడుచు మింటన్ గీతము నారదుడు బాడె కృష్ణా యనుచున్॥

ఇత్యాది ముద్దులొలుకు పద్యములను ముద్దు ముద్దుగా రాగముతోగూడ ముద్దుబిడ్డలకు నేర్పుచుందురు. దీనినిబట్టి పోతరాజుగారి కవిత్వ మాబాలగోపాలమునకత్యంత మనోహరమై యానందము గల్గించునని వేరుగా చెప్పనక్కరలేదు. పండిత పామరులు భాగవత మన్న హాయిజెందుదురు. పోతనగారు తన కావ్య మట్లు చేసెదనని ప్రతిజ్ఞ చేసియున్నాడు గదా !

కొందఱకు తెనుగు గుణ మగు
కొందఱకును సంస్కృతంబు గుణ మగు మఱియున్
కొందఱకు రెండు గుణ మగు
నందఱ మెప్పింతు కృతుల నయ్యై యెడలన్॥

అని యీ కవి శంఖారావము పూరించియున్నాడు. ఇంచుక భగవద్భక్తిగల వారు పైనదెల్పిన ముఖ్యఘట్టములు తెల్లవారుజాముననే లేచి పారాయణము చేతురు.

మహాభారతము పురాణముగా నచ్చటచ్చట పఠింతురుగాని భాగవతమువలె విరివిగా జదువరు. ఇంతగా ప్రజానురంజనకరమగుటకు పోతరాజుగారి సరళ కవిత్వమును, ఆ మహామహుని యపారభక్తియు కారణములై యున్నవి. నిజముగా కవి భక్తుడైనగాని భక్తిరసము నుద్దీపింపజేయు రచనలు సేయజాలడు. ఈ కవి భగవంతుని గుణ రూప

వర్ణనలు చేయునపుడు భక్తిపారవశ్య మంది, భక్తిఘనీభావమే తానై, మైమరచి, ద్విరుక్తి దోషములగణింపక, భగవత్సాన్నిధ్యము ప్రాపించి నట్లే యనుభూతిగాంచి, భగవ ద్విభూతి ప్రత్యక్షముగా గాంచు చున్నట్లు దోచును. కవితా మాధుర్య మనుభవింపగలవారు పోతన గారిపేరు విన్నంతమాత్రముననే సుఖ, సంతోష, పారవశ్య మందుచుం దురు. అట్టి యీ మహాకవి కవిత్వము నేమని వచింపవలయును!

బాల రసాలసాల నవపల్లవ కోమలమా ?
మందార మకరంద మాధుర్యమా ?
నిర్మలమందాకినీ వీచికా ప్రవాహమా ?
కమ్మని చల్లని మెల్లని మలయ కుమార సంచారమా ?
గోవిందకథా సుధారస మహా వర్షోరుధారా పరంపరయా ?

ఇది యని చెప్ప వలనుపడదు. అన్నిటి సమాహారమనియే చెప్పనొప్పును.

మనకు ప్రస్తుత మవసర మేమనగా, కవిత్రయ కవితా ప్రభావ మేమైనా యీ కవిపై సోకినదా? లేదా? నన్నయభట్టుగారి కవితా మధురిమ చవిజూచి, తెలుగు నుడుల పొందిక తన యమక గమకములలో నిమిడ్చెను. ఎఱ్ఱన సూక్తులంబోలు సూక్తులను లక్ష్మీ నృసింహ పురాణ రీతులను చేకూర్చెను.

ఈ మహా కవి శైలి, కోమలపదముల కూర్పు సొంపు, ధార రచనకు తగియున్నది. భగవల్లీలా విలాసమునకు శాంతి రసమే ప్రధానము. వీర రౌద్ర రసాచ్ఛాదితమైన శాంతి రస మీతని నృసింహ, వరాహ, రామావతార కథలం దంతర్గర్భితమై యలరారు చుండును. కాని శాస్త్రరీత్యా విమర్శకుల దృష్టిలో భాగవత రచనకు భారత కవిత్రయ, సోమనాథ, శ్రీనాథాది కవుల ప్రాగల్భ్యత గలుగ లేదు. ప్రామాణ్యతనొసంగబడ లేదు. "అరసి పరీక్షకుండు వెలయల్పపు జేసిన గన్న సాల్పు జేసే?" యనునటోక్తి విమర్శకుల నిరసనావాక్యములు

చదివినప్పుడు చదువరులనోట నప్రయత్నముగా బయల్వెడలును. ఇక తిక్కనప్రభావ మీ కవి మీద ప్రసరించెనా ? లేదని చెప్పవచ్చును. తిక్కనవలెనే పోతనకూడా అద్వైతి. పరమార్థదృష్టిలో వీరిరువురకు భేదము లేదు. కాని తిక్కనకు కర్మ, జ్ఞానములు గూడ సంశ్లిష్టములు. అనుభవములో నిది మొదటిదానికంటె యధికమనియును చెప్పదగును. పోతనకు సిద్ధాంతరీత్యా జ్ఞాన మెక్కుడైనను భక్తియే యనుభూతిలో నెక్కుడై యున్నది. కర్మకాండయందు పోతనగారికి దృష్టి లేదు, అందుచేతనే :

ఉ॥ కాననివాని నూతగొని కాననివాడు విశిష్టవస్తువుల్
కానని భంగి కర్మముల గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణు కొందఱట గాంతురకించనవైష్ణవాంఘ్రి సం
స్థాన రజోభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా॥

ఇట్టివాక్యములచే పోతనగారు కర్మమార్గ నిరసనము స్పష్టముగా జూపియున్నారు. పోతన భగవద్రూప సాక్షాత్కారము నొందిన భక్తుడు. తిక్కన హరిహరనాథ పూజానిరతుడైనను అతని శ్రద్ధ అగ్నిహోత్రాదులయందే. శ్రౌత, స్మార్త, క్రియాకలాపముల నాసక్తి మెండు. తత్త్వసిద్ధాంత రాద్ధాంతమందు మాత్రము గీతాచార్యుడే. భగవద్గీతలవలె తెలుగు భారతమున తిక్కన సోమయాజి క్లుప్తముగా నిస్సంశయముగా నఖిలాద్వైత భావార్థములను వెదజల్లినాడు. భక్తి భావములను చూపు పట్టు ందు నైతము తిక్కనదృష్టి తత్త్వమే. పోతన దృష్టి సాకార బ్రహ్మసాక్షాత్కార వర్ణనమే. భీష్ముని శ్రీకృష్ణ స్తోత్రములను తిలకించిన నీ తారతమ్యము గోచరించును.

పోతన——

మ॥ త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింప ప్రాభాత నీ
రజ బంధు ప్రభమైనచేలముపయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెకాడు మది నావేసించు నెల్లప్పుడున్ ॥

యని కృష్ణరూపము జూచి యానందించినాడు.

తిక్కన్నయో—

సీ॥ శుచియను హంసుండు శుచిషత్తు పరముండు
పరమేష్ఠియను నగు భవ్యు గొలుతు
మునులును, సురలు నెవ్వని యున్నరూ పెఱుంగరు
సర్వవిదుని నప్పురుషు గొలుతు
శ్రుతులు సెప్పగ మహామతులు దుఃఖౌషధం
బుగ నెఱింగెదు పుణ్యమూర్తి గొలుతు
లోకంబులెల్ల గల్గుట, నిల్చు టొదుగుట
తనయంద యగు మహోత్తముని దలతు
పక్షి, రత్నచయంబు పుష్పవ్రజంబు
పంజరము త్రాడు నార యుపాశ్రయముగ
నుండు చాడ్పున విశ్వంబు నుండుటను, సు
ఖాస్పదంబగు పుండరీకాక్షు దలతు॥

అని తత్వమును మననము జేసినాడు.

ఋతుకాలములందు పోతనగారు ప్రకృతిలో:

కం॥ పికముల కోలాహలమును
శుకసంఘము కలకలంబు సుభగ మయూర
ప్రకరము, కేకారవ మళి
నికరము రొదయును జెలంగె, నెఱి నయ్యడవిన్॥

తిక్కన్నకు ప్రకృతిలో—

చం॥ ప్రకృతియ లింగ, తజ్జనితభంగులు లింగము లట్టులయ్యురం,
జక గుణశీల! లింగచయ సంగతి దాను సలింగ యయ్యె, మూ
ర్తి కలనలేకయుండియు పరిస్ఫుట పుష్ప ఫలాది సూచక
ప్రకరముచేత మూర్తమయి భాసిలదే ఋతు వేళ చూడగన్॥

అని ప్రకృతి తత్వము స్ఫురించును. ఇరువురకు సగుణ, నిర్గుణ దృష్టి భేదము.

పోతన సూర్యోదయము—

ప్రాచీదిశాంగనా ఫాల భాగంబున దీపించు సిందూర తిలకము.

తిక్కన సూర్యోదయము—

నీరజాకరములు నిష్ఠమై సల్పిన భవ్యమహా వరతపః ఫలము.

ఇట్టి దృష్టిభేదము రచనలో నచ్చటచ్చట చూపట్టుచుండును.

ఇట్లే పోతనగారికి :

మ॥ అల వైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల మందార వనాంతరామృతసరం ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమా వినోదియగు నాపన్న ప్రసన్నుండు.........

కనుపడును.

తిక్కనగారికి :

కం॥ సువ్యక్త క్షేత్రంబున
నవ్యక్తాకృతినిరూఢి, నాశీనుండై
భవ్యత నుండెడు క్షేత్రా
త్మ వ్యపదిష్టుడు........

స్ఫురించును.

తిక్కన కవిత్వమున రసఘుటికా పరంపరలు విచ్చల విడిగా నుండును. పోతన కవితలో రసప్రవాహములు వెల్లువలు బారుచుండును. తిక్కన రసము ఘనీభూతమై యరసినకొలది యూరుచునేయుండును. పోతరాజుగారిది ద్రవీభూతమైన రసము. అర్థపుష్టి, తిక్కన కావ్యమున నపారము. రసవైశద్యము పోతన స్వభావము. రసోత్కట మెల్లచో నీతనికవిత్వమున విలసిల్లుచున్నది. నన్నయ శైలిలో దీర్ఘసమాసము లున్నను, అన్వయ కాఠిన్యత లేదు. తిక్కన కవితలో సందర్భశుద్ధి, ప్రౌఢిమ, ఉచితపద సారస్యము మిక్కుటముగా నుండును. ఈ రెండు లక్షణములు పోతరాజుగారు తన సహజ రసప్రవాహములో మేళవించి యున్నారు. అనువాదసరణి కవిత్రయము వారిది. స్వతంత్రీకరణము పోతరాజుగారిది. విస్తరణము ఇందునుగూర్చి పైనదెల్పియున్నాను. కావున మరల చెప్పనక్కరలేదు.

ఆంధ్ర కవితా కన్యను సాకారము చేయవలసివచ్చినచో అర్థపుష్టి యొసంగిన తిక్కన యాకన్యకు తల, కంఠాగ్ర భాగమనియు, రస వైశద్యము పద ప్రసన్నత గల పోతన హృదయ మనియును, కావున తిక్కన ప్రథము డనియు, పోతన ద్వితీయు డనియు, వీరికి పిమ్మటి

వారగు సోమనాథాదులు వారికి ఛాయ లనియును యొక విమర్శకుడు వ్రాసియున్నాడు. మొత్తముమీద పోతన, తిక్కన లాంధ్ర కవితా సుందరి కధీశ్వరులని తలంప వచ్చును. పోతన సీసపాదములు శ్రీనాథుని సీసపాదముల భంగి సువిభక్తములై యుండును. గాని, శ్రీనాథుని సీసములు ప్రౌఢ సంస్కృత పదభూయిష్ఠమై యుండును. పోతన సీస సమాసములు, సరళ, మృదుల పదసంకలనమై యొప్పారుచుండును. అంత్యప్రాసలు, సోమన, శ్రీనాథ కవుల కవితలో నున్నను పోతన కవితలో నవి యడుగడుగునా చెంగలించుచు నొక్కొకచోట విసుగు కూడ పుట్టించునంతటి మిక్కుటముగా నుండును.

రసములలో పోతనకు భక్తి రసమే ప్రధానమైనను సందర్భోచితముగా తక్కిన రసము లవసరమైనచోట్ల సొబగుగా స్రవింపజేయక పోలేదు. ప్రథమ స్కంధమున నశ్వత్థామ నవమానించుపట్ల భయానక రసమును, భీభత్స రసమును గనుపించుచున్నది. కృష్ణ నిర్యాణ సందర్భమున కరుణారసము వెల్లి విరిసినది. శుకమహర్షి సందర్శనమున శాంత రసము తోచుచున్నది. సప్తమ స్కంధమున దాదాపు అన్ని రసములు విశదమైనవి. అష్టమ, నవమ స్కంధములలోను భక్తిరసము, అద్భుత రసము ప్రదర్శింపబడినది. ఇక దశమ స్కంధమున చెప్పవలసిన పనిలేదు.

సకల భక్తి సిద్ధాంతానుభవ పరిపాక సంభరితమైన భక్తి స్వరూపము రమణీయ మంజుల పదజాల సుధలతో చిత్రించబడినది. పూర్వకవుల కావ్యములలో నేదే నొక రసము ప్రధానముగా నున్నను తక్కిన రసములన్నిటికి తావుండునట్లు కథా సంవిధాన మొనరింపబడును. అట్లే భారత కవులు సమస్తరసములు ప్రోదిచేసి యున్నారు. రసౌత్కృష్ట్యమున పోతనగారు సోమయాజికంటె నధికుడనియే రసజ్ఞుల యభిప్రాయము. అర్థపుష్టి గల్గించుటలో నొక్క తిక్కన్నకు దక్క తక్కిన యే యితర కవులకు పోతన తీసిపోడని కొందఱి మతము. 15-వ శతాబ్దమున నుండిన యీ పోతన, శ్రీనాథ మహాకవుల కంజలిజేసి ముందునకు సాగి పోవుదము.

## తృతీయ శ్రేణి

## అల్లసాని పెద్దన

ఈ కావ్య ప్రబంధ కవులకు పిమ్మట ప్రసిద్ధులైన కవులు పురాణ కావ్య రీతుల సడలించి, నూతన కల్పనలకు, వర్ణనైక ప్రాధాన్యతకు నుత్సహించి వేరొకమార్గము ననుసరించిరి. వారిలో ముందంజవేసిన కవి అల్లసాని పెద్దన. ఈ కవి తనముందు శ్రీనాధకవిని దృష్టియందు బెట్టుకొన్నాడు. నన్నయ కవితారీతులు గ్రహించినాడు. నన్నయగారు కథల సంగ్రహముగా, ప్రౌఢముగా వ్రాయుదురు. అనగా మితవాక్య ప్రయోగము, గంభీరముగా నుండును. విషయవైశద్యము తక్కువ. ఈ రచనా విధానమునందు పెద్దనకు మక్కువ యని తోచును. పెద్దన కథ చెప్పుటలో వైచిత్రి జూపును. కథా గమనికకు భంగకరమగు, అనవసరమగు దీర్ఘవర్ణనలతో పెద్దన పాఠకులకు విసుగు పుట్టింపడు. కథలేని వర్ణనల తీయదనము మనము గ్రహింపలేము. మనుచరిత్రమున రసపోషణము సముచితగతితో రమణీయశైలి మాధుర్యముతో చదువరుల కందించినాడు పెద్దన. వరూధినీ ప్రవరాఖ్యుల పాత్రలను చక్కగా పోషించినాడు. ఇక సమాసము లాతని పద్యములలో నన్నయ సమాసములంబోలి సులభముగా సరళముగా నుండును. 16-వ శతాబ్దమునందున్న ప్రబంధకవు లందరిలోను పెద్దనయే పెద్దనవచ్చును. ఆంధ్ర కవితాపితామహుండను బిరుదమునంది రాయలయాస్థానమున నిరుపమాన, గౌరవ బహుమానముల గాంచి గీర్వాణాంధ్ర భాషల యందత్యంత సాహితీ సంపత్తి గల్గిన మహాకవి యితడు. "పూత మెఱుంగులు, పసరు పూప బెడంగులు" చూపగలడు. "వియద్ధునీ చకచకోత్పల సార సంగ్రహము" చేయగలడు. "వరుణా తరంగిణీ దరవికస్వరనూత్న కమల కషాయ గంధము" వహింపగలడు. అటు తిరిగి "తుహిన భూధర శృంగ శ్యామల కోమల కానన హేమాద్రి దరీఝరుల" కెక్కగలడు. ఈ కవి కవితలో తిక్కన సోమయాజి పోకడ లేమియు గనుపింపవు. పోతన పదముల లాలిత్యము, శ్రీనాధుని

సీస పాదములం బోలు సీస పాదములు, తక్కిన యనేక రీతులు పెద్దన చూపినాడు. పద్యముల నడక శ్రీనాథుని యనుగమించెను. గాని యాతని యుద్ధతి మాత్రము రాలేదు. రచన సుకుమారముగా, గంభీర ముగా, జగ్గునిగ్గులతో తూచినట్లుండును. అందుచేతనే కాబోలు కవి చౌడప్ప :

కం ॥ పెద్దనవలె కృతి చెప్పిన
పెద్దనవలె లేకయున్న పెద్దన వలెనా
యొద్దనవలె మొద్దనవలె
గద్దనవలె కుందవరపు, కవిచౌడప్పా ॥

అని పలికెనట.

సీ ॥ నళిన సంభవు వాహనము వారుజంబులు
కులము సాములు మాకు కువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకు పువ్వుబోడి........

అని హంసచేత శ్రీనాథుడు చెప్పించినట్లు పెద్దన వరూధినిచేత :

సీ ॥ చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధి
బొడమిన చెలువ తోబుట్టు మాకు
ననవిల్తు శాస్త్రంబు మినుకులా వర్తించు
పని వెన్నతోడ బెట్టినది మాకు........

అనిపించినాడు. పెద్దన, నన్నయ రచనా పోకడలు అచ్చటచ్చట చూపెననుటకు సందియములేదు. భారతాది పర్వ చతుర్థాశ్వాసమున నన్నయ వ్రాసిన :

ఉ॥ దాని శరీర సౌరభము, దాని విలోల విలోకనంబులున్
దాని మనోహరాకృతియు దాని శుచిస్మితవక్త్ర కాంతియున్........

అను పద్యముబోలి,

వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేష మెమ్మెయిన్
హాని దవంధ్య జీవనము వానిది జన్మము........

అని వ్రాసినాడు, మఱియున్న

అమర సుధా రమ్య హర్మ్య తలంబుల నవ కుసుమామోద నందనముల
కృతకాద్రి కందర క్రీడా గృహంబుల వివిధ రత్నోపల వేదికలను

పై పద్యమువలె పెద్దన తన మనుచరిత్రమున,

గంగా తరంగిణీ రంగత్తరంగ శీకర శీతసైకతోత్కరములందు
మందార మాకంద మకరందతుందిలేందిందిరా నందకృన్నందనముల........

అను పద్యమున పై పద్యభంగి జూపెను. అట్లే ప్రబంధ పర మేశ్వరుని భారతారణ్య చతుర్థాశ్వాసమున :

ఉ॥ ఎవ్వరిదాన వంబుజదళేక్షణ యేకత మిట్టు లేల నీ
వివ్వన భూమియందు జరియించెదు........

అను పద్యమువలె పెద్దన మనుచరిత్ర ద్వితీయాశ్వాసమున :

ఉ॥ ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటి జరించెదోడు లే
కివ్వనభూమి భూసురుడ.......

అని వ్రాసెను. పెద్దన మహాకవి వీర రౌద్ర రసముల వర్ణించు పట్టులందు కవిత్రయము వలె రసవంతములైన పద్యములు వ్రాయక పోలేదు. తమ ప్రబంధములలో నూతన పోకడలు పోయినను పలువురు కవులు భారత రీతుల నవలంభింపక తప్పినదికాదు. పెద్దన యుద్ధవర్ణన గాంచుడు :

శా॥ ఆ శూలం బవనీశమౌళి దళితాహంకార హుంకార కృ
త్సైశిత్యం బభినుత్యమై చనుడు స్వాణశ్రేణి చెండాడి వే
కాశశ్వేత గరుత్పరంపరల నాకాశంబు దుగ్ధాబ్ధి సం
కాశంబై వెలుగన్, శరావసులుచే గప్పెన్ దిశాపంక్తులన్ ॥

ఇట్టి పద్యములు వ్రాసి కొంతవరకు కుడి యెడముగా వీరరసము భారతములోవలె చూపగల నను కొన్నాడు.

## సంకుసాల నరసింహ కవి

ప్రబంధ కవులు పెద్దన కాలములోనున్న వారు మరికొందరు గట్టివారే గలరు. వారిలో కవికర్ణరసాయన కర్త యగు సంకుసాల నరసింహ కవి యగ్రగణ్యుడు. ఆ కవి నిరంకుశ పాండితి, కవితా వైదుష్యము, అద్భుత వర్ణనాకౌశలము గలిగిన వాడయ్యాను, అతని కావ్యము మనుచరిత్రకంటె నధికతరవర్ణన గల్గినదైనను, మనోహర కథాపోషణాదరముకంటె వర్ణనావిదగ్ధతకై యెక్కువ శ్రమపడి అదే ప్రాధాన్యముగా పరిగణించి వ్రాసియున్నందున ప్రజారంజకముగా లేక పోయినట్లగపడుచున్నది. కాని యీ కవికి మంచి పేరుగలదు.

గీ ॥ యతి విటుడు గాకపోవు పెట్లస్మదీయ
కావ్య శృంగారవర్ణ నాకర్ణనమున
విటుడు యతిగాక పోవునే వెస మదీయ కావ్య
వైరాగ్యవర్ణ నాకర్ణనమున ॥

అని వ్రాసికొన్నాడు. పురాణ కవులలో నన్నయ తిక్కనల కెట్టి సామ్యమున్నదో యట్టి సామ్యము ప్రబంధ కవులలో పెద్దన, సంకుసాల నరసింహ కవుల కున్నదని పండితుల యభిప్రాయము. అనగా నన్నయ కవితకు మెఱుగులుబెట్టిన తిక్కన కవితవలె పెద్దన కవితకు నరసింహకవి కవిత మెఱుగులు బెట్టుచున్నదని తాత్పర్యము. అయినను కవులలో దాదాపు సములైనవారిలో నెవ రధికులని నిర్ధారణగా చెప్పుటకు సాధ్యపడదు. ఉదాహరణకు : కథా రమణీయతకు పెద్దన పెద్ద; శ్లేషకు భట్టుమూర్తి మిన్న; ప్రౌఢ భావములకు కృష్ణరాయ లధికుడు; వర్ణనా చమత్కారమునకు సంకుశాల కవి శిరోమణి ; అద్భుత కల్పనాశక్తికి పింగళి సూరన అందెవేసినచేయి. అందుచేత తారతమ్యతనెంచి యొకనికే పట్టాభిషేకము గట్టజూచుట భావ్యముగాదు.

ఈ గ్రంథమున మనము కవిత్రయ కవితా ప్రభావము తదుత్తరాంధ్ర కవులపై నెంతవరకు ప్రసరించియున్నదను విషయమే ప్రధాన మగుటచేత నా యా కవుల పరస్పర తారతమ్యమును చర్చించుట

యుపస్థితమగును. వారిలో నెవ రెంతవరకు కవిత్రయ లక్షణము లను గ్రహించిరో యంతమాత్రమే సూచింపవలసి యుండుట చేతను ఈ ప్రబంధ కవుల కవిత్వ గుణ విభేద విమర్శనకు బూనలేదు. ఈ పుస్త కమున నిదివరకే కొలదిమీరి కొంత భేదసరణి స్పృశింపబడినది. గావున ప్రబంధ కవుల పోకడలు స్థాలీ పులాక న్యాయమాత్రము చెప్ప బడును. కవిత్రయ ప్రభావ మీతనిమీద లేనట్లున్నది.

## కృష్ణదేవరాయలు

ప్రబంధకవి తల్లజుడని చెప్పబడిన కృష్ణదేవరాయల "ఆముక్త మాల్యద" ను పరికింతము. ఈ రాజకవి కవితలో స్వభావ వర్ణనలు తక్కిన కవులకంటె మిక్కిలి యెక్కువగా నున్నవి. ద్రవిడాంగనలను స్వభావసిద్ధముగా వర్ణించినట్లు తోచును. చాలా రసవంతములై, యుచితములైన పదప్రయోగములు గలవు. మఱియు నీతని కావ్య మున ఋతులు, శాలిపాలికలు, వరిమళ్లు, పరిగపిట్టలు, కాల్వలు, గట్లు మున్నగు కర్షకజన సాంప్రదాయముల రీతులు చక్కగా వర్ణింపబడినవి. పాకము నారికేళము. అపురూపములగు పదములు ప్రయోగింపబడినవి. రాజధర్మముల తెలుంగులు మాత్రము తిక్కన భారతమును బోలి యున్నవి.

## పింగళసూరన

ఇక ప్రబంధ కవులలో పింగళ సూరన ప్రముఖు డనవచ్చును. ఈ కవి కవిత్వము సమీచీనముగా తిక్కన కవిత్వమునకు సాటిగా నుండునని చెప్పదగును. కవి చరిత్రకారులేమి తదితర విమర్శకా గ్రేసరు లేమి, సూరనార్యునకు తిక్కన తరువాత నగ్రస్థాన మిచ్చినారు. "కవిత్వ తత్త్వ విచారము" వ్రాసిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారు, ఆంగ్లాంధ్ర భాషాకోవిదుడు, బహుళాంగ్ల గ్రంథపాఠి, విమర్శనా

చతురుడు. ఈ చతురశాలి పింగళి సూరకవి కావ్యముల గుణ దోష ములంగూర్చి సమగ్రి విమర్శన చేయుచు, కవితత్వము పరిశీలించి, షేక్స్పియర్ నాటక వైభవమును, తదితరాంగ్ల కవుల పోకడలు స్మరణకు దెచ్చుకొని, ఆంధ్రాంగ్ల కవిత్వ వైఖరుల విభేదము తిలకించి పింగళి సూరనగారికి మహోన్నతస్థాన మర్పించియున్నారు. సూరనగారి కావ్యములలో నెల్ల కళా పూర్ణోదయమునకు ప్రిథమగౌరవ మిచ్చిరి. వీరు సూరనకు తిక్కనకు ప్రక్కనే పీఠ మిచ్చుటచేత తిక్కనతో పోటీ చేయగల్గిన కవి యీ సూరన యొకడే యని స్ఫురించుచున్నది.

పాత్ర పోషణమందును, కథా వైశద్యమునందును, అర్థసార స్యము కల్పించుట యందును, కల్పనాచాకచక్యము నందును, రమా రమి తిక్కనతో నీకవి యీడని రామలింగారెడ్డిగారి యభిప్రాయము. భావనాశక్తి నిరర్గళముగా ప్రవహింపజేసి, పాండిత్యబలము దానికి దోహద మొనర్చినాడు. సూరనార్యుడు ఆంధ్రమున కళా పూర్ణోదయ మసదృశకావ్యరత్నమని పదే పదే వక్కాణించినారు రామలింగారెడ్డి గారు. ఈ కారణముచేత తిక్కన సోమయాజిగారి కవితా ప్రభావ మీ సూరనార్యునిపై నెంతవరకున్నదో పరికించుట మన పని.

తిక్కనతోపాటు నన్నయను మఱువలేము. కవిత్రయమును మాత్రిమే కళా పూర్ణోదయమున స్తుతించియున్నా డీకవి. అల్లే పెద్దన సయితము తెలుగు కవులలో కవిత్రయమును మాత్రమే ప్రశంసించి యున్నాడు. భాస్కర, సోమ, శ్రీనాథాదులగు సుప్రిసిద్ధ కవుల నెవ్వ రిని ప్రిస్తావించి యుండనందున పెద్దన, సూరనాటి కవులకు కవిత్రియ మందే గౌరవము సూచించుచున్నది.

కళా పూర్ణోదయమున సూరనకవి మణి కంధరుని తపోవన మభివర్ణించి యున్నాడు. ఈ వర్ణనము భారతమున నన్నయభట్టుగారు కణ్వాశ్రిమమును వర్ణించినట్లున్నది. చూడుడు :

నన్నయగారు :

సీ॥ శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువు దగిలి
కదలక వినుచుండు కరులును గరికర
శీతలచ్ఛాయ, దచ్ఛీకరాంబు
కణముల చల్లని గాడ్పునపడి వాని
జెంది సుఖంబున్న సింహములును
భూసుర ప్రవరులు, భూత బలుల్ దెచ్చి
పెట్ట నీవారన్న పిండతతులు
కడగి భక్షింప నొక్కట కలసి యాడు
చున్న యెలుగులు, పిల్లులు, నొండు సహజ
వైరి వర్గంబులయ్యు సహవాస మపుడు
జూచి ముని శక్తి కెంతయు చోద్యమంది॥

సూరనయు నిట్లే :

సీ॥ ఆవులు నాక కన్నరమోద్చు పులులును
పులుల చన్గుడువంగ బోవు లేళ్లు
లేళ్ల చెల్లాట రంజిల్లెడు హరులును
హరుల గోళ్లను గోక నలరు కరులు
కరుల కటారివైఖరి నాడు పాములు
పాముల బాలించు బభ్రుతతులు
బభ్రుతతుల ప్రక్కబాయని యెలుకలు
యెలుకల బెంచు పిల్లులును గలిగి.......

అని భావములు, శైలియు ననుకరించి యున్నాడు. ఈ యను సరళిగూర్చి చెప్పుటకుముందు సూరనార్యునిగూర్చి కొంద రితర విమర్శకుల యభిప్రాయము చెప్ప దలంచెద. ఒక విమర్శక మహాశయు డిట్లు నుడివెను :

" తిక్కన పోతనల తర్వాత మహా కవి పదమున జేరదగిన వాడు పింగళి సూరన. తిక్కన తఱువాత నింతప్రౌఢముగా కవిత్వము చెప్పిన కవి మఱియొక్కడు లేడు. కావ్యరచనమునందు తిక్కనవలె

సర్వతోముఖ చాతుర్య మీతనికి గలదు. ద్రాక్షాపాకము, నాతి కఠిన మృదుమధుర శైలి, చిత్రకల్పనా చాతుర్యము గలదు."

ఈ మహాకవినిగూర్చి యితర విమర్శకులకు స్ఫురించిన గుణములు మాత్రమే యీ విమర్శకుడుకూడ సూచించెను. సర్వతోముఖ శక్తి నందరును చూడజాలరు.

సూరనకవి యెంత స్వతంత్రముగా కవితావైఖరులను చూపినను, తిక్కననే యొరవడిగా గైకొన్నను శ్రీనాథాదికవుల రీతుల ననుసరింప లేదనుటకు వీలు లేదు. తమ తమ కృతులలో కృతినాయకుల వంశాభివర్ణనలు జేయుచోట్ల తక్కిన కవులవలెనే యీ కవియును శ్రీనాథుని పోకడలు చూపెను. కేతన మారనాది పూర్వకవులలో సైతము కృతినాథ వంశాభివర్ణన లున్నను శ్రీనాథుని పద్యములవలె నిగ్గుదేలిన, సవిభక్తమైన సీసపాదములతో నుద్దండమైన స్తోత్రములతో సమాసముల తీవితో నవి వ్రాయబడలేదు. ఇట్టి వంశాభి వర్ణనావైఖరులు శ్రీనాథునితోడనే పుట్టిన వనవచ్చును. కృతినాయక వర్ణనా సందర్భమున శ్రీనాథుని నైషధములోని:

సీ॥ "అనవద్య హృద్య విద్యా బుద్ధి సంసిద్ధి
బిసరుహాసను నుద్ది పెద్దవిభుడు"........ వలె

సీ॥ మందార మందాత్మసంధాయి దాన ప్ర
సిద్ధుండు సింగన క్షితివరుండు
గర్వితారాతి దోర్గర్వ నిర్వాపణో
ద్దీర్ణుండు నార ధాత్రీవిభుండు........

అని సూరన వ్రాసెను. ఇట్లె యితర పద్యములు గలవు. రామలింగారెడ్డిగారు కళా. పూర్ణోదయ పీఠికలో దెల్పినవిచారము మన కందరికిని గలుగుచున్నది. మహాపండితులు, మహాకవులు, ధర్మాధర్మ విచక్షణసేయగల్గి భాషాసేవ స్వచ్ఛందముగా నిరంకుశముగా చేయగలిగినవారు ఘోర దరిద్రతా బాధ పడలేక, ధనికులనో, రాజులనో భూతశయించి వారి గుణములను గోరంతలు, కొండంతలుగా జేసి,

పొగడి దోషములు సయితము గుణములుగా నుత్ప్రేక్షములతో నభి వర్ణించి తమ కుటుంబపోషణ చేసుకొనవలసిన వారైనందున వారికి మెప్పుగలుగునట్లు కావ్యములు వ్రాయక తప్పినదికాదు. రాజాశ్రయా వసరముచేతనే శ్రీనాథుని యద్భుత కవితాశక్తిలో సగము కృతినా యక వంశాభివర్ణనలతో వ్యయమైపోయినది. అట్లే తమకావ్యముల నరాంకితము చేసిన వారికెల్లరకు నట్టిదుర్గతియే పట్టినది. పీరు వారన నేల తిక్కన సయితము తన నిర్వచనోత్తర రామాయణమున మను మసిద్ధిని స్తోత్రము చేయక తప్పలేదు. పోతనవంటి మహా భక్తులైన కవుల కెవ్వరికో యట్టిదురవస్థ తప్పినది. అయినను చెప్పదలచిన దేమ నగా రాజులను, ధనికులను వర్ణించుటకు వానొనర్చిన మహాకార్యములు లేకున్నను, సద్గుణములు శూన్యమైనను, సకల దురాగత ప్రవర్తకులై యున్న వారైనను వారినే యింద్రులుగాను, చంద్రులుగాను పొగ డుటచేతను, ఈనేకవిధమైన భావములు, శబ్దములు, కవితారీతులు చూపవలసివచ్చి గతానుగతికముగా కవులెల్లరు నాయకప్రశంస సంద ర్భమున యొకరి నొక రనుకరించిరి.

పింగళి సూరన రచించిన ముఖ్య గ్రంథములలో కళాపూర్ణోద యము, రాఘవ పాండవీయము, ప్రభావతీ ప్రద్యుమ్నము. అందు రాఘవ పాండవీయము శ్లేష కావ్యము. అఖండ పాండితీ వైశద్యము చూప బడినది. రెండవది, కళాపూర్ణోదయము. అనల్ప కల్పనా చాతురి ప్రద ర్శింపబడియున్నది. మూడవది, ప్రభావతీ ప్రద్యుమ్నము. దీనియందు అద్భుత ప్రతిభా విశేషము, పాత్రపోషణ మున్నగునవి కళాపూర్ణో దయమందు వలెనే హృద్యముగా నుండును.

ఈచివరి కావ్యములో "శుచిముఖి" యను చిలుకను రాయ బారిగా కల్పించి మిక్కిలి చతురతతో కథ నడపినాడు. భారతమున నల దమయంతుల మధ్య హంస రాయబారము, పాండవ కౌరవులమధ్య కృష్ణరాయబారము భంగి, యీ చిలుక రాయబారము, పై రెండు రాయబారములకంటె యెక్కువ తెలివి తేటలతో సాగింపబడినది.

ఈకవి నెఱపిన రాయబార మత్యంత చమత్కారముగానున్నది. ఈ మహా కవి కళా పూర్ణోదయమునగాని, ప్రభావతీ ప్రద్యుమ్నమున గాని నడపిన కథలు చదువునపుడు పాఠకుని కుతూహల మంతకంతకు పెరుగుచుండునుగాని విసుగుపుట్టింపదు. మధ్య నొక క్లిష్ట సమస్య యంకు రించును. దానిని విడదీసి తగినసమాధానము మనకు తోచదు. తెలుసు కొనవలె నను నాతురత మాత్రము పోదు. కవి తానే చెప్పవలసిన ట్లుండును. త్వరగా చెప్పడు. మెల్ల మెల్లగా సూచించుచు తుదకు చెప్పును. మనకు సంతుష్టి సంతోషము గల్గుచుండగా నింకొక సందిగ్ధ సూచన కల్పించును. దీనిని తెలిసికొనుటకు కుతూహల ముప్పతిల్లును. ఈవిధముగా కథాంతమగువరకు మనకు తృప్తికలుగదు. ఇట్టి చతుర కల్పనము పై దెల్పిన రెండు కావ్యములలోనుజేసి యద్భుత రచనా విలాసము ప్రదర్శించినా డీ కవి. ఈ కల్పనాచతురత తిక్కన్నకు దక్క మఱియేయితర కవికిని లేదని రసజ్ఞుల యభిప్రాయము. ఈ కవిరచనలో నింకొక విశేషమున్నది. పాత్రలు నాటకములలోని పాత్రలవలె చూప బడును. సంభాషణగా ముఖాముఖి మాట్లాడుచున్నట్లే యుండును. ఈ ఫక్కినే భారతమున తిక్కన సోమయాజి యవలంబించియుండెను. ఇట్టి పోకడలు చదువు వారికి మిక్కిలి మనోహరముగా దోచునుగదా! ఈ సూరనార్యునకు సంస్కృతాంధ్రముల రెంటను కూలంకష ప్రజ్ఞ, సాహితికల వాడగుటచేత యే సందర్భమున నెట్టి పదము లుచితమో నీతనికి తెలియును. సూరన ప్రతిభ కొక దృష్టాంతరము చూడుడు. ఒకపద్యము మొదటినుండి చదివిన తెలుగు పద్యమగును. చివరినుండి చదివిన యెడల సంస్కృత పద్యమగును. కళాపూర్ణోదయ షష్టా శ్వాసమున:

కం॥ తా వినువారికి సరవి గ
భావనతోనాను నతి విభావి సుతే జా
దేవరగౌరవ మహి మన
మా వలసిన కవితమరగి మాకు నధీశా ॥

అను పద్యము గాంచిన యాతని ప్రతిభ తెలియును.

అట్లే—

కం|| మా య మ్మా న సు నీ తే
రా య ల పై కా వ దే వ రా జే జే జే
మా యా తు మ ల లా ని న య ది
పా య క సం తో ష ము న్న ప ల మి ల సా మి ||

ఈ పద్యములోని పదము లౌక విధముగా విభజించినచో తెలుగగును. మఱియొక రీతి పదవిభాగము చేసినచో సంస్కృత పద్యమగును. ఈ విషయము నితని యుభయభాషా ప్రతిభ చూపుటకే తెలుపబడినది. ఇట్టి రచనలు రసపోషణకు గాని, అర్థసారస్యమునకు గాని, కథకుగానితోడ్పడవు. భారత కవిత్రయమున కీవిధ కవితారీతులు గిట్టవు. పైనదెల్పినట్లు ధనాభావము చేత కృతికర్తల వినోదపరచి మెప్పొందుటకే యిట్టిపోకడల కీ కవి పాల్పడినాడు.

కాని కథా ప్రవచనము చేయుపట్ల సూరనకవి తిక్కన కవనపు తెఱంగులు తురంగలింపజేసియున్నాడు. సీసముల సొంపుచూపుటలో తిక్కన భారతమునందలి—

సీ|| అభినవ జలధర శ్యామంబు లగు నెడ
లాకు జొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపల చ్ఛాయంబు లగు పట్ల
కిసలయోత్కరముల గ్రేణసేయ........

అను పద్యపు నడకతో సూరన కళా పూర్ణోదయమున—

సీ|| నవ పుష్పవనమున నానా మణుల్ గ్రచ్చి
పచ్చపట్టుకఛాయ బాగు నెఱప
ధాతుస్థలంబు లాతత కుంకుమాంగరా
గ ప్రకారంబున గానుపింప........

అను పద్యము రచించెను. ముఖాముఖి సంభాషణ సాగించి నట్లే యితని పద్యములు తిక్కన ననుకరించి నట్లుండునని మీదనే దెల్పి యుంటిని.

కం॥ సవతియన నింక నొకతెన్
భువిలోపల వేరె వెదుకఁబోవలయునె యో
ధవళాక్షి నీవ కానే
రవె దైవ నియుక్తి గొంత ప్రాప్తి గలిగినన్॥

గీ॥ అదియు వింటివిగద యని యనియ దేని
యేను వినినట్టిపిమ్మట నిట్టి మాట
పలికె నొక్క యమోఘ వాగ్విలసనుండు
కావున వచింప విన నిక గాదు నాకు॥

ఈ గతి సులభ సంభాషణారూప రచన భారతమునం దెంతయో గలదు. కథ సాగించుటలో తిక్కన రచనవలెనే పద్యములు వచనముల భంగి దొర్లిపోవుచు రసవంతములై కథావైశద్యమును జూపుచు హృద్యముగా నుండును. మధుర సంభాషణము ప్రభావతీ ప్రద్యుమ్నమున మఱింత స్ఫుటముగా కనుపించుచుండును. వర్ణనము చేయుచో రూపచిత్రమును కుంచెతో చిత్రించినట్లు మనోహరముగా నుండును. ప్రద్యుమ్నుని రూపచిత్రము ప్రభావతి చూచుపట్లచిత్రము-

చం॥ కలకల నవ్వినట్లు తెలిగన్నుల నిక్కముజూచినట్లు లో
పలుకఁ గడంగినట్లు, కడుభావగభీరత లబ్బినట్లు, పెం
పొలయదనర్చి జీవకళ యుట్టిపడన్, శిల్పవ్రాసినట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింప తలంకెను తాను బోటియున్ ॥

ఈ॥ చిత్తరువన్న నిశ్చయముచే నెదురుండి మొగంబు జాడ మెం
మెత్తుసు, సత్యపుంభ్రమ సమృద్ధినిగ్రమ్మ్రఱు దక్షిణాంబలో
నొత్తుచు తత్తరంబు త్రపయున్ మగుడంగ నిరీక్షణేచ్ఛ బో
మొత్తును భర్తచూపు దనుమోచుట దోచిన నోసరిల్లుచున్ ॥

చిత్రించిన యిట్టి పద్యములు తిక్కన శిల్పఖండములని చెప్పక తప్పదు. పాండిత్య ప్రకర్ష చూపుటకై రచించిన పద్యములుగాక తక్కిన కవితాభాగ మంతయు సోమయాజిగారి యనుకరణమే. రాఘవ పాండవీయమును సులభముగా, సరసముగా రచింపగలిగిన యీ కవి శ్లేషలనుగూర్చి వేరుగ చెప్పనక్కరలేదు.

గీ ॥ ఎందుఁ జేటరారె యితరు లేమనసుతో
దారసంగసుఖము తప్పదోఁచి
తకట, పాండురాజ యశ మెన్నవైతివి
క్రూరదశ, రథేశకులము రోయ ॥

భారత రామాయణార్థములు పై పద్యమున పదవిభాగ మాత్ర మున నే వేరు వేరు దోచునట్లు, అత్యంత సరసముగా శ్లేషకావ్యము రచించినాడు. పురాణకవు లెవ్వరు యీ విధముగా వ్రాయలేదు.

## నంది తిమ్మన

ద్రాక్షాపాకముతో కావ్యము రచించిన కవి నంది తిమ్మన యొకడున్నాడు. పోతరాజుగారి పిమ్మట మృదుమధుర మ్మైన పదములతో రసవంతముగా కవిత నల్లినవారు తెలుగు కవులలో మఱి యెవ్వరును లేరు. అల్లసాని పెద్దన తరువాత నీకవికే కృష్ణదేవరాయల యాస్థానములో నధిక గౌరవము గల్గియుండెనట. "ముక్కు తిమ్మ నార్య ముద్దుపలుకు లనియును", "గగనధునీశీకరములచెమ్మ నంది సింగయ తిమ్మా" అనియు, నీకవి లలిత పదప్రయోగములచే నల్ల బడిన మృదుశైలినిగూర్చి చెప్పబడెను.

ఈతని పాత్ర పోషణాకౌశలము అద్భుతము. కథావేగము రమణీయముగా నుండును. ఉచిత పదప్రయోగశక్తి తిక్కన బోలును. శ్రుతి కటువుదోచు పదము లంతగా నీకని కవిత్వమున గానుపింపవు. పటాటోపము లేక సరళముగా, సహజముగా కథాప్రసంగము సాగించు చుండును. పెద్దనకృత మనుచరిత్రలోని మొదటి మూడాశ్వాసముల వలె తిమ్మన రచిత పారిజాతాపహరణ కావ్యమున మొదటి రెండు మూడాశ్వాసములు మాత్రమే మిక్కిలి రసోదంచితములుగ నుం డును. పోను పోను యిరువుర కావ్యములందును రసము తగ్గిపోయినది. యేకబిగువున మొదటనుండియు తుదివరకు నొకే తెఱంగున రసవం తముగా రచించుట యొక తిక్కనకే సాధ్యమైన దందురు. ఈతని

రచనాశోభ చూపుటకీ క్రింది పద్యములే చాలును. తిక్కనవలె పొడి పొడి మాటల పొందిక గననగు పద్యములు కొన్నికలవు :

ఉ॥ అందరిలోనపెద్ద, మహిమాన్విత, రుక్మిణిగాన పూవు గో
విందుడు దాని కిచ్చె తగవే యని లక్షణయోర్చె, సైచె కా
ళింది, శమించె భద్ర అవులెమ్మని యూరడిలె స్సుదంత లో
గుందుటమానె జాంబవతి కోపమడంచెను మిత్రవిందయున్ ॥

చం॥ ఎను భవదీయదాసుని మనంబున నెయ్యపు కిన్కబూని తా
చిన యది నాకుమన్ననయ చెల్వగు నీపద పల్లవంబు మ
త్తను పులకాగ్రకంటక వితానముసోకిన నొచ్చెనంచు నే
నని యెద నల్కమానవుగదా యికనైన నరాళకుంతలా ॥

మఱియు నీతని కవితలో సరసభావములు, ధ్వనులుకూడ కొన్ని కొన్నిచోట్ల సొబబుగా దోచును.

ఈశ్వర రాజును వర్ణించుచు :

ఉ॥ తామసవృత్తి లేదు సతతంబును నుగ్రుడు గాడు పౌరుషం
బేమియు వెల్తి గాదు తనకెందునుబై మఱిరాజు లేడు సం
గ్రామములోన నొక్కనరుగాసికి వాసి దొరంగ డీ శ్వర
క్ష్మామహిళామనోహరుని సాటిరె యీశ్వరు డెన్నిభంగులన్ ॥

చం॥ మునుకొని కొండవీటికడ మూఢత రుద్రుడు కృష్ణనందనున్
మనసిజునిం జయించె నది మానుషమే నరనేంద్ర కృష్ణ రా
య నృపతి కొండవీటికడ నాహవభూమి ప్రతాపరుద్ర నం
దనుడగు వీరభద్రు గరుణామతి గాచె జగత్ప్రసిద్ధిగన్ ॥

అతి లలితములైన భావములతో, మృదు పదములతో, మధుర మగు శైలితో పాఠకుల కర్ణరసాయనమై, హాయి హాయి యనిపించు, నీ తిమ్మనకవి నిరుపమాన మంజుల ధారకు చొక్కని చదువరి యుండడు. కథయు నత్యంతాకర్షణీయముగా గూర్చినా డీకవి. వర్ణనా భాగములును మిక్కిలి మనోహరముగా నుండును.

కవిత్రయ ధోరణికి విరుద్ధముగా నీ కవియును, కాలాను సారముగా రాజులకు వినోదము గల్గించు తలంపుతోడనో, లేక తన పాం

డిత్య సమగ్రత జూపు తలంపుతోనో గుణితక్రమ, పాదభ్రమక, పద్య భ్రమక, చక్రబంధాది పద్య రచన లొనర్చి చతుర్విధ కవితాశక్తిని జూపియున్నాడు:

మ॥ శరధిక్రోడ నివేశ, శార్ఙ్గధర, శిష్టధ్యేయ శీతాంశు భా
స్కర నేత్రద్వయ, శుభ్రపంక రుహ భాస్వన్నాభ, శూరాన్వయా
భరణా శేషశయాన; శైలధర. శోభారమ్య సర్వాంగ, శౌ
ర్య రసోదంచిత, శంఖచక్రయుత, శార్వాణీ సహాయ ప్రియా॥

గుణితక్రమమున కుదాహరణము. ఈతనిచూచియే శాబోలు సూరన కవియును రసోదంచితమగు తనకావ్యమునందు అందందు యిట్టి రసాభాస పద్యముల చేర్చియున్నాడు.

మొత్తముమీద పోతరాజుకృత భాగవతమును చదివిన మధ్యయుగ కవులందరు రసౌచిత్రి, కథా రచన నంతిగా పరిగణింపక, ఆకాలమున సుప్రసిద్ధులయిన, శ్రీనాథ, పోతరాజులలో నొకరిని తమ కొజ్జబంతిగా గ్రహించి కొందఱు శ్రీనాథునివలెను, కొందఱు పోతనవలెను తమ తమ రచనల సాగించిరి. సూరన, తెనాలి రామకృష్ణులు గాక తక్కిన వా రందరు నీ తరగతికి చెందినవారే.

## మడికి సింగన

నంది తిమ్మనాది కవులకు ముందే యుండి ప్రసిద్ధుడైన మఱియొక కవినిగూర్చి యొక్కింత చెప్పవలసియున్నది. ఈ కవి భాగవత షష్ఠస్కంధము, నూతన గ్రంథమైనట్లు ప్రత్యేకముగా కృత్యాద్యవస్థ, షష్ఠ్యంతములతో సహా వ్రాసియున్నాడు. ఈ కవి తిక్కన వంశము లోని వాడని చెప్పుదురు. ఈ కవి భాగవతభాగ పూరణమేగాక వాశిష్ఠ రామాయణమను నొక గ్రంథమును రచించియున్నాడు. ఆ గ్రంథముకూడ భాగవతమువలెనే యనువాదమైయున్నది. జ్ఞాన వాశిష్ఠమను సంస్కృత గ్రంథమున కనువాదము. కవిత్వము ప్రౌఢమై సరసమై యున్నది. అనర్గళధారతో గూడి యున్నది. పూర్వ కవితా

శిల్పముతో నలరారుచుండును. ఈ కవి తన యనువాదమును భాగవతమున నేమి, రామాయణమున నేమి, కవిత్రయమువారి ననుసరించినాడు. పద్మపురాణమునం దుత్తర భాగముకూడ నీ కవి యాంధ్రీకరించెను. ఈ కవి రామాయణమునందు నడక, ధార, భారతమును తలపించుచుండును. శబ్ద సరళత భాగవతమును ననుసరించి పోతనామాత్యుని దలపించుచుండును. పోతనవలె సమాసాంతయమకము నచ్చ టచ్చట విసిరినవాడే. పోతన సౌకుమార్యము సింగన్న కవితలో తక్కువ యనవచ్చును. మచ్చునకు :

ఉ ॥ ఆ తరుణీలలామయు ప్రియంబున వేచని గాంచె నాజగ
త్ఖ్యాతము, నక్షయార్తి పరిభూతి విధాన సమర్థ సత్ఫల
వ్రాతము నవ్య పుష్ప మకరంద విలోలుప మత్తషట్పదో
పేతము, దత్త నిర్జరసమీహిత జాతము, పారిజాతముక్ ॥

భారతమునందువలె :

ఆ రాజన్య లుదగ్రు లుగ్రగతి నన్యోన్య ప్ర
హారోదార్థులై, వీరానీకము పిచ్చలింపగ భుజా
వీర్యం బవార్యంబుగా క్రూరాస్త్రంబుల
నొండొరుం బొదివి దిక్కుల్ వ్రయ్య పెల్చార్చుచున్........

అతుల తపస్స్వాధ్యాయ
వ్రత శీలుండు బోధనిధి భరద్వాజుడు వి
శ్రుతకీర్తి యొక్కనా డే
కతమున వాల్మీకి మౌని గని సంప్రీతిన్ ॥

అని కవిత రచించెను. ఈ కవి యనువాదపద్ధతి కవిత్రయము వారివలె మూలమును సంగ్రహపఱచెను.

తిక్కన కవిత్వమునం దభిమాన మీ కవికి యధికముగా నుండుట సహజము గదా? తిక్కన మనుమరాలికి మనుమ డీ కవి యట. తిక్కన నిర్వచన రామాయణమున నే గాక భారతమునందు నయుతము వ్రాసిన :

మ॥ కలగెం దోయధి సప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్రి సన్నాడె కొం
దల మందెన్ త్రిదశేంద్రి పట్టణము, పాతాళంబు సూన్నల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకావలము సంక్షోభించె నవ్వేళయున్॥

అను పద్యమును చూచి మడికి సింగన.

ఉ॥ కూడె జగంబు లన్నియును గ్రుంకిరి సూర్య సుధాంశు లద్రు లూ
టాడె నభస్థలం బగిలె నంబుధు లింకె, నుడు గ్రహాళి ప
ట్టూడె వడిన్ దిశల్ పగిలె, నుర్వర గ్రుంగె, నజాండభాండ మ
ల్లాడె, విధాత బెగ్గడిలె నార్చుచు వృత్రుదు బొబ్బ పెట్టినన్॥

రచించెను. ఈ కవి తన వంశీయ సంప్రదాయమని యెంచి కాబోలు తిక్కన సోమయాజికివలె స్వప్న గాధ గూర్చినాడు. తిక్కనకు హరిహర నాథస్వామియును, తండ్రియగు కేతనయు కలలో గనుపింపగా నీ సింగనకు దివ్యవాణి సాక్షాత్కరించి—

" నా చాటున జాటుకారపద సాధుకవిత్వము జెప్ప మింపుగన్ " అని చెప్పెనట. ఆ జగన్మాత కృపావలోకన సుశ్లోకుడైన సింగనకు యీ క్రింది శ్లోకము నోట వచ్చెనట :

శ్లో॥ హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రియాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్సంగ్రహాయ సుగుణాయ సదీశ్వరాయ
సంపూర్ణ పుణ్యపతయే హరయే నమస్తే॥

ఈ శ్లోక మా దేవి యంగీకరించెనట. అంత నీ కవి భాగవత రచన కృష్ణాంకితముగా ప్రారంభించెనట.

ఈ కవిని గూర్చి ప్రబంధకవులగు పెద్దనాదులకు పూర్వమే వ్రాయుట యుక్తముగా నుండెడిది. పెద్దనాది కవులకు పూర్వుడై యున్నాడు.

## తెనాలి రామకృష్ణ కవి

ఈ కవినిగూర్చి ముచ్చటించిన తరువాత పురాణ కావ్య ప్రబంధ కవు లందరి రీతులతో నత్యంత ప్రౌఢముగా కవిత్వము జెప్పిన మఱి యొక మహా కవి తెనాలి రామకృష్ణుడు. ఈ కవి పేరు రామలింగమని కూడ కలదు. ఈతని పేరు విననివారు తెలుగు దేశముననేగాక తమిళ దేశముననూడ లేరు. ఈ కవిని "వికటకవి" యని యందురు కాని కవిత్వమున వికటసరణి యేమియు కనుపింపదు. ఈ కవి కావ్యములలో ప్రసిద్ధమై ప్రధానమైనది "పాండురంగ మహాత్మ్యము." స్కంధపురాణాంతర్గతమైన పండరీనాథ క్షేత్ర మహిమ కథావిషయము. కాని భారతాది గ్రంథముల చొప్పున చేయబడిన యనువాదగ్రంథముగా చదువువారికి తోచదు. అయ్యది యొకస్వతంత్ర గ్రంథముగా నున్నది. కథావైశద్యము గలదు. అర్థస్వారస్యము కలదు. ఉచితపాత్ర పోషణానైపుణ్యమును గలదు, అందుచేత నన్నయ తిక్కనాదుల సరణి దోచును. ఈ కవి తెలుగు పదముల ఔచిత్యము విడనాడక వాడినాడు. పాత్రపోషణ, పాత్రౌచితీ వర్ణనలు తిక్కనవలె చూపినాడు కాని రచనా విశేషమునకు నాచన సోమనాథుని, శ్రీనాథుని, తనయెదుట బెట్టుకొని యుండెను. ఈకవి శివభక్తుడు. వైష్ణవ గురు గౌరవము గలవాడు. భక్తిరసము పోతనామాత్యునివలె నచ్చ టచ్చట జూపదలచెను. గాని పదలాలిత్యము భక్తి రసముపట్టున సయితము ప్రబంధ పాకసరణి జూపెను. కావ్యమెంతరసవంతమైనదైనను సామాన్యప్రజలను రంజింప జేయదు. భక్తిరసమును జూపు పుణ్యక్షేత్రపురాణమై యున్నను, సర్వజనారాధ్యుడైన శ్రీ పాండురంగస్వామి మహిమాను వర్ణనలతో నిండి యున్నను దురవగాహమైన వర్ణనాపటిమ ప్రబంధముల కీవి మిక్కుటముగా నుండుటచేతనే యెవరును చదువరు. ఈకవి ఆముక్తమాల్యద, కాశీఖండ, నైషధకావ్యముల కవితారీతుల గ్రహించి పైన దెల్పినట్లు సోమన, శ్రీనాథుల జూచుచు తన గంటమును సాగించెను. లోకోక్తులు, నానుడులు, జిగివి, బిగువులుగల దేశ్యపదములు చదువ సొంపుగా నుండును. భాషాజ్ఞానము గల్గిన పాఠకులుమాత్రమే శ్రద్ధతో నిదాన

ముగా ఆలోచనచేయుచు, శబ్దార్థ సారస్యముల పరిశీలించుచు చదువ వలసిన కావ్యమేగాని సామాన్య కాలక్షేపమునకై చదువతగినది కాదు. తెలుగున పంచకావ్యములని చెప్పబడు మను, వసు చరిత్రలు, విష్ణుచిత్తీయము, నైషధములతో బాటు పాండురంగ మహాత్మ్య మొకటి. "పాండురంగ విభుని పద గుంభనంబును" అని ప్రసిద్ధిగలదు. ఒక విమర్శకు డితనింగూర్చి నుడువుచు:

"పురాణయుగము ప్రబంధయుగముతో బోల్చిచూచిన యెడల పెద్దనను నన్నయతోను, కృష్ణరాయలను ప్రబంధ పరమేశ్వరుని తోను, పింగల సూరనార్యుని తిక్కనతోను, రామకృష్ణకవిని నాచన సోమనాధునితోను బోల్పవలసియుండును"ని వచించియున్నాడు. కాని రామకృష్ణకవి కవిత కొక ప్రత్యేకతగలదు. ఈతని భావము లొక విల క్షణమైన నడకతో గమనించుచుండును. చమత్కారమైన లోకోక్తులు వినుట కొక క్రొత్త ప్రయోగ పంథా కనుపించును. ఏ యితర కవి ధోరణి యిత డవలంబింపడు. "మురారీ తృతీయః పంథాః" అను నట్లుండును. సంస్కృత పదముల వాడుకకూడ నందందు నందమై చిత్ర ముగా నుండును: జీవత్తాత పాదుడు; నమోవాకము; భ్రమరకీటన్యా యము; ఛత్రితశేష; వాసోనిగ్రహత; ఏకతానతాయుతుడు; స్నవన వచన— ఇత్యాది సంస్కృత పదములు ప్రయోగించెను. అట్లే: జాయవెన్నెల; పాయసత్రెము; తప్పిదారి; తెలనాకులు; ఆప్రొద్దు పోయి రాజనట్టిని ర్పెద;పిల్లి శీలము; షో గ్నా కుపై తేనె; ఆకుమరుంగుపిందె; కంచంత కాపురము; పాలవంటి కులము— మొదలగు తెలుగు పద ములుకూడ ప్రయోగించెను. ఈకవి స్వార్థపదములను వడిగట్టురాళ్ళుగా యెచ్చటను వేయక, తూచినట్లు లగింపు బిగింపున యెడములేకుండా పదములగూర్చి వ్రాయును: తలలోపల నాలుక; పూసలలో దారము; తేనెపూసిన కత్తి; కంపలబడ్డ కాకి— మున్నగు జాతీయపదము లనే కము లీ కావ్యమున గలవు.

ఈ కవి తెలుగు సొంపు లించుక తిలకింపనగు నీ క్రింది పద్యము లందు :

చం॥ చదువుల పుట్టినిండ్లు, శమసంపద యిక్కలు, పుణ్యలక్ష్మికిన్
మొదలి నివాసముల్, సురసమూహము నాకటిపంట, లంచి తా
భ్యుదయ నిసర్గబంధువులు, ప్రోడితనంబుల తానముల్ పురిం
బొదలెడి భూసురోత్తముల భూరి పవిత్ర శరీర వల్లరుల్॥

ఉ॥ సారథి స్యాందనుండు, బడిసాగడు చక్రియుగంబు ప్రోత్ర పం
చారపు గుఱ్ఱముల్, రథియు శౌర్యమునం దరమానిసాత్మ వి
స్తారము ఖండ ఖండములు తానట మాసరియంచు దత్పురిం
జేరులు నవ్వు శంకరుని తేరి నికేతన కింకిణీ ధ్వనిన్॥

సీ॥ మును మీసగట బట్టి, మునులు వైచిన బత్తి
పటబోలె, జిక్కు మూడల దలిర్ప
వెలితిగా చవిగొన్న. వెన్నముద్దయు బోలె
శంఖంబు వామహస్తమున దనర........

సీ॥ మిసిమింతుడును గాక, వసియించు గుత్తుక
బంటి నీరను ఫుండువంటి చలిని........

ఇతర కవుల కవితలో రంధ్రాన్వేషణ చేయు స్వభావముగల వాడగుటచేతను, పరులు తన కవిత్వమున తప్పులెన్నుదు రేమోయను సందియముకొన్ను, తన కావ్యమును దోషరహితముగా జేయు తలంపుగల్గి మిక్కిలి జా[illegible] ప్రతి పదము తూచి వాడినట్లు పాఠకులకు దోచును. పూర్వకవుల నాదర్శముగా తీసుకొని యితరకవులు తమ కైత నలవఱచుకొన్నట్లు రామకృష్ణకవి ననుసరించిన తదనంతర కవు లెవ్వరును లేరు.

## వెన్నెలకంటి సూరన

ప్రబంధకవుల కాలమునకు చెందియున్నను, ప్రబంధపాక మవలంబించినను కొందఱు కవులు పూర్వకవులవలె సంస్కృతమున వ్రాయబడిన పురాణములు తెలిగించుచు పూర్వరీతులగైకొని వానికి

తమపాండితీగరిమ చూపు ప్రాబంధిక వర్ణనలు పొందుపరచి వ్రాసిరి. వారిలో నెన్నదగినవారు వెన్నెలగంటి సూరన్నగారొకరు. ఈ కవి విష్ణుపురాణము నాంధ్రీకరించెను. ఈతడు తన కవిత్వమును నన్నయ వలెను, ప్రధానముగా, బమ్మెర పోతనామాత్యునివలెను, మధురపద గుంభిత మొనర్చి చదువువారికి కర్ణరసాయనముగా నుండునట్లు వ్రాసి యున్నాడు. శైలి లలితముగా ద్రాక్షా పాకమున వ్రాయబడినది. ఎఱ్ఱనవలె కొంత ధారావేగమున్నను గంభీరత ప్రౌఢిమ తగ్గియుం డును. అయినను సూరనకు ఎఱ్ఱన కవిత్వ లక్షణములు చాలావరకు గలవు.

ఇక వరాహపురాణము రచించిన మల్లయ, సింగన కవులు రస వంతమైన కవిత్వము చెప్పగల్గినను కవిత్రయమువారి కవిత ననుస రింపక పోతరాజుగారి ననుసరించి శ్రావ్యముగా యమకాది శబ్దాలం కారములగూర్చి వ్రాసినారు.

## రామరాజభూషణుడు

తరువాత మధ్యకాలమున నత్యంత ప్రసిద్ధుడై యపారసాహితీ విశారదుడై యుత్తమ ప్రబంధముల నల్లిన మహాకవి రామరాజభూష ణుడు. ఈ కవి బహు సమర్థుడు. శ్లేషకావ్యమగు హరిశ్చంద్ర నలో పాఖ్యానమేగాక, ధ్వని, శ్లేష యమకాద్యలంకారములతో దొప్ప దోగు వసుచరిత్ర కావ్యమును రచించెను. ఇతడు లక్షణ గ్రంథమగు నరస భూపాలీయ మను పేర నొప్పు కావ్యాలంకార సంగ్రహమును రచించిన విద్వాంసుడు. అన్నిటిలో వసుచరిత్రకుగల ప్రచారము, విఖ్యాతి తక్కినవానికి లేవు. వసుచరిత్రము నొరవడిగా నుంచుకొని అనంతర కవు లనేకులు తమ కావ్యముల వ్రాసికొని, అతని పోకడ లవలంబింపని ప్రబంధ కవి లేడు. తమ తమ కావ్యముల నత్యంత శ్రమ పడి వసుచరిత్రవలె నుండవలెనని కోరి వ్రాసి వానికి "పిల్ల వసు చరిత్ర" మని పేర్లు సహితము పెట్టుకొనిరి. శకుంతలా పరిణయమును

వ్రాసిన కృష్ణ కవి తన కావ్యమును వసుచరిత్రచ్ఛాయలతో వ్రాసి కావ్యమును పిల్ల వసుచరిత్ర మనుకొనెను. పిమ్మటనో లేక ఆకాలము ననో యుండిన మహా కవి కనుపర్తి అబ్బయామాత్యుడు రచించిన " కవిరాజ మనోరంజన " మను పురూరవ చరిత్రకు పిల్ల వసుచరిత్ర మను విఖ్యాతి గల్గినది. వసుచరిత్రమున రామరాజ భూషణుడు క్రొత్తగా దారిజూపిన పుష్పలావికా వర్ణన పద్యమువంటి పద్యములు పలువురు కవులు తమ ప్రబంధములలో వ్రాసికొనిరి. వసంతకాల వర్ణన పద్యములు కేవలము రామరాజ భూషణ కవి పద్యముల సరణి నడచు వానిని తమ గ్రంథముల వ్రాయ మొదలిడిరి. అంతనను రామ రాజ భూషణకవి కవిత్వ మెవ్వరి ననుసరించి వ్రాసెనో తెలుసు కొనుట మన కవసరము. ఈ కవి తెలుగు కవుల స్తుతిచేయుటలో పూర్వకవుల కొందరిని పలుకరించినాడు :

మ॥ మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్ కుండలీంద్రుండు త
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు బ్రోవ న్మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటిల్లు నీ
బహుళాంధ్రోక్తి మయప్రపంచమున తత్ప్రాగల్భ్య మూహించెదన్ ॥

అని నన్నయ, తిక్కన, శ్రీనాథ, భాస్కర, సోములను కవిపం చకమును బేర్కొని వీరివలన సొంపు గాంచెడు బహుళమైన ఆంధ్రోక్తి మయ ప్రపంచమునగల ప్రాగల్భ్య మూహించెదనని చెప్పినాడు. అందుచేత నీ యేవురు కవులు వేర్వేరు కవితా సంస్థలని యెంచి వ్రాసి నాడా? లేక ప్రసిద్ధు లగుటచేత వారిని స్తుతించెనా? కాక తన పద్య మున తనకు మక్కువగల ధ్వనికి సరిపోవు నామములు మాత్రమే గైకొనెనా? అను సందేహములు గలుగక మానవు. " తత్ప్రాగల్భ్య మూహించెదన్ " అనుటచే పై కవి పంచకముచేత వెలయింపబడిన ఆంధ్ర భాషయొక్క ప్రౌఢిమ యెంతగలదో పట్టి చూచెదనని యుహం, భావమును సూచించినట్లు కనుపడుచున్నది. ఎఱ్ఱన, పోతన పెద్దనలను తలంచలేదు. భీమనను చెప్పలేదు. కావున తనకు నచ్చినవారిని మాత్రమే పేర్కొనెనని తలంతుము.

ఈ కవి స్వకపోల కల్పిత కథ రచింపక భారతమునందలి "ఉపరి చరవసు" గాథను, ఇతివృత్తముగా గైకొని, తనపాండితీ ప్రతిభచే వర్ణనా సంపదతో నింపి యొక రమణీయ కావ్యమును నిర్మించి "అవా రిత సత్కవి వర్ణనా విభూషావహ పూర్వ వృత్తములు సానలు దీసిన జాతి రత్నముల్" అను భావమును ప్రకటించినాడు. శబ్దాలంకార ములు, అర్థాలంకారములు, శ్లేషలు, ధ్వనులు, వసుచరిత్రమునం దున్నన్నిగాని, అంతరమణీయముగాగాని, యే యితర తెలుగు కావ్యమునందును గానరావు. ఈతని నిరుపమాన సాహిత్యమునకు దోడు సంగీతముకూడ కలిసినది. పదములు, మృదువులై, మధురములై శైలిరమ్యముగా నుండును. ప్రతి పద్యమును సంగీతముతో చదువ దగిన పాటవలె నడచును :

మందయానము నేర్వ నిందింది రాజీవ
 రాజీవ రాజన్మరాళరాజి......

పవమాన మానవ ప్లవమానకై రవ
 చ్యవమాన రజము మైనంట దివుర........

లలనా జనాపాంగ వలనా వసదనంగ
 తులనాభికా భంగ దోః ప్రసంగ
మలినీ గరుదనీ కమలినీ కృతధునీ
 కమలినీ వసితతోకకుల వధూక........

మాటలవరుసలో రమ్యతయే గాక ప్రతిపదము అర్థవంతము, ప్రతి పద్యము శ్లేషాను ప్రేరితమై యుండును. ఇతని యూహా లితరుల కూహాతీతముగా నున్నవి. వ్యంగ్యప్రధానమైన కావ్యమే యుత్తమ కావ్యమని లక్షణ వేత్తల తీర్పు. వసుచరిత్రయే దాని కుదాహరణము. ఇతడు మహా కవి మాత్రుడేగాక లక్షణవేత్త, లక్ష్య లక్షణ నిరూపణ జేసిన వారిలో నెల్ల రామరాజభూషణు డగ్రగణ్యుడు. నరస భూపా లీయమున నీత డీ రెండుశక్తులను జూపియున్నాడు. కథాపైశద్యమంతగా నీతని కావ్యమున లేదని విమర్శకులు కొందరందురుగాని కథ మిక్కిలి స్వల్పమైనప్పు డంతకంటె యధికముగా బెంచుటకు సాధ్యముకాదు ;

ఆపేక్షణీయమును కాదని చెప్పవచ్చును. చిత్ర విచిత్ర వర్ణనా తరంగ కల్లోల డిండీర ధగద్ధగల జృంభణలో కథా సలిలములు గానరాకున్న వనుమాట మాత్రము సత్యమేగాని యిది యితనికావ్యము పురాణము గాదని తలంచి, కవిపై నించుక సానుభూతి జూపవలసియున్నది. ఆశయము ననుసరించి కవి తనకావ్యవస్తు పరికరములను సమకూర్చుకొనుచుండును. అట్టి ప్రబంధ యుగమున ప్రబంధబంధురత పూర్ణము జేయుటకే కవి యత్నము జేసెను. గనుక విషయ వైశద్య మధికముగా లేదని మనము వసుచరిత్ర ప్రాశస్త్యము నిరసింపజాలము. వసుచరిత్ర కథా ప్రారంభమున వ్రాయబడిన :

శా ॥ శక్రాపాడిత దివ్యచిహ్నధరుడై చంచద్విమానాధిరా
జక్రీడాపరుడై యమానుష మహాసత్త్వాఢ్యుడై, చేది భూ
చక్రేశుండు ధరిత్రి నేలె వసుసంజ్ఞన్........

అను పద్యము చదువుచున్నప్పుడు నన్నయభట్టుగారి శైలి తలపించును.

మ॥ రమణీయాక్షసరాకృతిం బొలుచు వర్ణశ్రేణి వీణాను లా
పము చేతం గరగించి యందు నిజ బింబంబొప్ప నచ్ఛామృత
త్వము నాత్మప్రతిపాదకత్వమును త ద్వర్ణాళియందెల్ల పూ
ర్ణముగావించినవాణి తిర్మలమహోరాయోక్తి బొల్చున్ కృపన్ ॥

అని రమణీయ పదములతో, అతిరమణీయ గంభీర భావములతో, నత్యంత రమణీయ శయ్యతో వ్రాసిన యీ కవి ప్రతిభ దలంచిన తిక్కన సోమయాజి ఆశ్వాసాంతపద్యముల గంభీర వేదాంత విజ్ఞాన సౌందర్యము స్మరణకు వచ్చుచుండును. ఈ కవి భారతీకన్యకను ఎన్ని రంగులతో, నెన్ని రూపములతో, నెన్ని భంగిమములలో చిత్రించవలెనో యన్నివిధముల చిత్రించినాడు. ప్రతి పద్యమును సానదీర్చిన రత్నము వలె కనుపించును. శైలి తేనెసోనవలె దోచుచుండును. సీసపద్యముల సొంపు శ్రీనాథ, సోమనాథుల పద్యములకు దీసిపోదు. స్వభావాలంకారములకు కొఱత లేదు. జనసామాన్య స్వభావములను వర్ణించుటలో సఖ్యతము నీ కవి ఘుందము చిందించినాడు.

ఉ॥ స్వైరవిహార ధీరలగు సారస లోచన లున్నచోటికిన్
బోరన లాతివారు చొరఁబూనినచో రసభంగ మంచు నే
జేరక పూవుఁ దేనియల చెంతనె నిల్చి లతాంగి రూపుగ
న్నారఁగ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకుఁ జెప్పఁగన్॥

పై పద్యరచన తిలకింపుడు. వసురాజు నర్మసచివుడు గిరికాదేవి భవనమున స్వైరవిహారము సల్పుచుండగా చూచి వచ్చి రాజుతో చెప్పు సందర్భమున నీ పద్యముగలదు. స్వైరవిహారము ధైర్యముతో చేయుచున్న సారస లోచన లున్నచోటికి అనాత్తుగా యితరులు ప్రవేశించినయెడల రస భంగమగునని అనగా "సారస లోచనలు" లో రస ము లోపించిన "సా లోచనలు" అగుదురని నేను ప్రవేశింపక పూలతీవెల సమీపములోనే నిల్చి యా లతాంగి "రూపు" కన్నారగ జూచివచ్చితినని జెప్పెను. దానివల్ల రాజుకు సందేహము వాపెను. "రూపు" అనుటచేత నందలి ధ్వనితో నా లతాంగి అవివాహిత యని స్పష్టపరచెను. "రూపు" పెండ్లికాని కన్యలచేత ధరింపబడు చిన్న బంగారు వస్తువు. వివాహానంతరము రూపుండదు. మంగళసూత్ర ముండును, గనుక రూపు కన్నారగ జూచితినని అనగా నామె యవివాహిత యని దృఢముగా జెప్పి రాజునకు ధైర్యము కల్గించెను. నవాంబురుహాంబక యనుటలోగూడ కొంత సారస్యము జూపెను.

మ॥ తన రాజీవ శరం బెఱుంగదు నిశాతత్వంబు, తే గల్వ తూ
పునకుం జాలదు వేగలీల, యని యాపూములు లగ్గించి క్రొ
న్నన విల్కాఁడు నవాంబుజోత్పల వితానం బీసు వామాక్షి లో
చనము ల్వింట ధరింపబూల్చి నవినిస్తందాంబక ఖ్యాతులన్॥

ఇట్టి పద్యముల పదముల విడదీయుపట్ల జూపు చాతుర్యముతో నుద్దిష్టభావార్ధలబ్ధి జెందునట్లు తేట తెలుగుమాటలతో నీటుగా రచించియున్నాడు. ఈ కవి కావ్య మన నేమో యిట్లు నిర్వచించియున్నాడు :

తే॥ అసదృశ రసప్రధాన శబ్దార్ధములును
రీతులును వృత్తులును, నలంకృతులు, గుణము
లాదియగు లక్షణంబుల నలరు కావ్య
సరణి యందు రలంకారసార విమలం॥

అంతియుగాక కావ్యాలంకార సంగ్రహమున కవి తన యాశ యమును దెల్పుచు కృతిభర్త తనశక్తినిగూర్చి చెప్పిన ట్లీ క్రింది పద్య భాగమున వ్రాసికొనియున్నాడు. తెలుగు కవులలో :

సీ॥ సోము ప్రసాదంబు సోమయాజుల నియ
మంబు భాస్కరుని సన్మార్గ ఘటన
శ్రీనాథుని పదప్రసిద్ధధారా శుద్ధి
యమ శేశ్వరుని సహస్ర ముఖదృష్టి......

నీక కల దటు గాన ననేక వదన
సదన సంచార భేదంబు సడలు పరచి
భారతీదేవి నీ జిహ్వ బాదుకొనియె
మూర్తి కవిచంద్ర విఖ్యాత కీర్తిసాంద్ర॥

అని వారి వారి కవితాలక్షణములు తనకు గలవని గర్వముతో నుడివినాడు, ఈ మూర్తికవియు రామరాజభూషణకవియు నొకే వ్యక్తియని సిద్ధాంతముగా జెప్పవచ్చును. సోమయాజులుగారు తన కావ్యమున నెఱపిన కవితా నియమమును తాను చూపితి నని భట్టు మూర్తి చెప్పికొన్నను అయ్యవి సంకుచితముగా నున్న వేమోగాని చదు వరులకు గోచరింపకున్నవి. శ్రీనాథు నుదగ్ర ధారను రామరాయభూష ణుడు మంజుల ధారగా మార్చెను. పదప్రసిద్ధ ధారాశుద్ధి కొఱత లేకుండ నిలుపగలైను. సీసాంతగీతములలో దీర్ఘ సంస్కృత సమాసము లనేకచోట్ల శ్రీనాథునివలెనే వాడినాడు :

అ త డు రి పు రా డ ఖ ర్వ గ ర్వాం ధ కా ర ;
గం ధ ని ర్గం ధ నాం భో జ బం ధు బం ధు ;
బం ధు రా వా ర్య శౌ ర్య ధు రం ధ రుం డు.

ఇత్యాదు లుదాహరణములు.

సీ॥ మోహోపదేశ తమోనిద్రితములైన
కనుదమ్ముల హిమాంశు లనుపరాదు
శ్రమబిందు తారకాగమఖిన్నకుచకోక
ములు చంద్రనామంబు దలపరాదు

శీర్యదాశావృంత శిథిలతాను లతాంత
మసియాడ వీవనల్ విసరరాదు
పటుతాపపుటపాక పరిహీణతనుహేమ
మింక పల్లపుటా ర్చిడగరాదు.

లలనకానంగ కీలికీలాకలాప
సంతతాలీఢహృదయ పాత్రాంతరాళ
పూరితస్నేహపూరంబు పొంగిపొరల
చల్లనిపటీర సలిలంబు జల్లరాదు॥

ఇట్టి భావములు రచనా రీతులు గల పద్యములే యితర కవి కృతులలో గానుపింపవు. అట్లే

సీ॥ లోకత్రయీ జనోత్సేకంబు జూపు నీ
పడగ నారాయణ ప్రథమమూర్తి
రెండంటజేయు నీ కాండచాతురికి నా
ద్యనిదర్శనంబు వామార్ధజాని........

ఇట్టి దుర్నిరీక్ష్యోన్నతకి గొనిపోవగల రచన లనేకములుగలవు. అయితే యీ కవి కావ్యమున కథావిస్తరణ లేక కేవల వర్ణనా సౌందర్యము మాత్రమే మిక్కుటముగా నుండుటచేత జీవము పోయినదని కొందరు విమర్శింతు రని చెప్పుట చరిత్రచర్వణము. శవమున కలంకారము బెట్టినట్లున్నదని వీరి తలంపు. అట్లనరాదు. నిర్జీవమైన కథావస్తువునకు అలంకారములు బెట్టి సుధారసముచే జీవము బోసి, భావసంపద నెలకొల్పి చిత్రమును సజీవచిత్రముగా నొనర్చినాడని నా విశ్వాసము. సుందరభావము లడంచి, నగలు బెట్టక, హావ భావవిలాసముల మాటి, పదముల సొంపు గూర్పక, సంగీతమాధురి బయల్పడనీక, కేవల గృహకార్యాచరణ శీలయై ధర్మవర్తినిగా జేయబడిన శుద్ధ వైదిక ముత్తైదువైన భారత నారి భంగి భారతీ కన్యను జేయుట సమంజసముగాదు. ఆ పరిశుద్ధమూర్తి చరిత్రవలన మనము తెలుసుకోవలసిన వెన్ని యున్నను ఆమెను జూచినప్పుడు మనకు హృదయానందము గలుగ జాలదు. అట్లే వర్ణనా రహిత, అలంకారవియుక్త, మంజుల పదధారా విహీన, శయ్యా మార్దవ శూన్యకావ్యములు, ప్రజారంజకములు గానే

రవు. ప్రజారంజకమై, జనాకర్షకములై యర్థసిద్ధినొసగు సినిమా ప్రదర్శనములనే ఎంచుచున్నట్లు దేశ కాల స్వభావముల ననుసరించి, ఆదర్శములు, ఆశయములు, వాంఛలు మారుచుండును. సంస్కారము నపేక్షించు రాజుల ప్రజల చిత్తవృత్తుల ననుసరింపవలసిన కవులు తదభీష్టానుసారముగా కవితారీతులు మార్చుచు, నూతన సరణుల ప్రోత్సహించుచుండిరి. అర్థార్థులైన పేదకవులు కృతిభర్త నన్వేషించి వారి యాశ్రయాంగీకారములు సంపాదించి వారిని మెప్పించుటకు తమసాహిత్యమెల్ల వినియోగించిరి. ఈ విషయముగూడ చరిత్రచర్వణమే. కాలపరిణామ బలమువల్ల కవులు మారిరి, కవితలు మారినవి, ఆశయములు మారినవి. అందుచేతనే పూర్వకవులకున్న అవకాశములు మధ్యకవులకు లేవు. సరస్వతీ నారద విలాపమున, కందుకూరి వీరేశలింగం పంతులుగారు :

మ॥ రమణీయోక్తులచేత సద్గుణసారస్యంబు గల్పించుచున్
తమి నా యంగచయంబునన్ సహజసౌందర్యంబు పాటించి, కొం
చె మలంకారము లుంచి తొల్లిటి కవుల్ చేష్టా చమత్కార భా
గ్యము హెచ్చించుచు కొన్నినాళ్లటుల నన్ గాపాడి రత్యాస్థితిన్॥

అని సరస్వతి వాపోయినట్లు వ్రాసినారు. ఇది నిజమే కావచ్చును. వీరుభావించినట్లు తత్కాలికకవులు పదములు విరచి, నగలను పేరుతో దేహము కట్టి, శ్లేషలుచుట్టి, సరస్వతిని విరూపజేసియుండవచ్చును కాని కాల మహిమ అలంఘ్యము. కం॥ వీ॥ పంతులుగారును కాలము ననుసరించి ప్రబంధశైలి ననుసరింపక తప్పినది కాదు. ప్రబంధరూపమున రసికజన మనోరంజకముగ నచ్చతెలుగున రచించిరి. శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్యనైషధము వ్రాసిరి. అట్లే నియమబద్ధమైన యనుకరణసలుపక తప్పినది కాదు. ఏతావతా చెప్పదలచిన దేమనగా కాలప్రవాహమున భావపరివర్తనా తరంగ సంఘాతబలముచే సంఘము మార్పుజెందిన కొలది కవుల యభిరుచులు పోకడలు మారుచుండుననుటకు సందేహము లేదనియే.

రామరాజ భూషణుని గురుప్రాయునిగా నంగీకరించి పిమ్మటి ప్రబంధకవులు పెక్కండ్రు అతని వరవడి ననుసరించిరి. అల్లసాని పెద్దన ఆంధ్ర కవితా పితామహుడైనను విలక్షణమైన ప్రబంధము రచించినను తరువాతి కవు లెవ్వరును యతని మనుచరిత్రము ననుసరించినవారు లేరు. అట్లే ప్రబంధకవులలో నగ్రేసరులైన సంకుసాల నరసింహకవి, తెనాలి రామకృష్ణకవి, కృష్ణదేవరాయలు మున్నగువారి ననుసరింపక రామరాజ భూషణ ప్రబంధ ఫక్కి ననుసరించుట కొక ప్రబలమైన కారణముండకపోదు. కవిత్రయము వారొకొక్కరొక్కరొక్క కవితా సంస్థయని ప్రప్రథమముననే చెప్పియున్నాను. అట్లే సోమ, భాస్కర, శ్రీనాథ, పోతన గార్ల నొకొక్క ప్రత్యేకసంస్థయని చెప్పనగు. అట్లే వసుచరిత్ర కారకుడగు రామరాజ భూషణు నొక విశిష్టమైన సంస్థగా నెంచుట సముచితమే. ఒకొక్క సంస్థకుచేరి తదీయ సంస్థా సరణి నంగీకరించిన వా రాపోకడలనే గ్రహింతురు. భట్టుమూర్తి శయ్య అలంకార సంపదల మెచ్చి తలయూపని కవు లుండరు. ఆపద్యముల నడక, సీసముల తూగు, పద మాధురీభావ శబలత పాఠకులను ముగ్ధులను జేయుచుండుటచేత ప్రతి కవియు తా నట్లు వ్రాయ నుత్సహించి యనుసరింప జొచ్చెను. కాని యతనితో దీటువచ్చు వా రెవ్వరును నేటివరకు లేరు. ఈ కవి కవితాసరణిగూర్చి పూర్వమే కొంత చెప్పి యున్నాను గనుక నింతటితో విరమింతును.

## అనంతామాత్యుడు

ఈ సందర్భమున చదువరుల దృష్టి కొంత వెనుకకు మరలింప వలసి వచ్చినది. భోజరాజీయమును రచించిన అనంతామాత్యుని మరచితిని. ఈ కవి మధ్యకవులకు కొంతపూర్వుడే. అయినను పూర్వ కవులవలె రసోచితమైన, ద్రాక్షాపాక విలసితమై, స్వతంత్ర కల్పనో ద్భాసితమైన కావ్య మల్లినాడు. భోజరాజీయమున గోవ్యాఘ్రసంవాదము ప్రతివ్యక్తియు చదువదగినది. స్వభావవర్ణనలు ప్రాణిలోక స్వభా

వము రమణీయముగా వర్ణించి సత్యవాక్యమహిమ నభివర్ణించినాడు. రచన, తిక్కన కథాప్రవచనము బోలియుండును. మృదువైన తేట తెనుగు పదములతో సంభాషణలు, నీతులు చక్కగా తిక్కన చెప్పి నట్లుండును.

## దిట్టకవి నారాయణ కవి

18–వ శతాబ్దము చివరిభాగములోనో 19–వ శతాబ్ది ప్రథమ భాగముననో యుండిన దిట్టకవి నారాయణ కవి రంగారాయచరిత్ర మను కావ్యమును రచించెను. ఈ కావ్యమున బొబ్బిలి యుద్ధ చరిత్ర వర్ణింపబడినది. కవిత్వము రసవంతముగను ప్రౌఢముగాను న్నది. కవితా రచన భారత రచన బోలియున్నది. బొబ్బిలియుద్ధమును వర్ణించుచు వీర రౌద్రరసములు వర్ణించుపట్ల తిక్కన వర్ణించినట్లు వర్ణించి యున్నాడు. కాలమహిమచేత నితని కవితలో నక్కడక్కడ ప్రబంధ రీతులున్నను కథావైశద్యము పూర్వకవుల పోకడలు గలవు. రంగా రాయచరిత్రములోని యీ క్రింది పద్యములే కవి కవితావైఖరి దెలుప గలవు. విజయరామరాజు బుస్సీ దొర ఉద్ధతుల ముల్కను దర్శించు టకు రాజమహేంద్రవరమునకు వచ్చినప్పటిపట్టున నతనిని కవి వర్ణించిన తెరంగు తిక్కన కవిత్వరీతి బోలియున్నది:

సీ॥ నిజభుజాదండ నిర్నిద్రకోదండంబు
గాండీవ కార్ముక క్రమము జూప
చరమభాగస్ఫుటచ్ఛటుల తూణీరముల్
కవదొనసొంపు సంఘటిల జేయ
నాశీరముఖర నానా శంఖిక ధ్వనుల్
దేవదత్తారవోద్వృత్తి దెలుప
నూరెల బరతెంచు జాలుమలి తేజీలు
ధవళాశ్వముల మస్తుత్రిస్తరింప
కలియుగార్జును డౌర యీ ఘనుడటంచు
దనుజగజ్జనమెన్న నుద్ధతుల ముల్కు
వీక్షణాపేక్ష నేతెంచె విజయరామ
రాజ రాజన్యలోక మార్తాండమూర్తి ॥

ఈ కవి కవితపై తిక్కన కవితా ప్రభావ మరమరలేక ప్రసరించినదనుట సుస్పష్టము.

మ॥ అవు డాతాంధ్ర కులాభిమాననిధి యాహారాజదేవేంద్ర నీ
విపులప్రాభవశక్తి నీ నిఖిలపృథ్వీభార ధౌరేయతా
నిపుణత్వంబును, భాగ్యమున్, వృథచనన్ నీచేయుదుశ్చేష్ట ని
ట్లుపభోగింపగనయ్యె నిట్టివెతనంచు ద్వృత్తివర్తిల్లగన్ ॥

గీ॥ తాంధ్ర పాపయ్య నలుపు ధౌర్త్యంబువలన
క్షుత్రవర్యుండు పులివాతి కండయయ్యె ననెడు రోద బుట్టె......

గీ॥ కదిసి పైబడి యొకకేల నదిమి పట్టి
వాడివాలున వక్షః కవాట పాట
నంబు గావించె నతని యూనాభికుహార
విదళితాంత్ర వ్రజంబులు వెలికి నుఱక॥

ఇక నతి విస్తరణ మక్కర లేదు.

## చేమకూర వేంకట కవి

పైనదెల్పిన కవులకంటె కొన్నివిషయముల నధికుడని చెప్ప తగినవాడు చేమకూర వేంకట కవి యొకడు. ఈ కవి కవితాచమత్కృతి నిరుపమానము. ఈ కవి జాతీయములు, లోకోక్తులు, తెలుగు పదముల సొంపు మిక్కిలి సుందరముగా నుండును. కథావైశద్యము పూర్వకవుల రీతిగా నుండును. వర్ణనలు సయితము సరసముగా నుండును. తక్కిన ప్రబంధకవులభంగి దీర్ఘ సంస్కృత సమాసములు కనిపింపవు. యమకము లప్రయత్నముగా వచ్చినట్లు రమణీయముగా నుండి "సవ్యసాచి, యింద్రోపల రోచిజూచి, తలయూచి యులూచి, రసోచితంబుగన్." ఇత్యాది పదయమకములకూర్పు చదువరులకు హృదయంగమముగా నుండును.

ఉ॥ కోప మొకింత లేదు బుధకోటికి కొంగుపసిండి సత్యమా
రూపము తారతమ్యము లెఱుంగు స్వతంత్రుడు, నూతనప్రియా
టోపములేని నిశ్చలుం డిటు లత్కృతలక్షణుడై జెలంగగా
ద్వాపర లక్షణుం డనగ వచ్చునొకో యల ధర్మనందనున్ ॥

ఇట్టి రమణీయ రచనలతో ఉచితమైన శబ్దాలంకారములతో, ప్రతిపద్యము రసాస్పదముగా, వ్యంగ్య ప్రధాన విన్యాసములతో మార్దవమైన శైలితో, ద్రాక్షాపాక కోమలతగూర్చి కావ్యమొనర్చినా డీ కవి. సారంగధర చరిత్రము, విజయ విలాసము లను రెండు కావ్యములు రచించినాడు. అందు రెండవకావ్య మత్యంత రమణీయము. తిక్కన పోకడ లీకవి కావ్యములో నందందు జూపట్టును.

సీ ॥ ఘోటకఖురపుటక్షుణ్ణ ధరాజాత
పాంశువుపై నుల్లభంబు గాగ
భటసింహ విక్రమోద్భట సింహనాదముల్
స్వస్తివాదంబుల చంద మొంద
పదిదిక్కు లొక్కట బగిలి బీటలు వాఱ
భేరీ నినాదముల్ బూరటిల్ల
విజయసమారబ్ధవేళ కౌతుకమున
మొగమున గరువంపు మురువు దోప
ఔర పెండ్లికి నేగిన ట్లనికి నేగి
అక్ష తంత్రంబు లివియేటి లక్షమనుచు
రేకమోవక గెల్చుట నీక చెల్లు
సమర నిశ్శంక రఘునాథ సాహసాంక ॥

పై పద్యము భారతమున తిక్కన రచించిన:

సీ ॥ దివ్యరథస్ఫార దీప్తి జాలంబులు
పద్మరాగోజ్జ్వల ప్రభలు గాగ
మహనీయరథ్య విగ్రహముల జిగిసొంపు
ఘన వజ్ర వసు సముత్కరము గాగ........

అను పద్యము జ్ఞప్తికి వచ్చుచున్నది. ఈ కవి చక్కని పూర్ణోపమానములు పూర్వుల కరణి మనోహరముగా ప్రయోగించి యున్నాడు. జాతీయములు, లోకోక్తులు హృదయములకు హత్తుకొనునట్లుపయోగించుశక్తి యీతనికి మిక్కుటముగా గలదు. తెలుగు నుడులు బహుళముగా వాడును— రె మ్ముద్దము; గుజ్జన గూళ్లు; చదువు సాములు; నూడిద జేసె; ఏనుగు పాడి; పంచ బంగాళము; లగ్గ పట్టు; వెండియు; బైడియు తడబడుచుండు; పెట్టని కోట; ఉక్కు తునక;

చిదిమిపెట్టిన బంటులు; పిలువని పేరంటము; జిగి బిగి సోయగము; ఎగాదిగజూచి; నిత్యకళ్యాణము పచ్చతోరణము; కాణాచి; జీవ గఱ్ఱ; ఇచ్చకపు మెచ్చు; చనవిచ్చి చౌకచేయుట; పెద్ద పిన్నయంతరువులు, అన్న దమ్ముల సరాగము; బుజ్జగించు; నడమంత్రపు కల్మి; విఱ్ఱవీగు; త్రోసి రాజను; అమ్మక్క యిదేమె ?; పని విను; చేరల గొల్వ వచ్చు; అమ్మక చెల్ల; చొక్కు జల్లుట; సంజ కెంజాయ; గుట్టు బైట వేయుట; పాపపూప జవరాలు; జన్నియ వట్టియుంటె; ఈతకు మించిన లోతు గల్గునే?; సయ్యాటము బిడారు; జారు పాటులు; పుణికి పుచ్చుకొను; కందువమాటలు; నెఱజాణ; పాల బుగ్గలు—ఇట్టి నుడులకు అంతు లేదు. మాటల సొగసు, యే యితరకవికి యీ రీతి గానరాదు. ప్రతిమ చిత్రించుటలో నితడు మేటి. తిక్కన సోమయాజి శిల్పము, వర్ణనా సమయముల నీ కవి జూపినాడు. సుభద్ర మాయాసన్యాసిని ప్రశ్నించుచు అర్జునుని యెచ్చటనైన చూచినారా? యని యడుగుచు, అర్జును డే రూపముగలవాడో చెప్పు సందర్భమున నతని నిట్లు వర్ణించినది:

సీ॥ ఎగుభుజంబుల వాడు మృగరాజ మధ్యంబు
 పుడికిపుచ్చుకొను నెన్నడుము వాడు
నెఱివెండ్రుకల వాడు నీలంపు నికరంపు
 మెరుగు చామనచాయ మేని వాడు
గొప్ప కన్నుల వాడు కోదండగుణకిణాం
 కములైన ముంజేతు లమరు వాడు
బవిరిగడ్డము వాడు పన్నిదంబడి డాగ
 వచ్చు నందంపు వెన్ను మచ్చవాడు
గరగరని వాడు నవ్వుమొగంబువాడు
చూడగల వాడు మేలైన సొబగువాడు
వావి మేనత్త కొడుకు గావలయు నాకు
నర్జునుండు పరాక్రమోపార్జితుండు ॥

ఈ వర్ణన యెంత స్వభావసిద్ధముగా నున్నదో చూడనగును. రూపము చిత్రించుటకు భారతమున తిక్కన సోమయాజి యాశ్రమ

వాస పర్వమున ధర్మరాజాదులను, ఆశ్రమవాసులకు తెల్పుచు సంజయుడు చూపిన శ్లోక పద్యమును వ్రాసెను. ఈ చేమకూర వేంకట కవి పద్యమును చదివినప్పుడా తిక్కన పద్యము తలంపునకు వచ్చును :

సీ॥ జాంబూనదచ్ఛాయ చందంబు వర్ణంబు
గలిగిన పలుచని గనప మేను
సుచిత దీర్ఘత్వ సమున్నత ఘ్రాణంబు
నిడుదలైన విశాల నేత్రములును
కంఠీరవంబు రేఖయునొప్ప జూడ్కికి
నెంతయు వ్రేగైన యితడు ధర్మ
తనయుఁ, డెల్దవనంబు దనరిన మూపులు
నాయతస్నిగ్ధంబులైన బాహు

వులును, వెడదయురంబునై పొలుచు నితడు
భీము డుజ్వల సుందర శ్యామ తనువు
వారణేంద్రు కైవడియును, వారిజముల
యట్టి కనుదోయిగల యతం డర్జునుండు॥

ఈ తిక్కన పద్యమును మదిలో నెంచి వేంకటకవి ప్రౌఢిమ తగ్గించి, స్వభావసంపద పెంపుజేసి పై పద్యము రచించినట్లున్నది. ఈ రెండు పద్యములును, సందర్భోచితమైన భాషతో రచింపబడినవే. తిక్కన పద్య మట్లే యుండవలయును. వేంకటకవి పద్య మిట్లే యుండవలయును. ఆశ్రమవాసమున ప్రశ్నించిన ఋషులకు సంజయుడు పాండవేయులను జూపునప్పు డా భాషయే తగియుండునట్లే, యతిరూపముతో నున్న క్రొత్తవానికి యావనవతియగు సుభద్ర యొకని రూపురేఖలను బోల్చుకొని తెలిసికొనుటకు పైవైన చందమున తేట తెలుంగు మాటలతో చెప్పుటయే తగియున్నది. ఈ కవి కావ్యములలో కథావేగము గల్గియుండును. వర్ణన మధికముగా వలయు శృంగార వర్ణన పట్ల దక్క తక్కినచోట్ల మితిముగా వర్ణనజేయుచు కథాసరణి కభ్యంతరము గల్గింపకుండునట్లు వ్రాయును.

# కుమ్మరి మొల్ల

కృష్ణదేవరాయల కాలముననో ఇంచుక తరువాతనో జీవించి యున్న కుమ్మరి మొల్ల ప్రసిద్ధ కవయిత్రి. ఈమె రామాయణమును రచించెను. మొల్ల రామాయణము లలిత కవితావిలాసము గలిగి మనోహరముగా నున్నది. రామచరిత్రము క్లుప్తముగా నిందు తెలుపబడియున్నది. ఈమె కవిత్వము చక్కని ధారగలిగి రసవంతముగా నున్నది. ఆకాలమున భారతము చదువక కవిత్వము చెప్పిన వారుండరుగదా! మొల్ల కవితారచన భారత కవిత కంతగా సంబంధము లేకున్నను అక్కడక్కడ నొకొక్కచో భారత పద్యముల సరణి యీ కవయిత్రి యనుకరించెను.

సీ॥ ఎవ్వాని వాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజి నడగు........

అను తిక్కన పద్యసరణి మొల్ల తన రామాయణ సుందరకాండలో:

సీ॥ ఎవ్వాని వీటికి నేడు వారాసులు
పెట్టని కోటలై పెచ్చు పెరుగు
నెవ్వాని సేవింతు రింద్రాది దేవత
లనుచరబలములయి యను దినంబు........

యని వ్రాసియున్నది. అట్లే యుద్ధకాండలో:

శా॥ వీరాలాపము లాడుచుం గదిసి దోర్వీర్యంబుతోడన్ ధను
ర్జ్యారావము మిన్నుముట్ట నతి తీవ్రంబైన శస్త్రంబులన్
వారాసుల్ కలగంగ నార్చి నిజగర్వస్ఫూర్తి నుప్పొంగుచున్
క్రూరాస్త్రంబుల నేసి రొండొరులపై కోదండ పాండిత్యులై॥

యని వ్రాసెను. కావున తిక్కన కవితాప్రభావ మీ కవయిత్రిపై కొంతైనను ప్రసరింపక మానలేదు. ఈమె నిరర్గళ మధుర ధారావాహినివలె పరతెంచు కవిత చెప్పి నారీలోకమునకు వన్నె తెచ్చెను.

# వెలగపూడి వెంగనామాత్యుడు

మహా కవులలో నొకడని చెప్పదగిన వెలగపూడి వెంగనామాత్యుడు శుకయోగి రచించిన శ్రీ కృష్ణ కర్ణామృతమును పాఠక జన కర్ణామృతముగ సలక్షణముగా రచించెను. ఈ కవి కవిత పోతనామాత్యుని కవితవలె శ్రావ్యముగా నుండును.

చం॥ జలనిధికన్యకా ఘన కుచస్థలి పచ్చల తాళి, గోపికా
విలసిత హారమధ్యమణి, విశ్వజగద్వలయ ప్రకాశకో
జ్జ్వల మహనీయ రత్నము, నివారితకాళియభోగిభోగమం
డలగిరి వజ్రమై, యలరు నంద తనూజు భజింతు నా మదిన్ ॥

మ॥ అదిగో ముంగల పెద్ద మద్దియట పో నాచెంత వ్రేపల్లె యున్నది
యాదండ కళిందజాతటమునం దా పింఛభూజాళిలో
కదుపు ల్మేపుచు గోప బాలకుడు నిక్కంబొప్పగా దెల్ప
సద్పథమున్ బొమ్మ్న సఖా శుభాస్పదముగా భావంబు రంజిల్లెడున్ ॥

ఈ వెంగనామాత్యుడు తాను రచించినది యనువాద గ్రంథమే యయినను కవిత్రయము వలెను, పోతనామాత్యుని వలెను స్వతంత్ర రచనయో యనునట్లు చేసెను గాని మక్కికి మక్కిగా భాషాంతరీకరణము చేయలేదు. కవిత్వము మనోహరముగా నున్నది. పోతనగారి కవితనే పూర్ణముగా తన పోకడలందు జూపెను:

ఉ॥ చల్లని వాని నవ్వు వెసఁ జల్లెడు వాని దయారసంబు జొ
బ్బిల్లెడు వాని, గెంపు జిగి పెంపు సెలంగెడు మోవి వాని సం
ఫుల్ల పయోజ నేత్రముల బొల్చిన వాని, పయోధి వీచికా
వెల్లిత నీలనీరద నవీన తనుద్యుతి వాని గాంచెదన్ ॥

ఈ పద్యము పోతరాజుగారి :

ఉ॥ నల్లని వాడు పద్మనయనంబుల వాడు కృపారసంబు పై
జల్లెడు వాడు మౌళిపరిసర్పిత పింఛము వాడు నవ్వు రా
జిల్లెడు మోము వాఁ డొకడు చెల్వల మానధనంబు దెచ్చె నో
మల్లియలార మీపొదల మాటున లేడుగదమ్మ చెప్పరే ॥

అను పద్యమునకు స్నిగ్ధచ్ఛాయవలె నున్నది. కవిత్రయ కవితా ప్రభావ మీకవిపై యేమాత్రము ప్రసరింపలేదు. కాని పోతన కవితా ప్రభావము మాత్రము ప్రసరించినది. కావున నీ కవి పోతన కవితా సంస్థకు చెందినవాడని చెప్పనొప్పు.

## తరిగొండ వెంకమ్మ

ఈ కవయిత్రి మహాభక్తురాలు. వెంకటాచల మహాత్మ్య మను కావ్యమును, రాజయోగసార మను ద్విపదకావ్యమును సరసముగా శ్రావ్యముగా వ్రాసిన నారీ తిలకము. మధ్యయుగపు స్త్రీలలో మొల్ల, వెంగమాంబ, మదిన సుభద్రమ్మగారలును, తరువాత ముద్దు పళని యును ప్రసిద్ధులు. అయితే వీరి పోకడలు, పోతనామాత్యుని పోకడలే యగుట కవిత్రయ కవితా ప్రభావము వీరిపై ప్రసరించలేదు. కావున వీరి గ్రంథములగూర్చి యెక్కువగా వివరింప నక్కరలేదు.

## కంకంటి పాపరాజు

18-వ శతాబ్దమునకు చెందిన కవులలో ప్రసిద్ధులైన కవులు కంకంటి పాపరాజు, ఏనుగు లక్ష్మణకవి, పుష్పగిరి తిమ్మన యనువారు ముఖ్యులు. పాపరాజుగా రుత్తర రామాయణ మత్యంత ప్రౌఢముగా రచించెను. తిక్కన సోమయాజిగారి నిర్వచనోత్తర రామాయణమును చూచి యాతని పాకము చాలదని తన పాకము నెక్కుడు ప్రౌఢము గావించి, పురాణ లక్షణములకుదోడు ప్రబంధలక్షణముల జేర్చినాడు. దీర్ఘ సంస్కృత సమాస జటిలత నీతని కావ్యమున గలదు.

సీ॥ ప్రాగద్రితటభాగ భాగపాఠపరాగ
రాగసంకుల ఘనాయనాగకులము
దారితాభ్రశతారతార దంష్ట్రోదార
దారయుగ్భూదార దారకంబు

శబరయోషాచండ చండదుక్కరకాండ
కాండఖండిత ఘోరగండకంబు........

ఈ మాదిరిగా పద్యముల నడపించియున్నాడు. ఇట్టిశబ్దాలంకార జృంభణము చూపినచోట్లగాక ప్రౌఢగంభీరశైలితో గ్రంధమంతయును మనోహరముగానే యున్నది.

మ॥ తరుణాదిత్యుల నిగ్రహించుటకునై దండెత్తెనాదిత్య ఫీ
కరు డిప్పంక్తిముఖాసురుం డితనిదోఃఖర్వ ప్రతాపంబునే
జరఠాదిత్యుడనోర్వనేర్తునె వృధాచండత్వ మింకేల యు
కరణిన్ భానుడు మందరస్మియగుచున్ గాన్పించె ... ... డుతన్॥

భారతకవులలో నన్నయ, శంభుదాసుల ధార లీ కవి కవితలో గలవు. తిక్కన రచనలో గన్పట్టు శిల్పమిందు లేదు. కావి శబ్దాడంబరము, యమకము, గమకము మిక్కిలిగా నుండును. పదముల కూర్పునందలి యందము కలదు. రసము తక్కువ. పాపరాజ కృతోత్తర రామాయణమునకున్న ప్రజాదరము తిక్కన నిర్వచనోత్తర రామాయణమునకు లేదు. విమర్శకుల దృష్టిలో తిక్కన కృతి కధికాదరము గలుగవచ్చుగాని, ప్రజాసామాన్యమునకు పురాణముగా చదివి యానందించుటకు కంకంటివాని గ్రంధమే యెక్కువగా నుపయోగపడును. కధా వైశద్యము గలదు. స్వతంత్ర కృతివలె నుండునుగాని, అనువాదసరణి యెచ్చటను గానరాదు.

సీతను రాము డరణ్యమునకు లక్ష్మణుని తోడిచ్చి పంపినప్పుడు సుమిత్రా నందనుడు రామాజ్ఞ నెరవేర్చి యరణ్యమున జానకిని డించి యధార్ధస్థితి యామెతో చెప్పిన సందర్భమున సీతమాటలు తిక్కన యొక రసవంతమైన పద్యములో వ్రాసెను. పాపరాజుకూడ నాపట్టున నే యొక పద్యము వ్రాసెను. రెండును చూచి తేడా కనుగొనవచ్చును. రెండును రమణీయ కవితావిలాసము గల్గియేయున్నవి. అయినను తిక్కన పాత్ర చిత్రణ వేరుగా దోచును.

పాపరాజరచితపద్యము:

చం॥ ఎఱుఁగని మూఢు లాడుకొను నెగ్గులకుం భయమంది యిప్పు డీ
కఱకుఁదనంబుతో విభుడు కాననసీమకు బంపెఁగాక య
త్తెఱఁ గొకసారి నన్బిలిచి తెల్పి, మనోవ్యథ దీర్చి నిన్ను నే
మఱనని పంపఁడయ్యె నభిమానము కూర్మియు నెందు బోయెనో॥

తిక్కన పద్యము :

చ॥ తనమదినున్న యుమ్మలిక దక్కుట మంచిది దాని బాపఁగా
ననితలపోసి. చేయుపని కక్కట యేనును దోడుగానె నా
కు నెఱుఁగఁజెప్పి పొమ్మనుటకుం దగనే పురిలోటదక్క మ
న్ననయెడలైన రాజులమనంబులు ద్రిప్పఁగ బల్మికల్గునే॥

పాపరాజు పద్యమున సీత స్త్రీసామాన్యసరణిలోనే పల్కినది. తిక్కన సీత తన గంభీరభావము, ధర్మనిర్వాహణా సంసిద్ధత, ఆత్మగౌరవము వెలార్చువైఖరి జూపినది. పాపరాజు సీత రామునకు తనపై యభిమానము, కూర్మి పోయినదని వాపోయినది. ఇతరులు వేసిన నిందకు భయపడి కఠినుడై కానన కంపినాడని యించుక కోప మూనినది. తిక్కన సీత యట్లుగాక రాముని నిందించనే లేదు. తన కీ గతి పట్టినందుకు వాపోవలేదు. అతడు చేసినది పొరపాటని మాత్రము విమర్శించినది. తన మదిలోనున్న సందేహము తీర్చుకోవలసినదే. అందు నిమిత్తమై తాను చేయుపనికి నేను సహాయపడనా? కాదందునా? నాకును చెప్పి పంపరాదా? చెప్పుటకు నేను తగనా? అనగా చెప్పితే వినక తగాదా పెట్టుదునని సందేహమా? తన మాట జవదాటని దాననని యెఱుంగడా? ఒక వేళ తనమాట గౌరవించనిచో రాజుల మనస్సు త్రిప్పగల బలము నాకు గలదా? ధర్మనిర్వాహణలో నన్ను సహధర్మచారిణిగా గ్రహించ లేదనే విచారము చూపినది. కాని తనను అడవికి పంపినందులకై కినియ లేదు. ఈ రెండు పద్యములలోని సీతాచిత్రణము భేదముగానున్నది. ఇట్లే యిరువురి కృతుల రచనలలో తేడాగలదు. తిక్కన రామాయణమున అన్వయ కాఠిన్యము గలదు. పాపరాజు రామాయణమున శబ్దకాఠిన్యత గలదని చెప్పనొప్పును.

# శంకర కవి

ఈ కవినిగూర్చి యింతటితో విరమించి, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యాన కవిత్వము నించుక చూతము. శంకరకవి మార్కండేయ పురాణమున చెప్పబడిన హరిశ్చంద్ర కథనుగైకొని కథపెంచి, విపులముగా మనోహరముగా నుండునట్లు వ్రాసియున్నాడు. ఈ కవికి పూర్వము గౌరన మంత్రి ద్విపదకావ్యముగా హరిశ్చంద్ర కథను రచించెను. ద్విపద కావ్యము రచించిన కవులలో మహా కవులు కొందరు గలరు. రంగనాథుడు, రామాయణమంతయు ద్విపదలో నత్యంత మనోహరముగా ప్రౌఢముగా వ్రాసెను. అట్లే పూర్వకవులు నన్నయ భట్టుగారికి ముందు వెనుకను గూడగలరు. మతసిద్ధాంత ప్రచారము నకై ప్రజాసామాన్యమునకు తెలియునట్లు జేయుటకై పాటలుగా పాడుట కుపయోగపడునట్లు ద్విపదనే శివకవులు వ్రాసిరి. అందుచేత నే శివకవులకు, నవకవులకు అని భేదము జూపుచు వచ్చినారు తదనంతర కవులు. నవకవు లనగా, పద్యరూపకముగా కావ్యముల వ్రాసినవారని యర్థము. ద్విపదకావ్యముల రచన మిక్కిలి మనోహరమై, సరసమై, మృదుపద గుంభితమై, సంగీతయుక్తమై, ప్రాయికముగా జనపదముల యందు ప్రచారములోనున్న మాటలతో గూడియుండును. అట్లే గౌరన హరిశ్చంద్ర కథయును, పొడిపొడిమాటలు, స్వభావోక్తులు, లోకోక్తులు గల్గియున్నది. వర్ణనా బాహుళ్యములేక భావములను చక్కగా స్వాభావికముగా చిత్రించినాడీ ద్విపదకవి. ఈ కథనే యుండగా గొని శంకరకవి ప్రౌఢమైన కావ్యము వ్రాసెను. అక్కడక్కడ ప్రబంధ లక్షణము లున్నను యీ కవి కవిత పురాణ కవిత్వమును బోలి యున్నది. కథా వైశద్యమున్నది. వర్ణనలమధ్య విషయము కుంటుపడ లేదు. ధార నిరాఘాటముగానే యున్నది. భారతమున నన్నయగారికి వలె ప్రవాహవేగము చూపు పద్యము లనేకములుగలవు. వర్ణనలలో నౌచితి కొంత తగ్గిన దనక తప్పదు. ఉదాహరణకై యొక పద్యము చూడుడు. చంద్రమతి తన పుత్రుడు సర్పదష్టుడై చనిపోయినప్పుడు దహన సంస్కారము చేయుటకు స్మశానమునకు గొనిపోయి, యందు

పాతిపెట్టుటకు చోటు దొరకక దుఃఖించుచు పల్కిన పలుకులు :

మ॥ అకటా! చేరదు నేలకుం గనఁడె. సప్తాంబోధి వేష్టితభవ
త్సకల ద్వీప కలాప భూప మకుటాంచ ద్రత్నరాగోల్లసత్
ప్రకటాసర్గళ నిర్గళత్కిరణ గుంఫశ్రావమద్దైవశ్రీ రా
జు కుమారుండని యేడ్చె కన్నగవ నశ్రుల్ వ్రాల్పై పారగన్ ॥

చంద్రమతి సుతుని చావునకై విలపించుచు మాటల గద్గదిక దోచుపట్టున గ్రుక్క దిప్పకుండా నేకధాటిగా ప్రవహించు దీర్ఘ సంస్కృత సమాస ధాటి చూపు పద్యము వ్రాయుట యుచితమా? యను శంకగలుగకమానదు. అట్లే హరిశ్చంద్రుడు కాశీనగరమున గాధేయుని ఋణము దీర్చుటకై తన భార్యయగు చంద్రమతిని దాసిగా విక్రయించుటకై వీధిలో కేకలు వేయుపట్టున వ్రాసిన పద్య మౌచిత్యము దప్పిన దనక తప్పదు. దాసిగా నుండవలసిన దానినిగూర్చి: నమ్మకమైనది, కష్టపడి పనిచేయునది, ఓర్పుగలది, కోపిష్టికాదు, కలహమాడదు, గయ్యాళికాదు మంచిది యని చెప్పుట యొప్పునేగాని,

సీ॥ నిద్దంపు నును మించు టద్దంపు ప్రహసించు
ముఖమండలముగల మోహనాంగి........

అని యామెచక్కదనమును నఖ శిఖ పర్యంతము శృంగార రసోద్దీపన గల్గునట్లు హరిశ్చంద్రుడు వర్ణించుట స్వభావ విరుద్ధము, అనూహ్యము. కవి యుచితజ్ఞత చూపలేదు. అయినను కవి తక్కిన చోట్ల చంద్రమతి పవిత్రత, పాతివ్రత్యము, శీలము మున్నగు సద్గుణ పుంజము మంజులముగా వర్ణించియే యున్నాడు.

సీ॥ పరమపావన తేజ పావకసదయాత్మ
హరిణాంకమౌళి పర్యాయకాయ
యనఘ పాతివ్రత్యమున మనోవాక్కాయ
కర్మ విస్ఫూర్తిచే ధర్మ నిరతి
బూని చరించితినేని మత్ప్రాణేశ్వరుడు
సూనృత వచోరూఢి మెఱసి
భూనుతకీర్తి విభూతి శోభితుడేని
శీతకరాకృతి శిష్యునకును

విశదవాత్సల్యమున మున్ను కుశల మెసగి
పిదప కౌశిక ఋణము సంప్రీతి దీర్ప
గూడునట్టుల బెనిమిటి కొడుకుగరుణ
నరసి రక్షింపవయ్యా జోహారు నీకు ||

ఇట్టి ప్రౌఢమై, యుచితమైన పదప్రయోగములుగల పద్యములు బహుళముగా గలవు.

మొత్తముమీద నన్నయ కవితా ప్రవాహ రీతు లీ పురాణ ప్రబంధమున దోచుచున్నయవి.

## మాదయగారి మల్లన

ఇక మధ్యకవులలో కొందరు తమ తమ కావ్యములను పూర్వ కవుల ననుసరించియును, భారత కవిత్వ వైఖరులను వ్రాయక పోతన గారి లలిత మధురపదములతో సుకుమారముగా వ్రాయుట కారంభించిరి—మాదయగారి మల్లన, కూచిమంచి తిమ్మనకవి, కణాదము పెద్దన సోమయాజి మొదలగువారు. అందు మాదయగారి మల్లన, కవి స్మరణ చేయుచు, కవిత్రయమును మనోహరముగా వర్ణించి వారి యెడల గౌరవ మిట్లు చూపెను:

సరస సంస్కృత పుష్పగుచ్ఛ ప్రభూత
మగు తెనుంగను నెత్తావి కఖిల దిశల
తరుణ పవమానమగు కవిత్రయ విశేష
చతుర వాచానిరూఢి కంజలి యొనర్చి||

యనెను. ఈతని కవిత్వమున నత్యంత మనోహర సౌకుమార్యము దీపించును. మచ్చున కొక పద్యము వ్రాయుదును:

శా|| కేళీకాంచన సౌధవీధికల చక్కిం దొట్లలో బెట్టియో
ప్రాలేయాచల కన్యకాధవ, కృపాపారంగతా నిద్రవో
వ్వె లావణ్య పయోనిధీ యనుచు నావిర్భూతమోహంబునన్
జోలల్పాడెద రప్సరోరమణుల్ శుద్ధాంత ముగ్ధాంగనల్ ||

ఈ కవి వ్రాసిన కావ్యములలో రాజశేఖరచరిత్ర ప్రధానమై ప్రశస్తిగాంచినది. లావణ్యము, ప్రౌఢిమ, అలంకారములు అన్నియు గల్గి చదువుట కింపుగా నుండును.

## కూచిమంచి తిమ్మన

మధ్యయుగ ప్రబంధకవుల కాలమునకుపిమ్మట 18-వ శతాబ్దము నందున్న మహా కవి కూచిమంచి తిమ్మన. ఈ కవి బహుగ్రంధముల రచించి లాక్షణికుడై, కవిసార్వభౌము డను బిరుదము వహించినాడు. తిమ్మన కవి శివ భక్తుడు. పీఠికా పురమునంగల కుక్కుటేశ్వరస్వామి సేవనాపరుడు. రసిక జన మనోభిరామము, రుక్మిణీ పరిణయము, రాజ శేఖర విలాసము, నీలాసుందరీ పరిణయము, అచ్చ తెనుగు రామాయణము, సింహాచల మహాత్మ్యము, సారంగ చరిత్ర, శివలీలా విలాసము అనునవి యితని కావ్యములు. ఇంతేగాక కుక్కుటేశ్వరశతకము, మరికొన్ని శతకములుగూడా రచించెనట. ఈ కవి వ్రాసిన కావ్యములలో మొదటిది ప్రౌఢమై వసుచరిత్రవలె వ్రాయ ప్రయత్నించి వ్రాసినది. సామాన్యముగా నీతని రచన మధురమై, సులభమై, శబ్దాలంకార సంభృతమై సొంపుగా నుండును. సంస్కృత దీర్ఘసమాసములు సయితము రమణీయ గీర్వాణ మృదుపదభరితమై తేనెసోనలు జాల్వారుచుండును. అందుచేతనేకాబోలు నితని కవితనుగూర్చి యేనుగు లక్ష్మణకవి:

కం ॥ హాటకగర్భవధూలీ
లాటనచవితాంఘ్రి నూపురా రావ శ్రీ
పాటచ్చరములు తేనియ
తేటలు మా కూచిమంచి తిమ్మయ మాటల్ ॥

అని చెప్పెనట. రుక్మిణీ పరిణయము కూడ ప్రౌఢ ప్రబంధమే. 4, 5 కావ్యములు అచ్చ తెలుగు కావ్యములు. 7-వది లక్షణ శాస్త్ర గ్రంధము. ఈ కవికి పోతరాజుపైన నత్యంత భక్తి. ఆయన కవితయే యీ కవికి వరవడి. పోతరాజుగారివలెనే తిమ్మకవి తన కావ్యములను

నరాంకితము చేయక కుక్కుటేశ్వరస్వామి కొసంగెను. పోతనగారి కవిత్వములో లక్షణ దోషములున్నవని యితరులన్నచో నదియు సహింపలేడు. అప్పకవి పోతరాజుగారి కవితలో లక్షణదోషము లున్న వన్నందుకు సమాధానముగా తిమ్మన లక్షణ సారసంగ్రహమున :

సీ॥ అఖిల వేదాంత విద్యా రహస్య విదుండు
సహజ పాండిత్య విశారదుండు
మర్త్యక్షితీశాధమస్తోత్ర విముఖుండు
శంభుపదాబ్జ పూజారతుండు
రఘుకులేశ నిదేశ రచిత మహాభాగ
వతపురాణుడు పుణ్య వర్ధనుండు........
బుధజన నుతుండు బమ్మెర పోత సుకవి
కొన్ని రేఫ ఱకారంబు తెలుగడనచు
నజ్ఞు లోక కొందరాడుదు రామహాత్మ
కవిత కెందును లోపంబు గలుగ దభవ !

అని పోతనగారి గొప్పదనము నభివర్ణించి తనకుగల గౌరవము వెల్లడించెను.

ప్రబంధ లక్షణములు లన్నియు గూర్చినను ముద్దులొలుకు పద్య రచన చేయుటలో నీ కవి యధికుడని చెప్పవచ్చును. చూడుడు రుక్మిణీ పరిణయమున :

ఉ॥ విందము ముందు వీనుగవ విందుగ పొందుగ నందు మందసా
నందము నందము న్మెలయ నవ్యవిలాస కళాసమగ్రుడై
సుందర మందహాస రుచిశోభిల వ్రేతలగూడి యాడు గో
విందుని చెంద ముంజెలులు వేమరు నేమి వ్రతంబు నోచిరో ॥

ఉ॥ సారము ముద్దుబల్కు ఘనసారము నిద్దపుమేని తావి కా
సారము నాభి రంధ్రము విసారము తేట మిటారి చూపు శ్రీ
కారము కర్ణయుగ్మము చోకారము నవ్వు మొగంబు పట్పదా
కారము వేణి సన్మధు వికారము మోవి వధూ లలామకున్ ॥

అట్లే రసిక జన మనోభిరామమున శైలి మార్దవము, తెలుగు పదముల సొంపు, పెంపు గల్గియున్నది. వసుచరిత్రవలె ప్రౌఢ ప్రబం

ధము వ్రాయు తలంపుతో నీకవి కావ్యము వ్రాసెను. కాని వసుచరిత్ర పాటవము, చేవ, భావ సౌందర్యము, శ్లేషలు, వర్ణనా వైభవము దీనికి రాలేదు. ఈ కవియు భక్తుడని మున్నే చెప్పియున్నాను. పోతనగారు శ్రీ విష్ణుమూర్తినివలెనే తిమ్మనగారు కథా సందర్భమున నవకాశము గల్పించుకొని శివుని వైభవము వర్ణించును. భారత కవిత్రయ కవితా ప్రభావ మీకవి కవితపై నంతగా ప్రసరించెనన వీలులేదు. కాని బహుళముగా తెలుగు పదములు ప్రయోగించుట మాత్రమే గలదు. కనుంగొనుడు :

తే॥ మీరు మే లోర్వ లే కెంత మిట్టి పడిన
నేణము బ్రాణమై నెంత యెగిరి పడిని
తూపు తీపార నిల నెంత తూలి పడిన
జెలువ నిడువాలు జూపుల గెలువ గలవె ?

## కనుపర్తి అబ్బయామాత్యుడు

ఈ తిమ్మకవి రచించిన రసిక జన మనోభిరామమునకంటె నెక్కుడు ప్రౌఢముగను, రసస్ఫూర్తితోడను కవిరాజమనోరంజన మను నొక్క యుద్గ్రంథమును వ్రాసిన కనుపర్తి అబ్బయామాత్యకవి యొకడు గలడు. ఈ కావ్యము నతడుగూడ వసుచరిత్రవలె నుండునట్లు రచించుటకు ప్రయత్నించెను. ఆ గ్రంథమునకు పిల్లవసుచరిత్రమను విఖ్యాతి కొంత వరకు లభించెను. అనిరుద్ధ చరిత్ర మను నింకొక కావ్యము సహిత మీ అబ్బయామాత్యుడు రచించెను. రామరాయ భూషణునివలె నీతడును కవియేగాక సంగీతజ్ఞానము గలవాడని తానే :

కం॥ శ్రీ మంగళగిరి నరసిం
హామేయ కృపా విజృంభితాద్భుత కవితా
శ్రీ మంతుడ గాన కళా
ధీమంతుడ దేవతాస్తుతి వ్రత పరుడన్ ॥

యని ప్రకటించుకొనియున్నాడు. ఈ కవి 18–వ శతాబ్దముననున్న కవులలో సుప్రసిద్ధుడే.

ఈతని "అనిరుద్ధచరిత్రము" లోని :

ఉ|| మీసము తీరు జూచి జిగిమేని పటుత్వము జూచి మోములో
హాసము జూచి జూపుల నొయ్యారము జూచి మనోజ్ఞరూప రే
ఖాసమలీల జూచి యహహా యనుచుం దలయూచి ముందు తా
వ్రాసిన భావమెంచి దలవంచు కొనెన్ లలితాంగి సిగ్గునన్ ||

పై పద్యము సొబగుగా, జిగిబిగివితో నడచినది. ఉన్నతభావ కల్పన చక్కగా పోషించియున్నాడు. కవిరాజ మనోరంజనమున బృహస్పతి భార్యయగు తార దుష్టచరిత్రము తెలిసికొన్న తరువాత సయితము తారను పరిత్యజించక తిరిగి తన భార్యగా పరిగ్రహించు సందర్భమున అబ్బయామాత్యుడు ప్రౌఢవాక్యములతో నిట్లు గురుని చర్యను నిరసించినాడు :

సీ|| సకియకాను దలంచి సన్మార్గ మనుగాని
యింతి దుర్మార్గత సెంచదయ్యె
అతివ మోము దలంచి యకలంక మనుగాని
తెఱవ కళంకంబు తెలియదయ్యె
సుదతి నవ్వు దలంచి శుచి యనుగాని
యవ్వెలదుక యశుచి భావింపదయ్యె........
గురునివంటిమహాత్ము డక్కరణి తరుణి
చక్కదనమె గుణంబుగ సంస్మరించు
గాని వ్యభిచారదోషంబు గాంచదయ్యె
నజ్ఞుడన ప్రాజ్ఞుడన నెవ్వ రవని నింక ||

ఈతని కావ్యముల రసౌచిత, గంభీరభావములతో బాటు కొన్ని చోట్ల భారత కవుల శైలివలె ప్రౌఢముగా నుండును. అద్భుత కవితా శ్రీమంతుడ నని తాను చెప్పికొన్నట్లు తన కవిత్వ మద్భుత ధోరణి గలదిగానే యున్నది. భట్టుమూర్తి రచించిన వసుచరిత్రము తరువాత నీ కవి రచించిన కవిరాజ మనోరంజనముతో తులతూగగల ప్రబంధ మాంధ్రమున నొకటి, రెండుకంటె నెక్కుడుగా లేవని ఆంధ్ర కవుల చరిత్రకారుడగు వీరేశలింగముగా రభిప్రాయపడియున్నారు.

ఈకవి :

చం॥ కొడుకులు గల్గుదాక నొక కొన్నిదినంబులు చింత, నందనుల్
పొడమిన నాయువు, న్బలము, బుద్ధియు, విద్యయు జాలగల్గగా
నడుగని చింత, కల్గి తనునోలి భజింపని చింత, తండ్రి కెప్పుడు
గడుచింత సేయుదురు పుత్రులు శత్రులు గాక మిత్రులే॥

చం॥ అనవుడు మందహాసముఖుడై, హరి నీభుజశక్తి నీవె నె
మ్మనమున లజ్జ లేక పలుమారును మెచ్చుకొనంగ నీతియే
యని మొన నిల్చినప్పుడు నిరర్థక మీవెడమాట లేల నా
కొని భుజియింపబోవుచును కూరల మే లడుగంగ నేటికిన్॥

ఇట్టి తిక్కనరీతిగను:

ఉ॥ భూసుర వేదనాదముల పుణ్యసతీ జన మంజులోక్తులన్
భాసుర నృత్త గీత రసబంధురరావములంబు రవనీ
వాస శుకానులాపముల వారణబృంహితహాజి హేషలన్
శ్రీసముదంచితంబగుచు చెల్వువహించె పురంబు నవ్యమై॥

ఈ తెరంగు నన్నయ ధారా విలాసంబును గల్గి కేవల ప్రబంధ లక్షణ పూరితమై యుండక పురాణకావ్యరచనతో నొప్పి రసము చిప్పిలుచుండును. ఇన్నిమాటలేలన భారత మహారామమున కవిత్రయ మచ్చటచ్చట సమస్తవిధములైన మొలకలు నాటినందున తరువాత కవులు తమ తమ మంది రోద్యానము లనే మొలకలు ప్రయత్నించి నాటినను మహారామమునం దెచ్చటనో యొకచోట మూలాంకురము గనుపడుచునే యుండునుగదా? కవు లందరు కవిత్రయ భారతమును చదువకుండ యుండనందున అందుండి యెవరికే మొలక కావలసిన వారా మొలక దెచ్చి యుపయోగించుకొనుచుండిరి.

## అయ్యలరాజు నారాయణ కవి

ప్రాచీన కవులలోగాని మధ్యకాల ప్రబంధకవులలోగాని చేరక నూతనపంథా ప్రోక్తి, ప్రౌఢమైన కవిత నల్లి, ఫింత వింత, భావము లతో కవితా విలాసము జూపిన నారాయణామాత్య కవినిగూర్చి కొంత

చెప్పవలసియున్నది. ఈ కవి మిక్కిలి స్వతంత్రుడైనట్లు దోచుచున్నది. శ్రీ రామాంకితముగా "హంసలింశతి" యను చిత్రమైన గ్రంథము నీతడు రచించెను. 19-వ శతాబ్దమువాడే సనవచ్చును. ఇంగ్లీషు అను పదప్రయోగము పంచ మాశ్వాసమున కనబడుచున్నది. అన్యదేశీయ పదములకు లెక్కలేదు. అందుచేత నితడు అర్వాచీన కవుల తరగతికే చెందియున్నాడు. కవిత్వమున ప్రాగల్భ్యము గలదు. ఈ కవి కంద పద్యములు తిక్కన కంద పద్యముల కేమాత్రము తీసిపోవని కొందరి యభిప్రాయము. నిజముగా తిక్కన కందములకంటె నొకొక్కచోట నెక్కుడందము చిందించెననుటకు సందేహపడనక్కరలేదు. ఈ కవి కావ్యము చదివినచో ననేక గ్రంథములలో గానరాని విషయ విజ్ఞానము గలుగును. ఉదాహరణకు, నదీవర్ణనము చేయునప్పు డీ కవి దేశమునందున్న సమస్త నదుల పేర్లు పేర్కొనును. అట్లే గిరులు, పుణ్యక్షేత్రములు, కాననములు, ప్రసిద్ధమైన పట్టణములు, చక్రవర్తులు, కీర్తికెక్కిన రాజులు, జంతువులు, రత్నములు, గనులు, విద్యలు ,కళలు, ధాన్యములు, అది యిది యననేల ? సమస్త సమాచార సంభరిత మగున ట్లీతడు కావ్యమున పొందుపరచినాడు. మిక్కిలి శ్రమచేసి వ్రాసినాడు. తెలుగు నుడులు చేమకూర వేంకటకవికంటె సొగసుగా కూర్చినాడు. ఒకే యర్థమును దెలుపు పదము లెన్నియుండునో యాపదములన్నియు నొకచోటనే చెప్పి విద్యార్థులకు మహోపకార కరమగు నట్లుగా జేసినాడు.

ఒక రాజును వర్ణించుచు నీతని,

సీ॥ వెలయ హరిశ్చంద్రు విధమున, నలుని వీ
కను, పురుకుత్సు చాడ్పున, పురూర
వుని లీల, సగరు లాగున, కార్తవీర్యు మ
ర్యాదను గయ క్రియ, నంబరీషు
మతమున, శశిబిందుమహిమ, నంగుని శేవ
పృథుని మాడ్కి, మరుత్తు వృత్తి
భరతు రీతి, సుహోత్రుని భాతి, భార్గవు
వోలె, రాము పోలిక, భగీరథుని పొలుపు

న, శిబి సంగతి, మాంధాత నయము
నను, యయాతి కరణి, దిలీపుని యట్ల
రంతి రీతి, నా చక్రవాళపరితభూత
ధాత్రి పాలించు సువిభుండు, తద్విభుండు ॥

అని యనేక తెలుంగుల పదముః లేకార్థద్యోతకముల గూర్చెను. ఈ కవి సంస్కృత సమాసములు, దేశీయపదముల గూర్పు రమణీయము. తిక్కన కందముల భంగి నొప్పు కందములే గాక నిరంకుశముగా నేరీతి కావలసిన నా రీతి పద్యము లల్లగలడు. తిక్కన విరాట పర్వమున కీచకుని విరహావస్థ వర్ణించిన :

చం॥ తలరుల సందుఁ జవయు తాపభరంబున వెచ్చనూర్పు మే
నలయఁగ నొల్లఁబోవు బెగడందు, కలంగు, బరిభ్రమించు, కొం
దలపడు తల్లడంబడరి ధైర్యము దూలిన, బెగ్గడిల్లు వి
చ్చలవిడి బేర్చు నెవ్వగల సందడి డెందము గంది చెప్పెడున్ ॥

పై పద్యమువలెనే నారాయణామాత్య కవి :

ఉ॥ చెక్కట చేయి జేర్చుకొని చింతిలు నుస్సురటంచు జూపులన్
వెక్కసమంది లేమ రెలమిం బొడగట్టిన యట్లునుండఁగా
నక్కన జేర్చబోవు భ్రమమందు వెసం దలయూచు నంతలో
బక్కన నవ్వు నింతిపయి బాళి కృపాలక మూళి ఖిన్నతన్ ॥

ఇక నన్నయగారు :

ఉ॥ దాని శరీర సౌరభము దాని విలోల విలోకనంబులున్
దాని మనోహరాకృతియు, దాని శుచిస్మిత వక్త్రకాంతియున్
దాని విలాసమున్ గడు ముదంబున జూచి మనోజబాణసం
తాన హతాత్ముడై........

అని వ్రాయగా నీకవి :

ఉ॥ దాని ముఖప్రభాగరిమ, దాని కపోల కళా విశేషముల్
దాని బెడంగు చూపులును దాని కుచంబులబెందు నందమున్
దాని వచోవిలాసములు దాని కచాళి రుచు ల్గణింపగా.......

ఈపద్యమును వరవడి వ్రాసినట్లున్నది. కవిత్రయము వారివంటి పద్యములకు, కందములకు కొదువ లేదు. ధార నిరాఘాటముగా నుండును. కవిత్రయ కవితా ప్రభావ మీ కవిపై కొంత ప్రసరించె ననక తప్పదు.

# హరిభట్టు

ప్రబంధకవిత్వ లాలసులై, ప్రబంధములు రచించుటే కీర్తిసంపాదనా సాధనమని పెక్కండ్రు కవులు దలంచినను అచ్చటచ్చట కొందరు మాత్రము పూర్వకవులవలె సంస్కృత పురాణములు తెనిగించుటకు సాహసించిరి. అట్టివారిలో "హరిభట్టు" యొకడు. ఈ కవి 17-వ శతాబ్దమందున్నవాడని చరిత్రకారులు తెలిపిరి. హరిభట్టు వాయుపురాణము, మత్స్యపురాణములు నాంధ్రీకరించెను. అనువాద సరణి పూర్వులవలెనే మనోజ్ఞముగా నున్నది. నన్నయగారి రీతి మధురపదగుంభితమై శ్రావ్యమైయున్న నీతని కవితాధార పురాణ ఫక్కి బోలియున్నదని వేరుగా చెప్పనక్కరలేదు.

చం|| అమృతప్రాయ వచోవిశేషరచనాహంభావపుంభావ వా
గ్రమణీమూర్తివి, వేదశాస్త్రనిఖిలగ్రంథార్థనిర్ణీతి నే
కముఖబ్రహ్మవు యాజుషప్రకటశాఖాధర్మధుర్యుండవ
ర్యమతేజుండవు రామనార్యహరిభట్టా! సత్కవిగ్రామణీ||

అని కృతిభర్త తన్ను సంభోదించినట్లు వ్రాసుకొనియున్నాడు. ఈపద్య మాతని శక్తియును, శైలియునుగూడ దెలుపుచున్నది:

ఉ|| మిక్కిలి శీతలాంబువులు మేనికి గీడు మహోష్ణవారిచే
పొక్కు శరీర మీయు భయము దొరలించిన నింపొనర్చు ని
ట్లొక్కసియంబయొండె భయమొండె యొనర్చక తద్వయంబు దా
నిక్క వెఱంగిచూపు మనుజేంద్రునకు న్వశులౌదు రందరున్||

చం|| తిరిగితి కాననంబు లతితృష్ణజలింపక దద్వనంబునన్
దొరకవు కందమూలములు తోయజనాభునియాజ్ఞ గాక యి
ప్పురిమున నన్నపూర్ణపరిపూరితయై విహరింపుచుండగా
కఱవగునే తదన్నములకాలము నన్మన మందిరంబులన్||

మ|| రమణీ బంధు జనాప్తుల నిడ్చిచి తద్రాజ్యంబు వర్జించి దు
ర్దమకామాదుల జెందనీక హృదయ స్థైర్యంబున న్నించి నీ
వమితోద్యద్గుణకీర్తనామృతముచే నాహ్లాదయుక్తుండవై
విమలాత్మ కరణుండవైన నిను నే వీక్షించితిన్ బుత్రకా||

ఇట్లే పూర్వ రమణీయశైలితో మారన మొదలైన కవుల రీతు లతో రసవంతముగా నాంధ్రీకరణ జేసిన యీకవి శ్లాఘనీయుడు.

## ఏనుగు లక్ష్మణకవి

సంస్కృతగ్రంధముల ననువదించి తెలుగున రచించిన ఏనుగు లక్ష్మణకవి భర్తృహరి నీతి, శృంగార, వైరాగ్య శతకములను రమణీయముగా, ప్రౌఢముగా వ్రాసినాడు ఈకవి ధోరణి నన్నయను దలపించును:

శా॥ ఆకాశంబు నుండి శంభుని శిరంబందుండి శీతాద్రి సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి భూలోకంబునం దుండి య
స్తోకాంభో నిధి దానినుండి పవనాంధోలోకముంజేర గం
గా కూలంకష పెక్కుభంగులు వివేకభ్రష్ట సంపాతముల్ ॥

ఈ ధార నన్నయదే, అయినను ప్రబంధ కవిత్వ పరిపాటిగల యీ కవి తాను వ్రాసిన "రామవిలాసాది" ప్రబంధములలోని రచన భర్తృహరి నీతి శతకాను వాదశైలిలో గాక ప్రౌఢ ప్రబంధ కవనమునే యాశ్రయించెను. దండకములు, శతకములు సయితమీ కవి రచించియుండెను. పూర్వకవులలో నన్నయగారే దండకము వ్రాయ నారంభించినందున దరిమిలా కవులలో పెక్కండ్రు శ్రీనాధాదికవులు సయితము దండకాదులు తమ తమ గ్రంధములలో రచించియున్నారు. ఆ యానువాయి నేటికిని వచ్చుచునేయున్నది. సామాన్యముగా దండకములలో నేదేని యొకే విధమైన యుద్వేగము గనుపడుచుండును. నన్నయభట్టు భక్తి యుద్రేకము చూపుటకై వ్రాసియుండెను. అనేక యితరుల దండకములలో భీభత్సము, ఆశ్చర్యము గల్గునట్లుగా యమక గమకముల నేకధాటితో వచ్చునట్లు రచించిరి.

## యొడ్డెపూడి పెద్దన

దాదాపు యితని కాలములోనే యుండిన నీ యొడ్డెపూడి పెద్దన కవి వాయుపురాణము రచించి పురాణశైలి నవలంబించెను.

మ॥ కడు దూరంబుననుండి మేను వడకంగా పాదముల్ తొట్రిలన్
వడచే జిక్కి హరీ యటంచును గృహద్వారంబు జేరంగ నే
నిడగాబంచితి నీరసాన్న మతడున్ హేయంబుగా జూడకే
కుడిచెన్ తత్కలుషంబుచేయు కతనన్ ఘోరాటవీభూములన్ ॥

మ॥ కరణోచ్ఛాదితమై ఘనాఘనబృహద్గర్జారవోపేతమై
వరవిద్యుల్లతికాతతి ప్రబలమై వాస్తోష్పతీష్వాస బం
ధురమై, సర్వదిశాభిభాగములు నస్తోకాంబు పూర్ణంబుగా
కురిసెన్ వర్షము నీపజప్రజము సంక్షోభింప భీమంబుగన్ ॥

ఇట్లు హరిభట్టు, యొడ్డెపూడి పెద్దన, వెన్నెలకంటి సూరన, పాపరాజు, సింగయ, మల్లన కవులు వీరందరు భాషాంతరీకరణమొనర్చి పురాణ కావ్యశైలి యవలంబించిన కవులే. వీరందరిమీదను కవిత్రయ కవితా ప్రభావము, యే యొక్కరిదైనను, ప్రసరించియున్నదని నొక్కి వక్కాణింపనగును.

## రామరాజు రంగప్పరాజు

పైనదెల్పిన ప్రసిద్ధకవులు గాక ...క్కం ద్రితర కవులు పలు తెలుంగుల కావ్యముల రచించి యాంధ్ర ..షా యోష కమూల్యాలంకారముల గై సేసి యున్నారు. వారి కా.. ము లనేక కారణములచేత ..జలలో నెక్కువగ వ్యాప్తి కాలేదు. చ..త్రకారులు వారికావ్యముల బేర్కొనియే యున్నారు. అందు కొందరు కవులు భారత కవిత్వమునే ..కు కన్నులముందు నిలిపికొని ప్రౌఢము.. , హృదయాహ్లాదకరముగా, ..ను కవిత్వము నడపినారు. వారిలో రామరాజు రంగప్పరాజను ..త్రియ కవి యొకడు. ఈ కవి సాంబోపాఖ్యాన మను గ్రంథమొండు రచించి, నన్నయ, యెఱ్ఱనలవలె నిరర్గళ కవితాధార జూపగల్గినాడు.

మ॥ పరమజ్ఞాని హృదంతరాబ్జ మణి పీఠంబుల్ సమన్నాగ కి
న్నర నక్తంచర నాక నాయక శిరోనాళీక రాగ ప్రభాం
కురసీరాజితముల్ నిజాంఘ్రి తలముల్ గోపాల బాలుండు ని
ల్పి రచల్గా ఖుర ధూళి ధోరణుల నా బృందావన క్షోణులన్॥

ఉ॥ ఆనియమంబు నాయమము నాదము మాశమమానిరంతర
ధ్యానవిధానమా బహువిధాసన బంధ విదగ్ధభావమా
మానసమెంతయుం జని మట్టుము, గుట్టుము మానులౌననం
గా నతడొప్పె, భక్తి కళికా కిలికించిత బోధ మాధురిన్॥

ఇట్లే చిత్రకవి రమణకవి రామాయణమును, అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయ మను రామ కథను రచించిన ప్రౌఢ కవులు. వీరిపై భారత కవుల ప్రత్యక్షప్రభావము లేకున్నను ప్రౌఢిమ అర్థసారస్యము, భారతానుసరణమే యనవచ్చును. రమణకవి రామాయణశైలి తిలకింతము:

శా॥ దేహం బస్థిర మెల్లవారలకు ధాత్రీభాగమందేల, యి
ట్లూహాపోహలు జేయ నీతనికి మున్నుత్సాహియై యుత్తునం
చాహా పల్కితి విష్టబద్ధములు పెక్కాడంగ యుక్తంబులో
నా హేయాంగము దీని నమ్మి యిటులేలా దబ్బర ల్పల్కగన్॥

ఉ॥ బంగరు మేని నిగ్గయిన పర్వతమో యన నైజగాత్ర ము
త్తుంగము గాగ బెంచి మతితోడను పాశములెల్ల నూడ్చి సా
రంగ పరంపరం గదుము రాజిత భీకర సింహమో యనన్
పొంగుచు వెంటవచ్చు దితి పుత్రుల బోవగ దోలె రోషియై॥

ఇక నయ్యలరాజు రామభద్ర కవియును మిక్కిలి ప్రౌఢకవి. ఈతడు అష్టదిగ్గజము లనబడు పెద్దనాది కవులలో నొకడను జన ప్రవాదము గలదు. కాదని కొందరి మతము. అందలి సత్యాసత్యము లెట్లున్నను, రామభద్రు డాకాలముననే యుండెనని యే నమ్మెదము. ఈ కవి రామరాజ భూషణునకు సమకాలికుడనియును, రామరాజ భూషణుని వసుచరిత్రలోని "మోహోపదేశతమో ముద్రితములైన కనుదమ్ముల హిమాంబు లుడపరాదు" అను పద్యము నితడు వ్రాసినదే యను వదంతులు సత్యదూరములైనను భట్టుమూర్తికంటె నధికుడని తెలు

పుటకు మాత్రమే యట్టి వదంతులు పుట్టినవని చెప్పదగునేమో? ఏది యెట్లున్నను మనకు కావలసినది యాతని రచనా విధానము మాత్రమే. తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యమునందువలె పదగుంభనము గల్గి యమకాలంకారములు గల్గి రసవంతముగనున్న యీ కవి కవిత్వము కొన్ని కొన్ని చోట్ల నన్నయధార కనిపించుచుండును.

ఉ॥ వింధ్య మధిత్యకాకటక విస్ఫుటపాదప పుష్పగుచ్ఛసౌ
గంధ్యము హేమధాతుమయకల్పిత సంధ్యము బద్ధమేరు సా
గంధ్యము, చండకేసరి నికాయ నిరాకృత భద్రదంతి ద
ర్పాంధ్యము గ్రుంగ గ్రొక్కితి మహాగుణభూషణ సత్యభాషణా ॥

రామాభ్యుదయమున కొన్ని కొన్ని చోట్ల మృదువై ద్రాక్షాపాకము సొంపులు చూపట్టును:

ఉ॥ అక్కట కోసలక్షితి వరాత్మజ కానక గన్నముద్దులే
జక్కని మంచిరాకొమరు చందురు డెక్కడ యధ్వరావనం
బెక్కడ దైత్యసంహరణ మెక్కడ ఘోరవనాంతరశ్రమం
బెక్కడ యెట్లు లంపు మనియెన్ముని నోరెటులాడె నింతకున్ ॥

సీ॥ కానకగన్న సంతానంబు నేటికి
కానకే గన్న సంతాన మయ్యె
పుణ్యాజనోత్కీర్ణ పురుషుండు నేటికి
పుణ్యాజనోత్కీర్ణ పురుషు డయ్యె
గోత్రపావనుడైన కొమరుండు నేటికి
గోత్రపావనుడైన కొమరు డయ్యె........

ఇత్యాది పద్యరచనావైఖరి జూడ నిరర్గళముగా నెట్టి శైలినైనా వ్రాయగల మహాకవియని దోచును. భారత కవులయం దెక్కువ గౌరవ మీతడు ప్రకటించెను. చూడుడు :

ఉ॥ నన్నయ తిక్కనాది కవినాథులు జెప్పినయట్లు చెప్ప లే
కున్నను తదుత్తరాంధ్ర కవు లూరకయుండిరె తోచినట్లు ని
త్యోన్నతబుద్ధి కబ్బములయోజ రచింపక.......

## వర్తమానకవులు

ఈ రకపు ప్రబంధకవుల తరువాత రాను రాను ప్రబంధకవులకు సయితము వానియందు మోజుతగ్గినది. ప్రబంధములన్నియు యించుమించు నొకేరీతిగా వ్రాయుపద్ధతియందు యేవగింపు గల్గెను. శిష్టు కృష్ణమూర్తి, మండపాక పార్వతీశ్వరులును, గోపినాథం వేంకటకవి మున్నగు మహా పండిత కవులు తమ తమ విధానములు వేరుగా నిర్ణయించిరి. ఈ అర్వాచీన కవులకు ప్రాచీనకవులపై గౌరవ మధికమై పూర్వకావ్యములు యథాతథముగా ననువదింప నారంభించిరి. అట్టి వారిలో ముఖ్యులు గోపీనాథం, దాసు శ్రీరామకవి, కందుకూరి వీరేశలింగార్యులు, ములుగు పాపయారాధ్యులు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, తిరుపతి వేంకటకవులు. వీరిలో పాపయారాధ్యులు ఉద్దండపండితులు, ప్రౌఢ విద్వత్కవి. రామాయణానువాదకులు గో॥ వేంకటకవి, వా॥ సుబ్బారావుగార్లు. వెంకటకవి వాల్మీకి కవితారసమును మనోహర మృదుశైలిలో చక్కని యనువాద మొనర్చెను. ఈతని రామాయణమే తక్కిన అన్ని తెలుగు రామాయణములలో నగ్రగణ్యమని చెప్పనొప్పును. ఈ కవి బ్రహ్మకైవర్త పురాణమును, భగవద్గీతలను, రాఘున కవికృత శిశుపాలవధను ఆంధ్రీకరించెను. ఈతని భాషాంతరీకరణము మెచ్చదగినది. పూర్వకవులు మారన, సింగనలతో నీ కవిని బోల్పనగును, మృదు పదప్రయోగఘటితమై శైలి చదువువారికి హృదయాహ్లాద మొనరించుచుండును.

ఉ॥ చందురువంటి నెమ్మొగము చారెడు గన్నులు వృత్తదంష్ట్రిముల్
సుందర పల్లవాధరము సోగకురుల్మణి కుండల ప్రభా
బంధుర కర్ణయుగ్మమును బారెడుచేతులు గల్గు రామునిం
పొందగ జూడకున్న నిలుపోప దరంబె సుమంత్రయుత్తరన్॥

చం॥ సలలిత శుద్ధ తోయములు చారుమణిదళ పద్మకైరవో
త్పలములు గంధలుబ్ధకసుతాన మధువ్రత గీతనాదముల్
కలరవచక్రకుక్కుట మరాళమనోహరమంజు శబ్దముల్
గలిగి మనోజ్ఞ సంపదలుగ్రాలు విశాల సరోవరం బొగిన్॥

ఇట్లున్న ఈకవి కవితనుగూర్చి ముచ్చట నింతటితో విరమించితముగాక,

## మండపాక పార్వతీశ్వర కవి

పూర్వకాల కవితారీతులు వెలయించి, సుమారెనుబది గ్రంథములు రచించి, అఖండధార, మధురిమ, విద్వత్తు, రసోత్కర్ష పెంపారునట్లు కవిత చెప్పిన మహాకవి మండపాక పార్వతీశ్వర కవి. ఈ కవి తాను మండపాక కామేశ్వర పార్వతీశ కవీశ్వరుడనని వ్రాసికొన్నాడు. ప్రబంధ సంబంధ నిబంధన గ్రంథమును, శ్రీ కృష్ణాభ్యుదయమును, రాధా కృష్ణ సంవాదము మున్నగు ననేక కృతులు గలవు. ఈ కవిం బోలిన కవులు తరువాతగాని 19–వ శతాబ్దమునగాని పెక్కండ్రు లేరనవచ్చును.

ఇంతవరకు పూర్వ కవుల రీతులు, ప్రబంధకవుల వ్రాతలు, తరువాత కవుల మిశ్రిత పోకడల తీరు చూచితిమి. 18–వ శతాబ్దమువరకు కాలానుసారముగా నించుక భేదముగల్గినను వీరందరు పండితులై సంస్కృత కావ్యముల నాంధ్రీకరించుటయందుగాని, అందలి కథలను గైకొని పెంచి నూతన గ్రంథములు రచించుటయందుగాని శ్రద్ధతీసుకొనిరిగాని నవ్యత యేమాత్రము గలదని చెప్పలేము.

## వావిలికొలను సుబ్బారావుగారు

వావిలికొలను సుబ్బారావుగారు మంచి భాషా సాహిత్యపరుడు. భక్తిపరుడు. వీరినే " వాసు దాసు " గారందురు. వీరు కౌశల్యా పరిణయము, శ్రీకుమారాభ్యుదయము, రామాయణానువాదము చేసిరి. మొదటి రెండును కఠినపద సంఘటనలతో పాదభ్రమక, పద్యాభ్రమక నేకాక్షర పద్యములతో రచింపబడిన ప్రబంధములు. రామాయణము యథావాల్మీకముగా ఆంధ్ర వాల్మీకి రామాయణ మను పేరుతో వ్రాయబడినది. అనువాదము యథాతథముగా నున్నదనుటకు సందేహము లేదు. చదువు వారి కది యనువాద గ్రంథమని చటుక్కున తోచుచునేయుండును, కాని కవితావిలాస మందు గానరాదు. గోపీ

నాథ రామాయణముతో సరితూగజాలదు. పట్టు పట్టి పదముల నంటించి నట్లుండును. భారత కవిత్వ వైఖరులు తోచవు.

ఇక దేవీభాగవత మాంధ్రీకరించిన మువ్వురిలో పాపయారాధ్యు లగ్రగణ్యులని పైన దెల్పియున్నాను. ప్రౌఢమైన పూర్వకవిత్వ సాంప్రదాయము లనేకము లీతని కవిత్వమున కలవు. మధ్య కవుల పోకడలు విరివిగాగలవు. ఈ కవి దుష్కరప్రాసలతో ననేకశతకములు వ్రాసెను. సరసజనమనోరంజన మను ప్రబంధమునుగూడ రచించెను.

దీనికి తరువాత దాసు శ్రీరామకవి కృత దేవీభాగవతము ప్రౌఢముగా నున్నది. పూర్వకవుల పోకడ లచ్చటచ్చట గలవు. ఈతని కవితయందు జాతీయములు, తెలుగు పదములు బహుళముగా నుండును.

తరువాత తిరుపతి - వేంకటకవులచే భాషాంతరీకృతమైన దేవీ భాగవతము గలదు. ఇదియును సరసముగనే యున్నది. రమణీయమగు మాటల పొందిక ధారాళముగా కనిపించుచుండును. అనువాదకులలో వీరికి కొంతముందున్న, కోటంరాజు, నాగేశ్వరకవి యొకడు. అధ్యాత్మ రామాయణము నిత డాంధ్రీకరించెను. కవిత్వము సలక్షణమై, సరసమై, పూర్వకవులరీతులతో నొప్పుచుండునుగాని కాణాదము పెద్దన సోమయాజి రచితమైన అధ్యాత్మ రామాయణమువలె యమక, శబ్దాలంకార సంభృతమైయుండదు.

పూర్వకవులతో బోల్చదగిన మరియొక కవి గుంటూరు మండలమున ప్రశస్తికెక్కిన వాడు తురగా వెంకటకవి. ఈ కవి కనుపర్తి అబ్బయామాత్యుని తరువాతవాడే. సత్తెనపల్లి తాలూకాకు చెందినవాడు. ఈ కవి నిరర్గళ గంభీర ధారావేగ మత్యంత శ్లాఘ్యము. కీర్తిమానినీ పరిణయము, శమంతకోదంతము, మర్యాదరామన్న యను మూడుగ్రంథము లీతని కృతములు. కంకంటి పాపరాజుగారి కవిత్వమువలె నుండు నీ కవి శైలి, చదువుటకు సొంపుగా నుండును. నీతి ధర్మ దాయక కథలతో నిండియుండును. శైలిగంభీరముగా నున్నతస్థాయిలో నుండును....

మ॥ ఘటజాతాది జటాధరేంద్ర గణరంగద్బ్రహ్మ గోష్ఠ్యంత రో
త్కటలాస్యావ సరోజ్జ్వలాభి ముఖరేఖా సంచలత్కామినీ
కటకక్రేంకణ నూపురారవ వచః కాండుండు
కొక్కొండ వెంకటరత్నాఖ్యుడు.......

ఇత్యాది పద్యములు గలవు. ధార నన్నయభట్టుగారి ధారవలె ప్రవహించును. ఆంధ్ర సాహిత్యము, ఆంధ్ర కవిత యనునవి కృష్ణా గోదావరి నదులవలె ప్రవహించు జీవనది యనవచ్చును. జీవనది ప్రవాహ మెన్నటికి నింకబారదు. అట్లే కవిత్రయ కవితా రసము నిత్యనూత్న రస పరిప్లుతము. ఈ జీవనదికి పలుదిక్కులనుండి వివిధ శాఖానదీసలిలములు తోడై, రసోత్కటమై ఉత్తుంగ కల్లోల మాలికలు పొంగులు జూపుచు, ప్రచండరయోద్ధత ధ్వనులతో కనుల మిరు మిట్లు గొల్పుచుండును. ఈ వెల్లువలు జల్లారి కొంతకాలమునకు ప్రవాహమున పరివర్తన గల్గుచుండును. పొంగులు తగ్గును. ప్రవాహఝరులు మందమగుచుండును. ధ్వనులు చల్లారును. కాని జీవనదుల పాయలు తగ్గవు. నిరంతర వారి పూరములకు నిర్మలత వాటిల్లును. అట్లే కవిత్రయ కవిత్వధారలు, స్వచ్ఛత, సిగ్గు, తేట, నీటు, ధారావాహికముగా ప్రవహించుచునే యున్నది. శ్రీనాధ ధారా వేగములు కలకాలము నిలువలేదు. రామరాజ భూషణ శ్లేషలు సడలిపోయినవి. ప్రబంధ క్లిష్ట పాకములు చల్లారి రుచి తప్పిపోయినవి. అలంకారముల తళత్తళలు మాసినవి. పట పట మను శబ్ద ఝాంకృతులు వీగి పోయినవి. అభినవ భారతము, అభిన వాంధ్రము, అభినవ సాహితి, నూతనభావ పరంపర వినూతన సంస్కార ఘట్టనలు పొడచూపినవి. విమర్శనా విధానము మారినది. సంఘపరివర్తన ముదయించినది. కొండవాగుల మర్మల ధ్వనులు చిత్తాకర్షన మొనరించలేదు. సాహిత్యముపై తీవ్ర సునిశిత విమర్శనలు ప్రారంభమయ్యెను. పూర్వ మధ్య యుగ కావ్య సాహితుల నిరంకుశముగా, నిష్పక్షపాతముగా, నికషోపలముపై పరీక్షింప జొచ్చిరి. ఈ పరీక్షకు మధ్యకవుల ప్రబంధములు, అర్వాచీన కవితా విలాసములు, సంస్కృతపదసమాసములు, శబ్దాడంబరజృంభణములు తటుకొనలేకపోయెను. ఈ కఠిన పరీక్షకు నిల్చినవి, కవిత్రయ కవితా

సాధములే. వానికి పరీక్షతో నూతన శోభగలిగి సహజ స్నిగ్ధ చ్ఛాయలు సుధాధవళిత కుడ్యములవలె గౌరవము గలిగెను. వర్తమాన విమర్శకాగ్రేసరు లెల్లరు నన్నయ కవితా విలాస మక్షరరమ్య మని తేల్చిరి. ప్రసన్న కథా కవితార్థ యుక్తినిలయమని కొనియాడిరి. తిక్కన సూక్తుల సొంపు, పాత్ర పోషణ, శిల్పము, అనిశ్వరమనిరి. నిరుప మాన మని యుగ్గడించిరి. అట్లే యఱ్ఱనార్యుని సూక్తి వైచిత్రిని మెచ్చిరి. ఈ విధముగా కవిత్రయ కవితా ప్రభావము మధ్య యుగ ప్రబంధపు పొంగులో కొంత యదృశ్యమైనను యీ పొంగు చల్లారినంతనే తిరిగి నవీనకాంతులతో పైకివచ్చినది. వర్తమాన కవులందరు తిక్కన కవిత్వమును మెచ్చి, శిల్పమునకు తలయూచి, తమ తమ నడకల నట్లే యలవరుచు కొనుచున్నారు.

తిక్కనపై నూతన సాహితీ ప్రపంచమునకున్న గౌరవము తిక్కన గ్రంథాలయములు, తిక్కన వర్ధమాన సమాజములు, తిక్కన జయంతులు, అభినవ తిక్కన గద్య తిక్కనాది బిరుదములు చాటు చున్నవి. నవభారతమున తిక్కన భారతమున కపారమైన మన్నన గల్గినది. దీనికంతకు తిక్కనామాత్యుని సర్వతోముఖ సాహితీ శక్తియే కారణము.

ఇంతవరకు పురాణ ప్రబంధ కావ్యములనుగూర్చి చర్చించినాము అవి యన్నియు, ప్రాయికముగా పద్య గద్యాత్మికములే. అందును ప్రధానముగా పద్యములే మిక్కుటముగా నుండును. అక్కడక్కడ సందర్భావసరమునుబట్టి కొంత కొంత స్వల్పముగా గద్యముగూడ చేర్చబడినది-గాని, గద్యకు ద్విపదకావ్యములకు, శతకములకు, గీతములకు ప్రాధాన్యత నొసంగ బడలేదు. కవియనగా పద్య కావ్య రచయితకే పేరు. గద్యముల వ్రాసిన వానిని కవియని పిలువలేదు. వీనిస్వభావ స్వరూపములను సయితము మనము తెలిసికొను టవసరముగదా?

వచనగ్రంథములు పూర్వమున్నట్లు తెలియరాదు. సంస్కృత మున సహితము బాణకవి రచిత "కాదంబరి" తక్క తక్కిన అన్ని

కావ్యములు కేవల శ్లోక రూపముగానో లేక చంపువులుగానో రచింప బడినవి. ఆ సాంప్రదాయము ననుసరించియే తెలుగున కవులు తమ కావ్యములను చంపూ కావ్యములుగా వ్రాసినారు. ప్రథమమున నన్నయ భట్టుగారు భారతమున దీర్ఘమైన వచనభాగముల జేర్చినారు. ఆభాష యును ప్రౌఢముగానే వ్రాసినారు. చదువుట కింపుగనే యుండును. కాని తక్కిన కవులు సరసమైన వచనము చేర్చలేదు. నాచన సోమ, శ్రీనాధ, పోతన, పెద్దన, భట్టుమూర్తి, రామకృష్ణ, సూరన, తిమ్మనాది కవులందరు కావ్యములమధ్య నచ్చటచ్చట కఠిన దీర్ఘ సమాసములతో శబ్దాడంబర ప్రకటనతో పాఠకుల కర్థముకాని నిగూఢ పదభావ వర్ణనలతో గద్యము వ్రాసి శ్రుతి కటువు తనము గల్పించిరి. స్కాంధ పురాణభాగముల తెనిగించుచు గద్యమునే వ్రాసిన కవులు నట్లే వ్రాసిరి. కాని యామార్గము ప్రజాదరగాంచినది కాదు. అధునాతన కాలమున చిన్నయ సూరి పంచతంత్రమున, మిత్రలాభము మిత్ర భేదము, సంధియను భాగములను నన్నయగారి వచనశైలితో వ్రాసి గద్యకావ్యములకు మార్గదర్శకులైరి. పిమ్మట, కందుకూరి వీరేశలింగా ర్యులు, శతఘంటము వెంకటకవి, కొక్కొండ వెంకటరత్నము పంతులు మున్నగువారు చిన్నయసూరి ననుసరించిరి. ఈ విషయమునుగూర్చి ముందు ముందు చెప్పదలంచితిని కావున గద్యకావ్యముల విషయ మటుంచి ద్విపదకావ్యముల రీతులు, చరిత్ర వాని ప్రయోజనముల గురించి యించుక ముచ్చటి పవలసి యున్నది.

సంస్కృత కావ్యములలో "అనుష్టుప్" శ్లోకము లధికముగా నుండును. అనుష్టుప్పులు వ్రాయుటకు తేలికయై విషయమును సులభ ముగా తెలుపుట కనువై యుండును. అందుచేత సంస్కృత మహా పురాణములన్నియు నీ శ్లోకములచే నిండియున్నవి. అట్లే తెలుగు కవి త్వమున ద్విపద లాస్థానము నాక్రమించెను. విషయమును తేటగా, నూటిగా, క్లిష్టత లేకుండా ద్విపదలో చెప్పవచ్చును. ఆకారణమును బట్టి పూర్వము శైవమత ప్రచారకు లీద్విపదను వాడినారు. విరిలో ప్రసిద్ధులు, పాల్కురికి సోమనాథుడు, తరువాత రంగనాథుడు, అటు

పిమ్మట గౌరనమంత్రి మున్నగువారు. సోమనాథుడు బసవపురాణము, పండితారాధ్యచరిత్రము రచించెను. రంగనాథుడు వాల్మీకి రామాయణమున కనువాదము రచించెను. గౌరనమంత్రి హరిశ్చంద్రోపాఖ్యానము వ్రాసెను. సోమనాథుని ద్విపద కావ్యములు తెలుగు నుడులతో నిండి హృద్యముగానున్నది. రంగనాథుని శైలి రసవంతమై, ప్రౌఢమై మనోహరముగా నుండును. వీరు తిక్కనాదులకు వెనుకటివారని చెప్పుదురు. ఆవిషయ మెట్లున్నను, సోమనాథుడు విరివిగా వర్ణనా వైశద్య విలాసము జూపినాడు. తియ్యని తేటతెలుగు సొంపులు గలవు. పదముల యమకము గలదు. భావముల యందము, జాతీయ పదముల యింపు, గంభీరమైన రీతులు వెల్లివిరియుచుండును. వర్ణనల స్వభావము తిలకింపుడు :

ద్వి॥ తొలి కోడి కను విచ్చి నిలచి మై వెంచి
జల జల రెక్కల సడలించి నీల్గి
గక్కున కాలార్చి కంఠంబు విచ్చి
ముక్కున నీకెలం చక్కొల్పి కడుపు
లెక్కించి మెడసాచి నిక్కి మిన్నూచి
కొక్కొరోకొ యంచు కోడి తా గూసె........

ఈ గతి పై రెండు కావ్యములు మనోహరముగా వ్రాసెను. ఈ మహాకవి ననుసరించి రంగనాథుడు మున్నగు కవులు ద్విపద సాగించిరి.

ద్వి॥ చలియింప కున్నవి సకల వృక్షములు
మెలగవు వనభూమి మృగ సమూహములు
వెలితి విహంగంబులు నీడముల్ జేరి
మఱచి యున్నవి తమ మంజులధ్వనులు........

మరియును :

కటప వృత్తుల జిక్కి కడముట్ట స్రుక్కి
జీవంబుపై రోసి చెఱపంబు బాసి
పులులలో నావును బోలె దుర్వార
ఘోర రాక్షస వధూకోటిలో నున్న
నారీ శిరోమణి నలినాయ తాక్షి........

ఈ తెరంగున లలిత పద మాధురీ రసాయనము నాంధ్రులకు వెదజల్లినా డీ రంగనాథుడు. తరువాతివారు వీరిననుసరించిరి. శ్రీనాథుడు సైతము పల్నాటి వీరచరిత్ర ద్విపదగానే రచించెను. ఆధునిక కవుల కీ ద్విపద నచ్చినది. భావకవులు ద్విపదను ధారాళముగా వాడు చున్నారు.

ద్విపదకావ్యములు మతబోధ కనువుగా నుండుటకై రచింపబడిన వని మున్నే వచించితిని. ద్విపదలను పాటలుగా పాడవచ్చును. సుద్దులుగా చెప్ప వచ్చును. చదువురాని జానపదులకు కథల రూపముగ నీతిబోధ, మతబోధ, వీరగాథలు దెలుపవచ్చును. కరుణారస మువ్పొంగు నట్లు సంగీత యుక్తముగ యుద్రేక పూరితముగ యుత్సాహము ద్విపదలతో కల్పింపవచ్చును. అందుచేత ద్విపద ప్రజారంజకమైనది. ద్విపద కావ్యములేగాక, భక్తి, నీతి, ధర్మ ప్రబోధము కొరకై కవులు శతకములు రచించిరి. శతకములలో జ్ఞానము, వైరాగ్యము, భక్తియే ప్రధానమైనను, కవులు సంఘ దురాచారములను, రాజుల దుశ్చర్యలు ధనికుల దుష్టకృత్యములు, సంఘనీతులుగూడ చొప్పించిరి. ఈవిధమైన శతకములు వ్రాయుట కాంధ్రమున తిక్కన సోమయాజిగారే ప్రథము డనవచ్చును. తిక్కన కృష్ణ శతకమును వ్రాసినట్లు చెప్పుదురు.

మ॥ అరయన్ శంతన పుత్రుపై, విదురపై, నక్రూరుపై, కుబ్జపై
నరుపై, ద్రౌపదిపై, కుచేలుని పయి న్నందవ్రజశ్రేణిపై
బరగం గల్గు భవత్కృపా రసము నాపై గొంత రానిమ్ము నీ
చరణాబ్జంబులె నమ్మినాను జగదీశా, కృష్ణ, భక్తప్రియా ॥

ఈ చ్ఛాయ ననుసరించి యనంతరకవులు శతకములు వేల కొలది వ్రాసియున్నారు. పోతరాజుగారు నారాయణ శతకమును వ్రాసినారని వదంతి. నరసింహ శతక మత్యంతభక్తి. నీతి ప్రబోధకము. మఱియు ప్రసిద్ధమైనవి కొన్ని గలవు. భద్రాద్రి రామదా సను కీర్తిగన్న కంచర్ల గోపన్న రచించిన దాశరథీ శతకము మిక్కిలి ప్రచారము నేయుమై యున్నది. నరసింహ శతకము, కాళహస్తీశ్వర శతకము, భద్రాద్రి రామశతకము, కుక్కుటేశ్వర శతకము మున్నగున వెన్నియో

గలవు. అవిగాక అధికారులు, పరిపాలకులు చేయవలసినపనులు సూచించుచు, వారి చర్యల విమర్శించుచు వ్రాసిన అడిదము సూరన మొదలగు పండితకవులు వ్రాసిన రామలింగేశ శతకమువంటివి కొన్ని గలవు.

సూరనకవి తన శతకములో :

సీ॥ మాన్యంబు లీయ సమర్థుఁ డొక్కఁడు లేఁడు
మాన్యము ల్సెరుప సామంతు లంత
ఎండినయూళ్లు గో డెరిగింప డెవ్వఁడు
పండిన యూళ్లకు ప్రభువు లంత
ఇతఁడు పేదయటంచు నెఱిఁగింప డెవ్వఁడు
కలవారి సిరు లెన్నఁగలరు చాల
తనయాలి చీకటి తప్పెన్న డెవ్వఁడు
పరకాంత రంకెన్న పెద్ద లంద
ఱిట్టి దుష్టుల కధికార మిచ్చినట్టి
రాజు ననవలెగాక దుర్జయుల ననఁగ
నేమి పనియున్న దిక సత్కవీంద్రులకును
రామలింగేశ రామచంద్ర పురవాస ॥

సీ॥ పదుగురు కోతి వెంబడి సంచరింపరే
వాహకు ల్లేరె శవంబునకును
గంగిరెద్దుకు లేవె ఘన తూర్యరావముల్
కల్మి గల్గదె వారకామినులకు
పులి గోవు జంపి నక్కలను బోషింపదే
స్థూలకాయము లేదె దున్నలకును
పుప్పి పంటికి లేదె పుట్టంబు జుట్టుట
వేణుధరుం డెద్దు వెంట రాఁడె
న్యాయ పద్ధతి నడువని యవని పతికి
నెన్ని చిన్నెలు గలిగిన నెందుకొఱకు
అంత్యమున జూడవలయు నాయయ్య సుఖము
రామలింగేశ రామచంద్ర పురవాస॥

పై పద్ధతినే నరసింహ శతకకవి గూడ సంఘమందలి లోపములను కండ్లకు కట్టినట్లు చిత్రించియున్నాడు. మచ్చునకు:—

సీ|| అధిక విద్యావంతు లప్రయోజకు లైరి
పూర్ణ శుంఠలు సభా పూజ్యు లైరి
సత్యవంతుల మాట జనవిరోధం బాయె
వదరు బోతుల మాట వాసి కెక్కె
ధర్మవాసన పరుల్ దారిద్ర్య మందిరి
పరమ లోభులు ధనప్రాప్తు లైరి
పుణ్యవంతులు రోగభూత పీడితు లైరి
దుష్టమానవులు వర్ధిష్టు లైరి........

ఈ రీతిగా సంఘమునందున్న లోపాలను వెల్లడించి తమ నిరసనను తెలియజేసియున్నారు. భర్తృహరినీతి శతకముగూడ నీ తరగతికి చెందినదేయనవచ్చును. తరువాత వేమన శతకము వీటియన్నిటికంటె అగ్రగణ్యమని చెప్పనొప్పు. సంఘ లోపములు, న్యాయ నిర్ణయములు, పరిపాలనా విధానములు వేయేల సర్వవిషయములను, బహిరంగముగా చిన్న చిన్న తేట గీతలలోను, ఆట వెలదులలోను, ఉపమాలంకార యుక్తముగరచించి శతక కవులలో నున్నతస్థానమందినాడీ వేమన. సుమతీశతక కర్తయగు బద్దెన యనుకవియు నీత్రోవనే నడచినాడు. ఈ శతక మన్నిశతకముల ప్రధానమైనది. ప్రజాదరణకు పాత్రమైనది. ప్రతిబాలునకును, బాలికకును ప్రప్రథమమున యుపాధ్యాయు లీ శతకమునందలి పద్యములను చెప్పనిదే తదితర పద్యములు చెప్పనేరరు. వేమన కవి మాత్రమే కాదు. యోగి, విరాగి, లౌకిక జ్ఞానము కలవాడు. తన జీవితమున మొదటిలో రాగి, సకలానుభవ భోగి, తరువాత విరాగియై, త్యాగియై లోకానుభవమును తన తేటగీతలతో నాటవెలదులలో ప్రపంచమునకు జూపినాడు. ఇతనివలె నీతి వైరాగ్యములను తేట తెలుగు మాటలలో తెలిపిన కవి మఱియొకడు లేడని చెప్పవచ్చును. ధనికుల, లోభుల, రాజుల, పండితుల, పీరు వారననేల అందరను వారి లోపములను నిరసించి, చదువు వారి హృదయములకు

హాత్తునట్లు చెప్పి హృదయ స్పందన మొనరింపగలిగెను. ఈ క్రింద చూడుడు :

ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు
చూడ చూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఎంత తేటగా నుపమానముల పొసగించి వినువారి మనముల తట్టునట్టి యిట్టి పద్యముల సొంపు నీ కవి రాణింపజేసియున్నాడు. ఈతనిని వేమనయోగియనే లోకు లనుచున్నారు. వేమన మహానుభావుడని పెద్దకవి యని పలువురు గౌరవాభిమానము జూపుచు, వేమన గ్రంథాలయములు, వేమన సాహితీ సంఘములు నెలకొల్పుచున్నారు. నీతికి, ధర్మమునకు, వేదాంతమునకు నిలయ మీ వేమన కవిత్వము. రెండవ శతకము సుమతీ యను మకుటముతో రచింపబడిన యొక కంద శతకము. ఇట్టి కవిత మహా కవియైనవాడే వ్రాయగలడు. పద్యములు నిసర్గమనోహరములై, నీతి బోధకములై యెల్లరకు కర్ణరసాయన మొనర్చుచు ముద్దులు మూట కట్టుచుండును.

క॥ కలనాటి ధనము లక్కర
గలనాటికి దాచ కమలగర్భుని వశమా
నెల నడిమి నాటి వెన్నెల
యలవడునే గాదె బోయ నమవస నిశికిన్॥

క॥ కమలములు నీట బాసిన
కమలాప్తుని రశ్మిసోకి కమలిన భంగిన్
తమ తమ నెలవులు దప్పిన
తమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ॥

క॥ కులకాంత తోడ నెప్పుడు
కలహింపకు వట్టి తప్పు ఘటియింపకుమీ
కలకంఠి కంట కన్నీ రొలికిన
సిరి యింట నుండ నొల్లదు సుమతీ॥

ఇత్యాది రమణీయ భావ, సుందర పద బంధుర లలిత శైలితో సకల నీతులు బోధించు ఈశతక కవి స్తుతిపాత్రుడు.

ఇక ధూర్జటి మున్నగువారు స్వాతంత్ర్యప్రియులై రాజుల చర్యలు, రాజుల దుష్ట క్రూర ప్రవర్తనలను నిరసించి వారిని దూషించుటద్వారా ప్రజా ప్రబోధము చేసినారు. మొత్తముమీద శతక కవులందరు ధనిక, రాజ నిరసనమే జూపియున్నారు. భక్తశిఖామణియై నిరంతర రామస్మరణానురాగియైన కంచర్ల గోపన్నగారు సయితము తాను రచించిన దాశరథీ శతకమున:

> మసగొని రేచు పండ్లకును మౌక్తికము ల్వెల బోసినట్లు దు
> ర్వ్యసనము జెంది కావ్యము దురాత్ముల కిచ్చిన మోసమాను... ....

అనినాడు. ఈ శతకముల శైలి సామాన్యముగా నొక తీరున నుండదు. శాంతరసము, భక్తిరసము ప్రాయికముగానుండును. తిక్కన రచితమైన కృష్ణ శతక పద్యము శైలితో పలువురు శతకముల వ్రాసిరి. శతకముల ప్రయోజనము మరచి కొందరు తమ శృంగార రస భావముల వెల్లడించిరి. కాంతా లలామ శతకము, కలువాయి శతకము మొదలగున వీతరగతికి చెందియున్నవి. శతకములు వ్రాయుట కవులకు చాల తేలిక. ఏలయనగా, వీనికి కల్పనాశక్తి యధికముగా నక్కర లేదు. వస్త్వైక్య మసలే యనవసరము. ఏ పద్యమున కాపద్యమే ప్రత్యేకము. పూర్వాపర సంబధమునకు తావు లేదు. అందుచేత సామాన్య కవు లందరు యేదో యొక శతకము వ్రాయుచునేయున్నారు. కావ్యములకంటె శతకముల సంఖ్యయే మిక్కుటముగా నున్నది. శతకములలో నెన్నదగినవి, ఉపయోగకరమైనవి సుమారు 600 కంటె నధికముగా నున్నట్లిదివరకే చెప్పియున్నాను. కాని శతకములు స్వతంత్రి రచనలతోను, స్వతంత్ర పదప్రయోగములతోను, వ్యావహారికపద ప్రయోగములతోను, ఆధ్యాత్మిక విషయములతోను, కూడియున్నవనుటకు సందియము లేదు. పాల్కురికి సోమనాథుడు, తిక్కన, పోతన అయ్యలరాజు రామభద్రుడు, ధూర్జటి మున్నగు పూర్వమహాకవులు, తరువాతి కవులలో అడిదము సూరన, కూచిమంచి తిమ్మన, శాఫూరి

సంజీవరాయుడు, రామదాసు మున్నగు ప్రసిద్ధులగువారుకూడ కావ్యములేగాక శతకములు వ్రాసియుండుటచే శతక కవిత్వమునందు వారికి గల గౌరవాభిమానము వెల్లడియగుచున్నది. గీర్వాణమున మయూర కవి సూర్యశతకము వీరందరకు మార్గదర్శకమై యుండునేమో యని తోచుచున్నది. రాజులపై, నధికారులపై ఈకాలమున వార్తా పత్రికలలో జేయబడు తీవ్ర విమర్శన లీ శతకములలో జేయుబడిన విమర్శనలతో సాటిరావు. పత్రికా విమర్శన లేనాడు వ్రాసిన వానాటి పఠనతో తీరిపోవును. శతకములద్వారా నెఱపిన విమర్శలు శాశ్వతముగా ప్రజా కర్ణముల గింగిరు మనుచుండును. ఒక్కపద్యము రసవంతమైనది వ్రాసి సంఘముపై విసిరినాడంటే అది యొక దావానలమువలె దేశ మెల్లెడల వ్యాపించిపోవును.

శతకములందే కవులు సంఘమునగల లోపములను వెలిబుచ్చి విమర్శన, పేరు బెట్టికొన్ని, పెట్టక కొన్ని విమర్శన లున్నను, మొత్తము మీద యెవరి నుద్దేశించి విమర్శన చేయబడెనో ప్రజాసామాన్యమునకు తెలియుచునే యుండెను. కవు లన్న ధనికులకు, అధికారులకు భయ మీ విధ విమర్శనాపూరిత కవిత్వముచేతనే గలుగుచుండును. శతకములోని కవితా విలాసము హృద్యముగా నుండు యమకములుండును; భక్తి, వీర, శృంగార రసములు గనుపించును. చూడుడు :

ఉ॥ కోతికి శక్యమా దనుజకోట్ల జయింప, జయించెబో నిజం
బాతనిమేన శీతకరుడౌనె దవానలం డెట్టి వింత యా
సీత పతివ్రతా మహిమొ, సేవకు భాగ్యమో మీ కటాక్షమో
ధాతకు శక్యమా పొగడ దాశరథీ కరుణాపయోనిధీ ॥

ఉ॥ రంగ ధరాతిభంగ ఖగరాజతురంగ విపత్పరంపరో
త్తుంగ తమః పతంగ పరితోషితరంగ దయాంతరంగ స
త్సంగ ధరాత్మజాహృదయ సారసభృంగ, నిశాచరాబ్జ మా
తంగ శుభాంగ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ॥

యమకము, వృత్త్యనుపద సంధానము లీ రెండు పద్యముల రమణీయముగా నున్నవి.

కవులలో కొందరికి తిట్టు కవు లను ప్రసిద్ధిగలదు. అట్టి తిట్టుకవులను చూచియే అందరు భయపడుచుండిరి.

సూర కవి తిట్టు కంసాలి సుత్తె పెట్టు; రామ కవి బొబ్బ పెద్ద ఫిరంగి దెబ్బ అనువాక్యములు గర్వముతో చెప్పుకొన్నవా రున్నారు. సామాన్యకవులేగాక మధ్యయుగములో ప్రబంధకవులు సయితము శతకములు వ్రాసిరి. రామాభ్యుదయకర్త అయ్యలరాజు రామభద్ర కవి ఒంటిమిట్ట రఘువీర శతకమును; ధూర్జటి కాళహస్తీశ్వర శతకమును రచించిరిగదా. నేటికిని శతకములు వందలుగా వెలువడుచున్నవి, సుప్రసిద్ధుడగు భర్తృహరి తన సుభాషిత రత్నావళిలో నీతి, శృంగార, వైరాగ్య శతకములని పేర్లు బెట్టియుండెను. భాస్కర శతకము నీతులు బోధించెను. ఆ ఫక్కినే వడ్డాది సుబ్బరాయకవిగారు భక్తచింతామణి శతకము రచించెను. శతకములలో సయితము ఉపమానములు, అర్థాంతర న్యాసాలంకారములు కొల్లగా నుండెను. వసురాయ కవి పద్యములు నీతి బోధకములు.

శ్రీయుత సత్ప్రవర్తనము జెందక స్వేచ్ఛ భజించు బిడ్డలే  
ప్రాయమునందు శిక్షఋజుపద్ధతి నేర్వమి ముందు శక్యమే  
కాయలు పొట్లతీగెలను గల్లడురాలను గట్టకుండినన్  
వేయి జనించు వంకరలు వెన్కను దీర్ప దరంబె మిత్రుడా॥

ద్విపదలు శతకములు గాక, నీతి ధర్మ ప్రచారమునకు నాటకములు, గీతములుగూడ రచింపబడినవి. మనదేశమున సంస్కృత నాటకములు అనువదించుటతో నాటక సాహిత్యము ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును. అంతకు మున్నుండి యక్షగానములు కొన్నియున్నను, అవినాటకలక్షణ నిబద్ధములు గాకుండుటచే వాని కీపాత్రమున ప్రాధాన్యత నీయదలంచలేదు. తెలుగున నాటకములు మున్ముందుగా కం॥ వీరేశలింగం పంతులుగారు కాళిదాసకృత శాకుంతలాది నాటకముల ననువదించిరి. వడ్డాది సుబ్బరాయకవిగారు వేణీసంహారము రచించిరి. కొంతకాలము ట్లాంధ్రీకరణ నాటకములతోపాటు స్వతంత్ర నాటకము లనేకములు బయలుదేరెను. వర్తమాన కాల

మున నున్నన్ని నాటకము లేకాలమున లేవని రూఢిగా చెప్పవచ్చును. అయితే నాటకలక్షణవేత్తలు నిర్ణయించిన నిబంధనలకుగాని పిమ్మటవా రనుసరించిన పద్ధతులకుగాని లోబడి వ్రాయబడినవిమాత్రి మెచ్చటా లేవు. సినిమా నాటకము లయోమయ పద్ధతిలో బడిపోయినవి. తొల్త ననువదించిన వీరేశలింగంపంతులు, వేదం వేంకటరాయశాస్త్రి, వసురాయుడు మున్నగువారు నాటక కళలకు భంగము కలుగకుండా వ్రాసిరి. అందలి కవిత్వము సిద్ధుష్టమై రసవంతమై ప్రకాశించియుండెను. వసురాయకవి పోకడలు భారత కవిత్వపు పోకడలుగానే దోచును. వేణీసంహారమున నశ్వత్థామ శపథము గనుడు. దుర్యోధనునకు ధైర్యము జెప్పు సందర్భమున :

మ॥ ఎదపై జేయిడి, నిద్రపొమ్మనఘ నీ వీ రేయి నల్జాములున్
కదనంపుంగథ నేటితో ముగియు నిక్కంసారి నిప్పాండవం
బడె నిస్సోమక మయ్యెడున్ జగము నేనే యీధరభార మం
త దొలంగించెద దుష్టరాజకుల కాంతారంబు ఖండించుచున్॥

వసురాయ కవి వ్రాసిన యీ పద్యము శల్యపర్వమున నశ్వత్థామ దుర్యోధనునితో నన్న:

ఉ॥ ఏ లనుమాన మేను సమయించెద వైరము నేటితోడ పాం
చాలుర నెల్ల తీవ్రశరజాలములం బొలియించి కాన భూ
పాలకపుచ్ఛక త్తళము పాటిగపట్టుము నాదు మాట లి
య్యాళితనంబు వాపెద బ్రియం బొనరించెద నీకు దండ్రికిన్॥

అను తిక్కన పద్యముకంటె వీరోచితముగను, రాజున కుత్సాహజనకముగ నున్నది. ఇట్టి వీర, రౌద్ర రసము లుద్దీపించునట్లు వేణీసంహారనాటక మున్నది. భాషాంతరీకృత నాటకములకు పిమ్మట నాంధ్రమున స్వతంత్ర నాటకములు రచించి ప్రజానురంజన మొనర్చిన వారు చిలకమర్తి లక్ష్మీనరసింహమూర్తిగారును, ధర్మవరపు కృష్ణమాచార్యులుగారును, తిరుపతి వేంకట కవులును స్మరణీయులు. తక్కిన వారు పెక్కండ్రు కలరు. భారతోద్యోగ, యుద్ధ పర్వముల కథలను, పాండవోద్యోగము, పాండవ విజయమని రెండు నాటకము లీ తిరుపతి

వెంకట కవులు వ్రాసినారు. ఇంతవరకు ఆంధ్రసాహిత్య లక్షణములు, పూర్వ, మధ్య, అధునాతన కవుల సాహిత్య ప్రకరణమయ్యెను.

ఇక నిరువదవ శతాబ్దమున సంభవించిన సర్వతోముఖ విప్లవపు ధాటి నిరాఘాటముగా సాగినది; సాగుచున్నది. సాహిత్యరంగమున, తక్కినరంగములందువలె విపరీత పరివర్తన జరిగినది. సాంఘిక, రాజకీయ, మత, నైతిక పూర్వాచార సనాతన ధర్మములపై దాడి 20-వ శతాబ్దారంభమునకు మున్నే ప్రారంభమయ్యెను.

19-వ శతాబ్ది మధ్యకాలముననే భారతదేశమంతయు పరాధీనత నందెను. ఆంగ్లపరిపాలన విజృంభించెను. క్రమక్రమముగా సంతకు నూరువత్సరములుగా దేశ స్వాతంత్ర్యము జారిపోవుటకు ప్రారంభమై 1850 సం॥ ప్రాంతమునకు పూర్ణముగా దేశ స్వతంత్రత నశించెను. పాశ్చాత్యప్రాభవము పరివ్యాప్తమందెను. దేశమున శాంతి లేదు. ఆచార వ్యవహారములలో దాస్యస్థితికి సహజమైన , దరిద్రము, సంకుచిత బుద్ధులు, ఉత్సాహనాశము మున్నగు నవలక్షణములు జాతినావరించెను. తక్కిన రాష్ట్రములతోపాటు నాంధ్ర భూమి సయితము సమస్తవిధములా, సకలరంగములలో క్రుంగిపోయెను. పూర్వకాల సాహిత్యదీప్తులు తేజోవిహీనము లయ్యెను. అందుచేత ఆంధ్రసాహిత్యమునగూడ క్షీణదశ ప్రారంభించెను. కాని దేశదుస్థితి సర్వకాల ముట్టికట్టుకొని కూర్చుండబోదు. 1850 సంవత్సరము పిమ్మట దుస్సహ దాస్య శృంఖలముల త్రెంచుకొని దేశస్వాతంత్ర్యము సంపాదించుకొనుటకై ప్రయత్నములు ప్రారంభమయ్యెను. భారత స్వాతంత్ర్య ప్రథమ యుద్ధము జరిగెను. కాని పరాజయము నందెను. దానితో పరిపాలకుల దృష్టిమారెను. ఆంగ్లప్రభుత్వమునకు తోడ్పాటు సలుపగల నొక విశిష్టజనసమూహమును సృష్టించుటకై ఆంగ్లేయపాలకులు ప్రయత్నము చేయజొచ్చిరి. ప్రజలలో భావపరివర్తన అవసరమని తలంచిరి. అది యాంగ్ల భాషాధ్యాపనచేత మాత్రమే సంభవమని యూహించిరి. ఆంగ్ల భాషాభిమానము ప్రజాహృదయక్షేత్రముల కల్పించి తద్వారా భారతీయులను తమ కండగానుండ జేసికొనగోరిరి.

ఈ రీతిగా కొంత కృషి జేసి ఆంగ్ల విద్యాధికవర్గము నిర్మించిరి. వీరిలో పలువు రాంగ్ల మానస పుత్రులైరి. మాతృభాషపై అభిమానము సన్నగిలెను. జీవయాత్ర జరపుకొనుట కవశ్యముగా నాంగ్లభాష చదువ వలసివచ్చెను. పాఠశాలలలో నాంగ్లభాషకే ప్రాధాన్యత నొసంగబడెను. మాతృభాష నామమాత్రావశిష్టమయ్యెను. ఇట్టిస్థితిలో భాషాభివృద్ధి సాహిత్యవిస్తరణ ఎట్లు జరుగగలదు? ప్రతికార్యమునను కీడు మేలు జతగూడి యుండుననన్న సామ్యమున ఆంగ్ల విద్యావలంబనవలన మాతృభాషాభిమానము నశించి పోయినను, ఆంగ్ల జాతిస్వభావమైన స్వేచ్ఛానురక్తి, దాస్యభావ నిరసన, రాజకీయ విషయ పరిజ్ఞానము గలిగి వృద్ధిగాజొచ్చెను. రాజకీయ స్వతంత్రతపై తక్కిన స్వతంత్రత లాధారపడియుండునను సత్యముఆంగ్ల విద్యాధికులలోనే యంకురించెను. భారత దేశమునకు స్వతంత్రము సంపాదించు నాశయముతో క్రమ క్రమాభివృద్ధినొందు తలంపుగలిగిన, స్వార్థ త్యాగులైన కొందరు కాంగ్రెస్ సంస్థ ప్రతిష్ఠించిరి. ఆ ప్రయత్నము 1885 సం॥ ప్రాంతమున జరిగినది. రాజకీయ సంస్కార సిద్ధికై ముందు యోగ్యతవలయునని సంకల్పించి, సంఘసంస్కారావశ్యకతను గుర్తించిరి. పూర్వాచార బంధబద్ధులైన భారతీయులకు స్వేచ్ఛనొసంగ నెంచిరి. సంఘము వ్యాప్తమై యైకమత్యమున అభివృద్ధికి నిరోధముగలిగించు దురాచారములను మతనిబంధనలను తొలగించుటకు, నిర్మూలించుటకు పూనిరి. ఈ విధముగా సంఘమున భావముల ఆచారముల పరివర్తనకు సమకట్టి, దానితో భారతీయులు విదేశముల కేగిరి. అచ్చటి యుద్గ్రంధముల చదివిరి. పాశ్చాత్యభావసంపద సంగ్రహించిరి. ఈ రీతిగా 1885–1900 సం వత్సరముల మధ్యకాలమున సంఘము మార్పునందెను. ఆంగ్ల భాషా సాంప్రదాయమును, ఆంగ్ల సాహితీ ప్రభావము, ఆంగ్ల కవితా రీతులు, వర్ణనా పద్యములు, నాటక వైఖరులు, వ్యాసరచనా విధానము, ప్రసంగ ధోరణి మున్నగు సమస్తవిధ విజ్ఞాన సంపత్తి నరసిరి. భారతీయులు తమ మహోన్నత వేదాంత విజ్ఞానము విదేశీయులకు చాటి దేశగౌరవమును నిలుపుకొనుటకు స్వామి వివేకానంద మున్నగువారును, రాజ

కీయ స్వతంత్రతాసంపాదనకు బాలగంగాధర తిలక్కు, అరవిందఘోషు మదనమోహనమాలవ్యా, సురేంద్రనాధబెనర్జీ మున్నగు మహనీయులును, సంఘసంస్కార దీక్షులై కందుకూరి వీరేశలింగం, ఈశ్వరచంద్ర విద్యాసాగరాదులును, భారతీయ సర్వతోముఖాభివృద్ధికి పాటుపడ జొచ్చిరి.

ఈ సందర్భముననే యాంధ్రదేశమున కందుకూరి వీరేశలింగం గారు "వివేకవర్ధని" పత్రిక నెలకొల్పెను. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు ఆంధ్రభాషాభివర్ధని స్థాపించిరి. పూండ్ల రామకృష్ణయ్య గారు "అముద్రిత గ్రంథ చింతామణి" పత్రిక నెలకొల్పిరి. తదితరులు వేరు వేరు పత్రికలు సాగించి భాషాసేవ జేయజొచ్చిరి. ఈసత్కార్యములతో నిదిరితాంధ్ర జాతి నిద్ర మేల్కొని తమ మాతృభాషయం దభిమానము, తద్గౌరవ విచారణ చేయనారంభించిరి. అంతవరకు పూర్వ సాహిత్యము లేదు. నూతనసాహిత్యాంకురములైనను లేవు. అట్టిస్థితిలో ప్రత్యేకముగా కొందరు వ్యక్తులకే తప్ప తక్కిన జనసామాన్యమునకు సాహిత్యవిషయ మంతగా పట్టనేలేదు. కాని కందుకూరి వీరేశలింగం మున్నగువారి పరిశ్రమవల్లనే 1880 సం॥ మొదలు కొంత పరివర్తన సంభవించినది. పైనదెల్పిన సకల విషయ ప్రచారము జేయుట కనువైన భాష, కావ్యములు కావలసివచ్చినవి. పద్యకావ్యముల యవసరము లేదు, గద్యమే యవసరమైనది. ఈ కారణమున కందుకూరి వీరేశలింగం ప్రభృతులు గద్యమే చేబట్టిరి. వీరికి తిక్కనపై నాతని కవిత్వముపై గౌరవమెక్కువ. అతని కవిత్వమునంగల పొడి పొడి మాటలు, సంగ్రహముగా, రసోచితముగానుండు వాక్యముల కందుకూరి వీరేశలింగంగా రను సరించివ్రాసినను యీతని కవితలో తిక్కన ప్రౌఢిమ లేదు. గద్యమునం దసమానుడై, గద్యతిక్కనయను బిరుదమందిన కందుకూరి వీరేశలింగంగా రాంధ్ర దేశమునకు, ఆంధ్ర భాషకు అపారసేవ చేసినారు. ఆంగ్ల భాషావిజ్ఞానము, ఆంధ్ర భాషా విజ్ఞానమునుగూడ గలిగిన వారగుటచేత, వీరు వివేకవర్ధనీ పత్రిక స్థాపించి తద్వారా, సంఘ దురాచారఖండన, మత, సంఘ సంస్కా-

రావశ్యకతలకై ప్రచారముచేసిరి. ప్రజారంజకమైన గద్య వ్రాసిరి. వర్తమానకాలమున పరిణతిగాంచిన వివిధ సంస్కారములకు అంకురములు నాటి మార్గదర్శియైన ఘనుడీతడు. ఈ గద్యరీతికి ఆంగ్లేయుల వలె ప్రహసనములు, వ్యాసములు, గద్యనాటకములు, చిన్న చిన్న కథలు, నవలలు, విమర్శనలు, విద్యార్థుల కుపయోగపడు వాచక గ్రంథములు, నీతి కథలు, వ్రాయుటయేగాక, సంస్కృతమునుండి నాటకముల యనువాదములు, ఆంగ్లమున వ్రాసియున్న శరీర శాస్త్రమును తెనిగించెను. ఆంగ్లకవుల ననుసరించి నాటకములను, చరిత్రలను స్వతంత్రముగా హృదయంగమముగా రచించెను. తర్కశాస్త్ర సంగ్రహము మున్నగునవికూడ తెలుగున చక్కగా సుబోధకముగా వ్రాయగలిగెను. నన్నయాది భారత కవులు పూర్వ వైదిక ధర్మప్రచారము నిమిత్త మేవిధముగా భారతమును వ్రాసిరో అట్లే వచనమున నూతన సంఘాభ్యుదయమునకై, తాము విశ్వసించిన ధర్మప్రచారము సలుపుటకై వీరు సకలమార్గముల పయనించిరి. ఆయన జీవిత కాలమున నామహనీయునిశక్తి, ఉపకారము సమకాలికులు గ్రహించకున్నను, విమర్శించియున్నను, హేళనచేసినను, అతడు నాటిన మొలకలు వృద్ధినొంది శాఖోపశాఖలుదాల్చి నేటి యాంధ్రులకు మాననీయమైనవి. వర్తమానకాలముననే సంస్కార మమలులోనికి వచ్చినను, ఆసంస్కార ప్రారంభ, ప్రచారములకు కందుకూరి వీరేశలింగంగారే యాంధ్రదేశమున కారణభూతుడు.

20—వ శతాబ్దమున 1910 సంవత్సర ప్రాంతమున ఆంగ్ల విద్యాధికులగు కొమర్రాజు లక్ష్మణ రావు ముఖ్యులు, విజ్ఞాన చంద్రికా మండలి నెలకొల్పి, దేశచరిత్రలు, నవలలు మున్నగు భాషాభ్యుదయసేవ చేసిరి. వీరి ననుసరించి ఆంధ్ర ప్రచారిణీ మండలి కొంతపనిచేసినది. కందుకూరి వీరేశలింగంగారు రచించిన రాజశేఖర చరిత్రమను నవల తెలుగున ప్రథమ నవలయైనను, నాటికి, నేటికి సాంఘికనవలలో నగ్రగణ్యముగానున్నది. దానిననుసరించి, వందలు, వేలు నవలలు దేశమున వెల్లివిరిసెను. వంగదేశీయులు ప్రారంభించివ్రాసిన నవలలు తెలుగునకు

భాషాంతరీకరణచేయుటద్వారాను, అనుకరణచేయుటద్వారాను తెలుగు నవలలు ప్రచారణలోనికి వచ్చెను. చిలకమర్తి లక్ష్మీనరసింహామూర్తిగారు రచించిన కర్పూరమంజరి, హేమలతలును ప్రశంసింపదగియున్నవి. తరువాతనవలలో ప్రమదావనము, వసుమతీవసంతము మున్నగునియును, చారిత్రక నవలలును వెక్కంటి ప్రాసిరి. ఇట్టినవలా ప్రవాహములో పద్యకావ్యములు, పూర్వగ్రంథములు చదువుటయే ప్రజలు మానివేసినారు. ఆర్య ధర్మ విజ్ఞానము, ఆర్య ధర్మ చింతన, మత ప్రసక్తి, సనాతన విశ్వాసములు అన్నియు తక్కిన భారతీయులతోపాటాంధ్రులును విస్మరించిరి. కానిసాహిత్యపిపాసకులకు మాత్రము కవితాపిపాస తగ్గలేదు. కాని వారి గ్రంథములు చదువువారు లేరు. అర్థము చేసుకొనువారు లేరు. ప్రబంధములసలే దురవగాహనములు, విషయశూన్యములు. తమ పిపాస, తమ విజ్ఞానము, తమ కవితా కౌశలము యేమికావలెనని యోజించిరి. పూర్వకవితకు తావులేనందున నూతన స్వరూప మొసగవలసియున్నది. ఇంతలో నాంధ్రోద్యమము ప్రారంభమైనది. దానితో నాంధ్ర రాష్ట్రము, ఆంధ్రాభ్యుదయము, ఆంధ్ర పౌరుషము, పూర్వాంధ్రోన్నతి మున్నగు నినాదములు చెలరేగెను. దానితో కవితకు నూతనోజ్జీవము గలిగెను. నూతన గౌరవ మంకురమయ్యెను. ఆంధ్ర మాతృసేవావసర ప్రచారమునకు తగిన కవిత నవలంబించిరి. శ్రీ బంకించంద్ర ఛటర్జీ, రవీంద్రనాథ ఠాకూరు మున్నగు వంగీయుల కవితలు, గద్యములు మన కాదర్శములు తాజొచ్చినవి. మనవారు కొందరు శాంతినికేతనయాత్ర చేసిరి, ఆ మహాకవి వాత్సల్యము గని ముగ్ధులైరి. సనాతన నూతన భావసమ్మేళన ప్రభావము మనవారి సమ్మోహితులజేసి వైచెను. బంకించద్రుని "వందేమాతరం" గేయము దేశాభిమానము పుట్టింపగా, భారత, ఆంధ్రమాత పూర్వగౌరవము మనకు స్మృతిగోచరమయ్యెను. రవీంద్రకవి శిష్యులు బయలుదేరిరి. ఆందోళనము తలయెత్తెనని ముందుజెప్పియుంటిని. ౧౨వ ఆంధ్ర మహా జన సభ నెల్లూరులో సమావేశమైనప్పుడు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు మధురకంఠమెత్తి :

సీ॥ అమరావతీపట్టణమున బౌద్ధులు విశ్వ విద్యా
లయములు స్థాపించునాడు
విద్యానగర రాజ వీధుల కవితకు పెండ్లి పందిరి
గ్లు గప్పించునాడు
ఓరుగల్లున రాజ వీర లాంఛనముగా
బహు శస్త్ర శాలలు నిలుపునాడు........

అని పూర్వాంధ్ర వైభవము పాడెను.

సీ॥ తన గీతి నరవ జాతిని పాతకులనుగా
దిద్ది వర్ధిల్లిన తెనుగు వాణి .......

యని ఆంధ్ర భాషా ప్రాశస్త్యము నుగ్గడించెను.

అట్టి రచనలు మఱికొంద రాంధ్ర కవులు సాగించిరి :

కృష్ణా తరంగపంక్తిం ద్రొక్కి త్రుళ్లింత నాంధ్ర
నాకలం నాట్య మాడు నాడు
సుకుమార శిల్ప వస్తు ప్రపంచమునందు నాంధ్ర
నైపుణి పంతమాడు నాడు........

ఇత్యాది చక్కని పద్య రచనలచే నాంధ్రుల మనము లుత్సాహత లూగించిన యీ కవులు ధన్యులు. దీనితో నాంధ్ర కవిత విహారము బహుముఖముల సాగినది.

ప్రాచీన కవులవలె పూర్ణోపమలతో కథావేగముతో నూతన భావ వైలక్షణ్యమును మేళవించి సొగసుగా కొందరు అధునాతన కవులు రచింపకపోలేదు. పురాణ ప్రబంధకవులవలె నవకవులు సయితము ప్రకృతి వర్ణనలు చేయుచున్నారు. కొందరకు ప్రకృతి యారాధ్యదేవతయే. అయినను రచనా వైఖరిలో, భాషలో, వస్తునిర్దేశములో కొంతభేదము కనుపడుచుండును. పైని దెల్పిన రా॥ సుబ్బారావుగారి రచనలు నూతన కవితావంథలకు మార్గదర్శకమైనను వీరి కవిత్వమున పూర్వకవులవలె, సరళ ధార, దీర్ఘ సమాసములు, సంస్కృతపద ప్రయోగము విరివిగా లేకపోలేదు. కాటూరి వేంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంత కవుల సౌందరనందము నందలి భాష బహుళ

ముగా సంస్కృతపద భూయిష్టమే. అయినను శైలిలో నొకవిధమైన
నూతనత్వము కనుపడుచుండును. శృంగారవర్ణనయున్నను ప్రబంధ
వర్ణనలపోల్కి గానబడదు. భావముల చందము భారతాది ధర్మప్రబో
ధక గ్రంథములలోనిదే యైనను, ఆయాభావముల ప్రదర్శనమున
క్రొత్తదనము దోచుచుండును. ఈ విధమైన గ్రంథములు సరసమై
ప్రాచీనార్వాచీన కవిత్వరసవేత్తల కందరకు సమ్మోదము గావించు
చుండును. అట్లే గడియారము శేషశాస్త్రిగారి కవిత్వసంపద శివభారత
మున తిలకింపవచ్చును. ఈ కవి పూర్వకవుల శైలి నవలంబించి శివాజీ
మహారాజ చరిత్రమును చక్కగా రచించియున్నారు. భారత నామ
ధేయ మిడుటలోనే కొంత సారస్యమున్నదని చెప్పవచ్చును. చరిత్రి
భారతచరిత్రవోలె ధర్మసంగర కథా విలసితము. కవిత్వమన్నచో
భారతి కవితారీతులతో, తియ్యదనముతో, రసవాహినులతో తొణికిస
లాడుటంజేసి, మధ్య మధ్య ధర్మ ప్రబోధక వాక్యము లుండుటంజేసి
యీకావ్యము నపరభారతమాయను నూహ గల్గుచుండును. అర్థపుష్టి
యందేమి, తెలుగు నుడికారమందేమి పూర్వకవులకు తీసిపోడీ కవి.
తిక్కన, దిట్టకవి. నారాయణకవులవలె, వీర రసమును ప్రదర్శించెను.
అనంతామాత్యునివలె కరుణరసమును జ్వాలింపజేసెను. వీరందరపై
కవిత్రియ ప్రభావము లేక పోలేదు. భాష యెంతమారినను, భావ పరి
వర్తన మెంత సంభవించినను, కవితా రచనా పద్ధతులలో నెట్టి నూత
నత్వము కల్పింప నెంచినను, వర్తమాన కవులలో పేరెన్నికగన్న
కవులు తిక్కన నారాధించుచున్నారు. తిక్కన కవి ననుసరించు ప్రయ
త్నములు చేయుచున్నారు. ప్రజలు నన్యకవులను అభినవ తిక్కన బిరు
దముల నిచ్చుచున్నారు. అనగా నిప్పటి సంఘము గౌరవించిన కవి,
అభినవ [illegible] తిక్కనయనుపేరు తగిలించినగాని గౌరవము లేదను
[illegible] తిక్కనవలె ప్రకృతి వర్ణనలు చేయలేకున్నను,
నేటి [illegible] ఛాయల ననుసరించుచున్నారు. తిక్కన రస పాత్ర
పోషణలు చూపలేకున్నను, ఆరీతుల కట్టు జాచుచున్నారు. తిక్కన
జూపిన శృంగార రస వర్ణనా వైదగ్ధ్యము నెఱప లేకున్నను, తొక్కి

మొట్టిగా యనుకరించి వ్రాయజూచుచున్నారు. తిక్కన శిల్పముజూచి తాను నట్లే శిల్పము చెక్కుటకు ప్రయత్నించుచున్నారు. రవి వర్మ చిత్రములను జూచి యితరు లట్లే చిత్రించుటకు ప్రయత్నములు సల్పు చున్నట్లు, తిక్కన భాష, శైలి, సాధ్యమైనంతవరకు దిద్దుకొను చున్నారు, తిక్కనభంగి జాతీయ పదప్రయోగ నైపుణ్యమునకై నేటి కవి ప్రాకులాడుచున్నాడు. కావ్యములలో నూతన కవులు విమర్శనా దృష్టితో తిక్కన కరణి పూర్వోత్తర సందర్భముల పొందిక నందికొన గోరుచున్నారు. భావస్ఫోరకపదరచనకై నభిలషించుచున్నారు. ఈ రీతిగా ఆధునిక కవులలో కవు లనదగినవారు పూర్వ సాంప్రదాయ ములకు వర్తమాన భావసంస్కార విహారములకు సామరస్యము గల్గించుటకును, కవితకు నూత్నశోభ గల్గించుటకును, తద్వారా ఆంధ్ర సాహిత్య సంపత్తికి పెంపు సంపాదింప నూహాలు చేయుచు, పథకముల వేయుచున్నారు. అట్లుగాక తక్కిన భావకవిత్వ లాలసులు పూర్వ సాంప్రదాయముల పూర్ణముగ విసర్జించి కేవల నూతన సాహిత్య ప్రపంచమునే సృష్టించుటకు పూనియున్నారు. దీనికి కారణము లనేక ములున్నవి.

భావ సంస్కారమేగాక నూత్న భావసృష్టి యొక్క కారణము. పాశ్చాత్య సంఘాచార సంఘూత సంఘట్టనమే యీ నవీన భావోద యమునకు మూలము. సృష్టికి మూలకారణము మాయాశక్తి యని తత్వవేత్తలు చెప్పుచుందురు. మాయవలన నిత్యానిత్యవస్తు విజ్ఞానము నశించును. అట్లే మోహావేశమున వివేకము సన్నగిల్లును. పాశ్చాత్య భావ వ్యామోహితులైన మనవారు జాతీయభావముల విస్మరించిరి. మనపూర్వ సాహిత్య ప్రయోజనము, ధర్మార్థ కామ మోక్షముల సిద్ధి. వీనికి పరస్పర సామరస్యమును కల్పించుచు, విశ్వ శ్రేయస్సు సంపాదించుటయే. ఈ యాశయముతో భారత, భాగవత, రామాయణములు మహోన్నత ఆశయములు గలవారై, త్రికాల వేదులైన ఋషులవలన రచింపబడినవి. అందు, రాజకీయార్థిక, నైతిక, సాంఘిక, ధర్మ, మతతత్వములకు స్థానముకలదు. సమస్త సాంఘికాభి

వృద్ధి కవసరములైన యుపాయాన్వేషణము చేయబడియున్నది. సుస్థిరమైన కొన్ని శాసనములు, మర్యాదలు, కట్టుబాట్లు నిర్ణయింపబడియున్నవి. నేటి ప్రజాస్వామిక పద్ధతులకై రాజ్యనిర్వాహణ జరుపబడకున్నను, అట్టివిధానమే యాచరణలో నున్నట్లు పురాణములవలన తెలియవచ్చుచున్నది. ప్రజాదరణము లేని రాజులు తొలగింపబడిరి. ప్రజా సహకారముతోనె పరిపాలన జరుగుచూ వచ్చెను. రాజు, ప్రజ లే యే స్థానము గల్గియుండిరో భారతములో చెప్పబడియుండెను:

కం॥ రాజునకు ప్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మ గాన రాజును ప్రజలే
యోజనయిన నన్యోన్య
భ్రాజితులై యుండవలయు రాజిత లీలన్॥

ఇంతకంటె నధికమగు రాజకీయాశయ మేమి గల్గును.

అష్టవిధ మంత్రులు, తదితర సకల పరిపాలనశాఖోద్యోగీయులు గలరు. రాజు నధికారమునకు గ్రామమున నాంతరంగిక పరిపాలనా సౌకర్యముండెను. నేటియున్నతనాయకులయాశయములుకూడా గ్రామ స్వపరిపాలనా పథకములు, పూర్వకాలమున ప్రచారణలో నుండలేదా? రాజకీయ విషయములేగాక సాంఘికార్థికస్థితి, ఆరోగ్యస్థితి, వృత్తులు, పరస్పరసహాయము, గ్రామ సాముదాయికాదాయములుమున్నగునవి గలవు— పురాణములలో నీ యంశములు వర్ణింపబడియేయున్నవి.

"సర్వేజనా స్సుఖినో భవంతు, లోకా స్సమస్తా శ్శుభమస్తు నిత్యం" అను మహాదాశయము నుద్బోధించు నిత్యదైవ ప్రార్థనల వైఖరి గమనార్హముగదా! నేటి రాజ్యాంగములు ప్రభుత్వములవలెను, ప్రతి వ్యక్తి కవశ్యమైన శాసనములు చేసిగి, ఆచరణలో పెట్టుచుండిరి.

వర్తమా నాంధ్ర కవులలో ప్రసిద్ధి నొందినవారిలో విశ్వనాథ సత్యనారాయణగా రొకరు. వీరి కవితలో కొంత ప్రత్యేకతగలదు. వీరు గీర్వాణాంధ్రాంగ్ల భాషా కోవిదులు. గద్య, పద్య, గ్రంథరచనా సమర్థులు. వీరి కవిత్వము పలువురు నవ్యాంధ్ర భావ పూరితులకు

నచ్చకపోవచ్చును. వీరికి పూర్వ హైందవ సంప్రదాయములయందు, పూర్వ కవుల రచనా రీతులయందు మంచియభిమానము గలదు. అధునాతన భావముల సంధప్రాయముగా ననుసరించుట వీరి స్వభావము కాదు. అట్లని పదప్రయోగ పద్ధతి కేవల పూర్వపు పద్ధతి కాదు. కేవల నూతనము కాదు. రెండు పద్ధతుల నిరంకుశముగా రచన చేయగలవారు. నన్నయకవిగారి కవిత్వపై ఖరియన్న వీరికి మిక్కిలి గౌరవము. నన్నయభట్టుగారి భారతరచనావిధాన పరిభావము వీరిపై కడుంగడు ప్రసరించినదనుట సాహసముగాదు. వీరి కవిత ప్రౌఢముగా నుండును. భావములు గంభీరముగా నుండును. ఉచితపద ప్రయోగమందు వీరి కభిరుచి మిక్కుటము. అయినను గంభీర భావములుసామాన్యపాఠకులకుసులభగ్రాహ్యములుగానుండవు. వారేశ్రావ్యముగా చదివి యర్థము విశదీకరించునపుడు, హృదయంగమైన భావము శ్రోతల కానందము గలుగజేయుచుండును. వర్ణనలలో పూర్వప్రబంధ కవులవలె దురవగాహ భావ సమగ్రత కానిపించుచుండును. వీరు రచించిన రామాయణ మొక యుద్గ్రంథము. రమణీయ భావ బంధురము. దీర్ఘసమాసము లున్నవి. రమణీయ మృదు పద విన్యాసము గలదు. వీరి యీగ్రంథము పురాణకావ్య కవితాపద్ధతిలో వ్రాయబడినదని చెప్పవచ్చును. పైనదెల్పిన కారణము లన్నిటివలనను, వీరి కవిత్వ మించుక శ్రుతికటువుగా నున్నను, చిరకాలస్థాయిగా నుండ గలదు. పాఠకుల యభిరుచుల ననుసరించి వారితాత్కాలిక మనోమోదముగూర్చు వారి ప్రోకడలు, వీరికి గిట్టవు. కవియైనవాడు తనకుతోచిన భావముల వ్యక్తపరచి పాఠకులకు భావసంస్కారము గల్గించుచుండును గాని పలువుర మెప్పునకై వారి యిష్టప్రకారము వ్రాయ నొల్లడు చూపరకు కావలసిన నాటకముల వ్రాసి ప్రదర్శించు ప్రస్తుత సినీమా రంగముల మార్గ మీ కవి కిష్టముగాదు. వీరిని గూర్చి యింతగా వ్రాయుట, వీరు స్వతంత్ర కవితారచన, స్వతంత్రభావములు గల్గి యనర్గళ ప్రౌఢకవిత్వ మల్లగలవారనియు, పూర్వ సత్కవి సాంప్రదాయ

ముల నత్యంత గౌరవము గలవారనియు, భారత కవిత్వ ప్రభావ మీ కవిపై గలదనియు విశదపరచుటకే.

ఈకాలమున విమర్శనా పాటవ మిక్కుటమైనదని మున్నె చెప్ప బడినది. నేటికవులసంఖ్య జనసంఖ్యకంటె మించిపోవుచున్నదేమో యను భీతి పొడముచున్నది. నాటకములసంఖ్య లక్షలుగానున్నవి. నవలలసంఖ్య వానితో పోటీ చేయుచున్నది. ఖండకావ్యముల కంతులేదు. విమర్శకులకు విసుగుపుట్టుచున్నది. విమర్శ చేయదగిన కావ్యముల వెదకుటకే శక్యముగాకున్నది. ఇక "కవి" యన నెవడు? అను ప్రశ్నపుట్టినది. నిర్వచనములు వేరువేరుగానుత్పన్నమైనవి. ఏకావ్యము చదివినచో హృదయమునకొకవిధమైనయానందముపుట్టునో, యొకసారిచదివినంతనే తనవిదీరక పలుమారు చదువవలెనను కోరికజనించునో. దేనిపేరువిన్న మాత్రముననే మనస్సంతోషము, నుత్సాహము గల్గునో, సారస్వతమున నిత్యనూత్నత దేని కబ్బునో అట్టి కావ్యము రచింపగలవాడే కవి యని కొందరు విమర్శకులు నిర్వచించియున్నారు. అట్టివారే కవులు, అట్టివే కావ్యములు. ఈ నిర్వచనదృష్టితో విలోకించినచో కావ్యము లన దగిన వెన్నిగలవు? భారత, రామాయణ, భాగవతములు మాత్రమే నిత్య నూత్నత గల్గి యెన్ని మార్లు చదివినను తిరిగి చదువ వలెనను నాసక్తి పుట్టించు కావ్యములుగా నున్నవి. ఇక "నాటకాంతే కవిత్వమ్" అని పూర్వులు చెప్పియున్నారు. కాని నేడు పద్యము నది తప్పులతో నల్ల ప్రారంభించు వారెల్లరు నాటక రచన మారంభించుచున్నారు. భాషాభివృద్ధి కావలెనని, తెలుగువారెల్ల గోరుచుందురు. భాషాభివృద్ధియన సరియైన మార్గమున పూర్వస్థితికి మెఱుగుబెట్టుట యగును గాని, భాషాకన్యను, విరూపిణిగాజేసి, నవ్యత, నూత్నశోభ యను పేర్లతో ముచ్చు బంగారు నగలు తగిలించి, నియమములు సడలించి, యిచ్ఛా విహారి గావించుట భాషాభివృద్ధియగునా? ప్రబంధములలో శృంగార వర్ణనలు మిక్కుటముగా జేసినారని యిప్పటి కవులను నిరసించు నిప్పటి కవు లేమి చేయుచున్నారు? ప్రబంధ కవులు శృంగార వర్ణన మధికము జేసినమాట యథార్థమే! కాని వారి సంస్కృత

పద భూయిష్ఠ సమాసాడంబరము మధ్య శృంగార రసము, పామరుల కర్థము కాదు. వర్ణనలు కేవల వర్ణన మాత్రములే. భాషా జ్ఞానమున కును భావ సృష్టిశక్తికిని దోహదము గల్గించునట్టి అపూర్వకల్పనల కాలవాలములై ప్రబంధము లున్నవి. అవి నిరసించు నవీనకవులు ప్రబంధశృంగారము నాచ్ఛాదించియున్న గీర్వాణకఠినపద సమాస యవనిక తొలగించి నిగూఢ శృంగారమును ప్రగాఢము చేయు తేట తెలుగు పదములచే బట్టబయలు చేయుచున్నారు. ప్రేమ యను నొక పదప్రయోగ మీ వర్తమానకవుల కలవాటయినది. ప్రేమ కపార్థము తీసి, ప్రేమ మోహముగా భ్రమించి యిచ్చవచ్చినట్లు వాడి, సిగ్గుల భావబోధకమైన ప్రేమశబ్దమున కవహాస్యము గల్గించుచు యువకుల నాకర్షించి, పాడుజేయు పుస్తకముల వ్రాసి చౌకరసమును తయారు చేయుచున్నారు. ఈదృశ్యమెంతయు శోచనీయము; గర్హ్యము. ఆంధ్ర మున నేగాక తక్కినభారతీయ భాషలలోనయిత మిట్టిరచనల చూచియే కాబోలు, బాబూ రాజేంద్రప్రసాద్ గారు, భాషాసమితుల నుద్దేశించి చెప్పుచు మోహోద్దీపనకర రచనల మాని ప్రజలకు నిరపాయకరమై, నిత్యజీవనసంపత్తి, నీతి, ధర్మము మున్నగు సద్గుణముల ప్రోత్సహించు రచనల సాగింపుడని యుద్బోధించిరి. వారి వినతి యరణ్యరోదనము గానే యున్నది.

" ఖాదనమేహనా కాంక్షమై
పశువులు జీవింపవే గ్రామ సీమలందు "

అని పోతన మహాకవి భక్తి హీనుల నిరసించి యున్నాడు. "విశ్వ శ్రేయః కావ్యమ్" అన్నారు లాక్షణికులు. "విశ్వ ప్రియః కావ్యమ్" అనలేదు. శ్రేయస్సనగా హితమని, ప్రియస్సు అనగా ప్రియ మనియు సామాన్యముగా నర్థము చెప్పుకొనవచ్చును. ప్రియవాక్యము మేలుచేకూర్పక పోవచ్చును. హితవాక్యము మేలు చేకూర్చునదియై యుండును. అట్లు లోకహితకారియగు కావ్యముల వ్రాయవలెనని పెద్దలు నిర్ణయించినారు. ఆ పెద్దభావములు మారవలెనని నేటియువకు, యువతుల యభిప్రాయము. అందుచేత ఆశయములు మారినవి. చార్వాక మతమువలె చాడువాక్యములతో నిండిన చౌకపుస్తకములు

చిత్తాకర్షణ సేయుచున్నవి. స్వైరవిహార లంపటులకు ధర్మనిర్ణయబద్ధ ములగు నీతిబోధక కావ్యము లింపుగావు. పైత్యరోగులకు తీపి చేదుగా నుండునుగదా! ఏతావతా, చెప్పదలచిన దేమనగా, వర్తమానకవులు కవయిత్రులు, తమపద్యకావ్యముల, తమవచనకావ్యముల, తమవ్యాస ములద్వారా నీతి బోధించి, ధర్మనిష్ఠ నెలకొల్పి, భగవద్భక్తి గల్గించి సంఘమునకు నిజమైన లాభమును గల్గించవలెను. మోహప్రవృత్తి పెంపొందించు కథలు, రచనలు, కవితారీతులలో శృంగార రస వర్ణనలు చేయక, యువక, యువతీ జనులు ధీరులై, పరోపకారులై, నీతిమంతులై దేశాభిమానులై, మనోనిగ్రహులై, దేశసేవాపరాయణులై వెలయు భావముల చొప్పించి కావ్యముల రచింపవలయును. ఇట్టి వారి కావ్య ములే శాశ్వతస్థాన మలంకరింపగలవు. తక్కిన చెత్త చెదారము స్వల్ప కాల జీవితము మాత్రమే గల్గియుండును. అయితే నొక యాశ మాత్రము పొడముచున్నది. నవీన కవులలో పెక్కండ్రు భారతాది పూర్వ కవికృత కావ్యముల సవిమర్శకముగా పఠించుచు, యందలి రసము, పదసౌష్ఠము, రచనావైఖరి గ్రహించుచు, తమ నూతన భావ ముల పూర్వ కవిసత్తముల రీతుల హత్తించుటకు కృషి చేయుచుం డుట ముదావహము. ఆంధ్రాభ్యుదయము నెల్లరు గోరుచునే యున్నారు. అభ్యుదయమునకు సాహిత్యాభ్యుదయ మవసరమనియును దలంచుచునేయున్నారు. కాని సాహిత్యాభ్యుదయ పంథా యిదమిద్ధ మని మాత్రము నిర్ణయించుటలో భిన్నాభిప్రాయములు గల్గి యున్నారు. అభిప్రాయము లాశయముల ననుసరించి వర్తించుచుం డుట సర్వ విదితమే. అందువలన భావ కవిత్వ మొకటి బయలు దేరి నది. వీరి వ్రాతలకు భావమే ప్రాధాన్యము. కవిత్వ నియమము లక్కర లేదు. ఎవరి చిత్తము వచ్చిన, నచ్చిన విధముగా, వారు వ్రాయ వచ్చును. గణ, యతి, ప్రాసలక్షణము పాటింప నక్కరలేదు. వస్తువు దొరకిన చాలును. తెలుగు పదములే యుపయోగింప నక్కరలేదు. గ్రామ్యాగ్రామ్య విచక్షణతో పని లేదు. వ్యాకరణ సూత్రము లసలే పనికిరావు. అందరకు తమ తమ భావ ప్రకటనా స్వాత్వ్యము కలదు. కావున, వానిని యే విధముగా తెలిపినను చిక్కులేదు. ఈ విధమైన

మనస్తత్త్వములతో కవిత నల్లుటకు ప్రారంభించినవారు నిరంకుశులు. "నిరంకుశాః కవయః" అను సూత్రము వీరికి వర్తించుచున్నది. అందు చేత వీరి కవిత్వము- పద్యమో, గద్యమో, ద్విపదయో, రగడయో యెవ్వరికి తెలియదు. ఈ రగడలో భాష తారుమారైనది. భాషకు గల ప్రాంతీయ, మాండలిక భేదము లధికమైనవి. ఆంధ్ర దేశమున కం తకు కావ్య బద్ధమగు నొకే భాషకు భంగము గల్గినది. ఏ మండలమున జనులు, జానపదులు వారు శబ్దములతో నా మాండలిక కవి వ్రాయు గ్రంథము తక్కిన మండల వాసుల కర్థము కానేరదు. ఇట్టి వైపరీ త్యము గూర్చుటవలన భాషాభ్యుదయ మార్గము గాజాలదు. భాషా జ్ఞానము చాలినంత లేనివారు కవిత్వమునకు బూనుకొనరాదు. అట్టి వారి వ్రాతలు కవిత్వము కానేరదు. కవిత్వాభాస మాత్రమే యగును. భాషాభ్యుదయ వాంఛాపరు లీ విషయము గమనింపదగును.

ఆంగ్ల భాష దిలకింపుడు. సంభాషణా భాష, కావ్య భాష కాదు. ఆంగ్లేయులు శాసనబద్ధ బుద్ధులు. రాజకీయ శాసనములందు గౌరవము వారికి మెండు. అట్లే సాంప్రదాయ సిద్ధ పద్ధతులు భాష యందును నెరపుచుందురు. మనకో, రాజకీయ శాసనము లములనందు శ్రద్ధలేదు. ఉల్లంఘనమే మన యాచరణయందు స్వభావము. ఆ స్వభా వము ననుసరించియే భాషా విషయమునను వర్తించు చున్నది. కర్త వ్యాకర్తవ్య విచక్షణ సంపాదించుకొనవలసిన యావశ్యకత మన కున్నది. చదువరు లీ యంశమును గమనించి నూతన సాహిత్య రీతుల నిర్ణయించుకొని తద్వారా భాషాభ్యుదయమునకు దోహద క్రియ గావింపవలయును, పైన చెప్పినట్లు, ఆంధ్రభాభ్యుదయము, ఆంధ్రభాషా భ్యుదయము ఆంధ్రులందరి యాశయమై యున్నది. అందు భాషాభ్యు దయ మేకదేశ మాత్రమై యున్నది ఆ భాభ్యుదయోద్యమము సర్వ తోముఖ వ్యాప్తమై యుండును. ఏతస్సిద్ధికై కేవల సాహిత్యము మాత్రము చాలదు. వివిధ ప్రకృతి శాస్త్ర సమగ్ర విజ్ఞాన మవసరము. ఆ విజ్ఞానము సయితము భారత రామాయణాది గ్రంథ రాజముల యందు కలదు- గణిత శాస్త్ర విజ్ఞానముతో సహా. ఖగోళ శాస్త్ర పరి చయము చూపి, నవీన పాశ్చాత్య, వైజ్ఞానిక పరిశోధనా ఫలములతో

తుల తూగగల విజ్ఞానము భారతీయులకు కలదని నిరూపించుటకును, తత్త్వశాస్త్ర పఠనా కౌతూహలము కలిగించుటకై దిఙ్మాత్రముగా పురాణములయందు సూచనలు చేసినారు. దానివలన కవికి విస్తరమైన సమస్త శాస్త్ర విజ్ఞాన పరిచితి వలయునని తెలియుచున్నది. అందువలననే భారతాది పూర్వగ్రంథములు నిత్యనవీనములై విలసిల్లుచున్నవి. వానియందు విశ్వాసములేని నవీన యువకసంతానము ఆంగ్ల మానసపుత్రులై, ఆంగ్లమున దిన దినము ప్రకటింపబడు చౌకపుస్తకముల చదువుటచే లభించిన మిటమిటజ్ఞానము గైకొని విమర్శకు నిలువజాలని, నిజమైన ప్రయోజనములేని అసభ్యమై యువక చిత్తాకర్షణము మాత్రము కలుగ చేయగల, నిరర్థక గ్రంథములను, అచ్చొత్తించి, పఠితలను పాడుచేయుచున్నారు. ఇట్టి పుస్తకముల విలువ యెంత? ఒకపర్యాయము చదివిన దానిప్రయోజనము తీరిపోవును. దానిప్రయోజన మనగా ఆగ్రంథకర్తకు కొంత ధనము చేకూరుటయే. ఈనాడు వెలువడుచున్న పుస్తకజాలములో ప్రకృతిశాస్త్ర విజ్ఞానమునుగూర్చి రచింపబడుచున్న గ్రంథములు యథార్థముగా పరమప్రయోజనము కలవై యున్నవి. అట్టిగ్రంథములు వ్రాయువారు కవులుకారు. కవులమని పేరుపెట్టుకొనరు. అందు నూటికి నూరు వచనగ్రంథములే. అందువల్ల ఆవిమర్శన మనకక్కరలేదు. ప్రపంచమున ప్రతిదేశమునందు కళలు రెండు విధములుగా నున్నవి- లలిత కళలు, వృత్తి కళలు. వృత్తి కళలనే వృత్తి విద్యలు [illegible] గాన సంగీత సాహిత్య, చిత్రలేఖన, మున్నగునవి లలిత కళలు [illegible] సకలప్రకృతిశాస్త్ర విద్యలును వృత్తి కళలుగా పరిగణింపబడుచున్నవి. అందుచేత వృత్తి విద్యాసంబంధమైన శాస్త్ర గ్రంథములను, తత్త్వశాస్త్ర సిద్ధాంత ప్రయోగ విధానములను తెలుపు గ్రంథములను వృత్తికళాగ్రంథములని చెప్పవొప్పును. ఈ వ్యాసరచనోద్దేశ్యము కేవల సాహిత్యసంబంధమైయున్నది. అందుచేత నూతన సాహిత్యపరులు చెప్పుకొనునట్టి, వర్తమానకాలమున ప్రకటింపబడు అసంఖ్యాకగ్రంథమాలలు, నవలలు, నాటకములు, ఖండకావ్యములు మున్నగు లెక్కలేనన్ని పుస్తకములు నిజముగా. దేశనాగరి

తకు, దేశ సౌభాగ్యమునకు, దేశాభ్యుదయమునకు తోడ్పడు నభిప్ర
క్రని విస్తరింపగలవా? లేక, శుష్క ప్రాయములుగా నున్నవా? యను
ంశమును ఆంధ్ర విద్యార్థికులు, నాయకులు, సాహిత్య పరిషత్తులు,
రికించి, తగినమార్గముల నన్వేషించి, రాష్ట్రమున వెలువడుచున్న
వెత్త పుస్తకముల నిరుత్సాహ పరచి, సత్యముగా నాంధ్రాభ్యుదయ
సాధకములైన సత్సాహిత్య వ్యాపక గ్రంథముల రచనను ప్రోత్స
గాంప వలసిన యవసరము మిక్కుటముగా గలదు. ఏ నవల చూచి
ను, యే నాటకము చూచినను, యే సినిమా తెరలు వీక్షించినను,
యే పాట విన్నను విషాదము గల్గించుచున్నవి. ప్రజల నీతికి భంగ
రముగా నున్నవి. పైన దెల్పినట్లు ప్రేమ కపార్థము కల్పించి, ఆ పద
పవిత్రతకు మాలిన్యము కల్గించి, అట్టి మలిన ప్రేమకే పట్టాభిషేకము
నేయుచున్నా రిప్పటి కావ్యకర్తలు. వీరు మెచ్చి, వేనోళ్ల పొగడి,
వ్యాపింప జేయు ప్రేమ, ప్రేమ కాదు. బుద్ధ దేవుని ప్రేమ నిర్వచనమే
ప్రేమ. అది, నిష్కళంక, వినిర్మల, జగద్వ్యాపిత ప్రేమయై యున్నది.
ఆ ప్రేమకు స్త్రీ, పురుష భేదము లేదు. కుల, మత విచక్షత లేదు.
మానవ, జంతు భేదము లేదు. అట్టి ప్రేమ, అత్యంత శ్లాఘ్యము, అను
సరణీయము. కాని నవభావ పూరిత, యువక రచిత, గ్రంథలక్ష్య ప్రేమ
కేవల స్త్రీ, పురుష పరస్పర మోహాత్మక పశుప్రేమ. అందుచేత వీరి
రచనలు గర్హింప దగినవి. భారతాది గ్రంథ పఠనము, విధిగా చిన్న
తనమునుండి ప్రతి ఆంధ్రునకు, నిర్బంధము చేయవలసి యున్నది.
ఇంతకంటె నధికముగా యిందు విషయమై చెప్ప బనిలేదు. వీరి రచ
నలనుండి యుల్లేఖింపబడదగిన వాక్యములు లేవు; ప్రయోజన కారియును
గావు. కాలపరిణామమున భాష, స్వరూపము, రాజకీయములు, శాస్త్ర
విజ్ఞానము నిరంతరము మార్పుజెందుచున్నట్లే, భావములు, రుచులు,
సంస్కారము చెందుచున్నట్లే, రచనా పద్ధతులు మారక తప్పవుగదా!
భారతాది కావ్యములందలి పురాణ శైలిని కొంతమార్చి నూతన
శైలి నుద్భవింపజేసి పురాణశైలిస్థానే కావ్య పురాణములు కొంత
కాలము సాగినవి. ఈ కావ్య ప్రబంధము పాకమునం దభిరుచి తగ్గి కేవల
ప్రబంధములు తమ వైఖరి చూపినవి. కొంతకాలము శ్లేషలకు, ధ్వను

లకు గౌరవము గలిగినది, వానిపై వెగటు పుట్టి తిరిగి పురాణశైలికి కొంచెము కొంచెముగా ప్రజారంజన సంఘటిల్లినది. అవి పోయి పాశ్చాత్య భావ వైభవ వ్యాప్తి సంభవించి మతియొక నూతన కవితా విధాన మములులోనికి వచ్చినది. కథావస్తువు, భావము, రచనా పద్ధతి యను, మూడు విషయములు ముఖ్యములే యను భావము కొన్నాళ్ళు, రచనయే ముఖ్యమని కొన్నాళ్ళు తలంచి కవులు, పండితులు,- రసజ్ఞులు తమ తమ కావ్యముల నా మార్గమున నడపించుచు వచ్చిరి. కాని గత సుమారేబది సంవత్సరములనుండి భావమునకే ప్రాధాన్యత నొసంగుచు తక్కిన పరికరములనుగూడ పోషించుకొనుచు గ్రంథములను రచించిరి. ఇటీవల గత వింశతి వత్సర కాలమున భావమే కవిత- రచన యెట్లున్నను, రస మెట్లున్నను సరే. వాస్తవికతకు, తదనుభూతి గల కవితకు గౌరవ మిచ్చిరి. అందుచేత యెవరి మార్గము వారికి వచ్చినది. స్వాతంత్ర్యము లభించినది. ఈ సరళిలో గ్రంథము లుత్పన్నమైనవి. వీని వైఖరులు నిరంకుశ, నిరాలంబదోషభూయిష్ఠమై పోయి మరల ప్రజారంజనకు దూరమైపోయినవి, పోవుచున్నవి. ప్రథమమున నీ భావకవితా ప్రాశస్త్య మంగీకరించినవారే తమ యభిప్రాయముల నాలోచించి, తరచి, విపరీత పరిణామముల నాలోకించి, తిరుగ తోడ నారంభించిరి. పోంగు చల్లారినకొలది వస్తు స్వభావ, స్వరూపముల నరసిచూడ వీలు గల్గెను. ఏతత్కారణముచే రచనా విధాన మవసరమనియు, సంతుష్టికరముగా నుండవలయు ననియు నెంచిరి. వ్యాకృతి నియమములు వీడుట మంచిదికాదన జొచ్చిరి. తత్ఫలితముగా నిప్పుడు వెలువడుచున్న పద్యకావ్యము లొక క్రొత్త దనము దాల్చినవి; కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించి మార్గ గామియైన వివిధోద్యమములు క్రమ క్రమాభివృద్ధి నొందెను.

ఆంగ్ల కవులు కాల్పనిక కవిత్వము పూర్వము చెప్పుచుండెడి వారు. వారి ననుసరించి వంగరాష్ట్ర కవులుకూడ ప్రథమమం దట్టి కవిత గద్యమున, పద్యమున ప్రారంభించిరి. వారి ననుసరించి యాంధ్రులు వ్రాయజొచ్చిరి. వెంకట పార్వతీశ్వరులు మున్నగు కవులు వంగభాషా గ్రంథముల నాంధ్రభాషలోని కనువదించి పైన దెల్పిన

కాల్పనికా విధానమును వ్యాపింప జేసిరి. కందుకూరి వీరేశలింగం పంతులుగారి యుద్యమము ముఖ్యముగా రాజా రామమోహనుడు, బంకించంద్ర చక్రవర్తి, ద్విజేంద్రలాలు మున్నగువారి మానవోద్యమ మని చెప్పదగిన రచనల, భావముల నాధారపరచుకొని యుపక్రమింపబడెను. మానవజాతిలో నెల్లరు సమానులనియును, కావున సమానహక్కులు వలయు ననియును, స్త్రీ, పురుషు లందరు విద్యావికాసమంది, వివాహాది సకల వ్యవస్థలయందు పురుషులతో పాటు సమస్వత్వముల పొందుట కర్హు లనియును మొదలగు సిద్ధాంతముల వ్యాపింపజేయుటకు వీరు తమ రచనలద్వారా ప్రయత్నము జేసిరి. ఈ పని చేయుటకు వలసిన శైలితో సందరకు విషయము గ్రహించుట కనువైన రీతుల ననేకవిధ పుస్తకముల వ్రాసిరి. వీరి కనుయాయులగువారు వీరి రచనల ననుకరించి వృద్ధిజేసి యున్నారు. ఈ కాలమందే కొందరు స్వీయచరిత్రలు వ్రాయజొచ్చిరి. తద్వారా వ్యక్తి జీవితముల వాస్తవిక రీతులతో నూతనమార్గము చూపియున్నారు. ఆంగ్లమునను స్వీయచరిత్రలుండుటచేత వాని యనుకరణ నలవరచుకొన్నారు. వీరేశలింగం పంతులు, గాంధి, జవహర్ లాల్, టంగుటూరు ప్రకాశం పంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారలు తమ యాత్మకథలు వ్రాసికొనియున్నారు. పైన దెల్పిన రెండు తెఱగుల సాహితి గాక భారత రాజకీయోద్యమ ప్రభావమువల్ల నొక విధమైన సాహిత్యము గద్యముద్వారా మన దేశమున విజృంభించినది. జాతీయోద్యమ ప్రభావ మాంధ్రుల కవితా రచనలలో నధికముగా పొడచూపి యున్నతస్థాయికి వచ్చినది, కాంగ్రెసు ప్రచారము, గాంధీగారి సహాయ నిరాకరణోద్యమమును ప్రోత్సహించుచు ప్రజల నుద్బోధించుచు పెద్దకవులు. చిన్న చిన్న కవులు, మధ్యరకపుకవులు వేలకువేలు పద్య సంపుటములును, కరపత్రములును దేశమున వెదజల్లినారు. తద్వారా భాషాభివృద్ధి కవితా రీతులు బెంపొందిన వనుటకు సందియము లేదు. ఆంధ్ర సాహిత్య పరిషత్తులు సామాన్యముగా పద్యరచనా గ్రంథముల యభివృద్ధికై పాటుపడుచున్నవి. ప్రస్తుత విమర్శకులలో రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, నోరి నరసింహశాస్త్రి, మల్లాది సూర్య

నారాయణశాస్త్రి మున్నగువారు పూర్వనవీన కవితారచనలయందు సమానగౌరవము గలిగియుండుటచేత వారు పూర్వ కవితా రీతులను త్యజింపక నూతనభావములను, సనాతన భావములను సమన్వయపరచి సాంప్రదాయముల ననుగమించి తెలుగు కవిత్వమునకు తెలుగుదన మిచ్చి పూర్వవైభవము మొక్కవోకుండా వ్రాయు కవిత్వమునకు దోహద మొసంగుచున్నారు. ఇది మిక్కిలి శుభసూచకము. కావ్యము రచించినచో పాఠకులకు తాత్కాలిక సంతుష్టి మాత్రమేగాక, భూత భవిష్య ద్వర్తమానకాలముల ధర్మాధర్మవిచక్షణ, భాషనిలుకడ, పఠనశ్రావ్యత కలుగునట్లు వ్రాయవలెను. దీనివలననే భాషాకన్య నిరంతర ప్రవర్ధమానయై, సర్వాంగసౌష్టవము గలదై, మనోజ్ఞమై, అజంతా శిల్పచిత్రమువలె చిరస్థాయిగా నుండును. ఈ దృష్టితో కవులు తమ రచనల నలవరచుకొనుట మిక్కిలి యవసరము.

పైన వ్రాసిన కవితా విషయములన్నియు నీ క్రింది రీతిగా, సింహావలోకనము చేయవచ్చును. నన్నయభట్టు నాటిన ఆంధ్ర కవితా వృక్షము, తిక్కన సోమయాజి పోషణచే శాఖోప శాఖలు కలిగినదై, ఎఱ్ఱా ప్రగడతో చిలువలు, పలువలు వేసి, భాస్కర, సోమ, శ్రీనాథ కవిత్వమున బ్రమానుగట్టి, పోతరాజు సుధాద్రవముచే పల్లవించి, శ్రీకృష్ణ దేవరాయల కాలమున పెద్దనాదులచే పెంపొంది రామరాయ భూష ణాది కవుల రచనలచే ఫలాలంకృతమై సంపూర్ణ వికాసము గాంచి, పిమ్మటి అంధపాయ ప్రబంధ కవితా హేమంత శిశిర వాతా ఘాత ములచే, నాకురాలి మోడైనను, వర్తమానకాల నూతనభావ మాలయ మారుత వీచికలచే వసంత విలాసముదాల్చి, వినూతన, పల్లవరాగ, సమాకర్షకమై మనోహర రూపము దాల్చెనని చెప్పవచ్చును. ఇంతకు నసలు చెప్పదలచినదేమంటే వర్తమాన కవులపై పోతనామాత్యుని కవితా ప్రభావమును, ప్రబంధ కవుల కవితా ప్రభావము నెక్కువగా ప్రసరించి యున్నదనియు, కవిత్రయ కవితా ప్రభావము తక్కువగా నున్నదనియు, దోచుచున్నది. కావున నేటి కవుల కవిత్వ పరిశీలన నింతటితో ముగించుచున్నాను.



---